"భాగవతాన్ని జీవితాంతం పానం చేయండి."

ఓం గణేశాయ నమః - శ్రీ శారదా బాయై నమః - శ్రీకృష్ణ పరమాత్మనే నమః.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## షష్ట, సప్తమ స్కంధాలు

తృతీయ సంపుటము.






అనువాదకుడు, ప్రకాశకుడు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

భాగవత మందిరం – రాజమండ్రి-4.


...స్ : శ్రీశ్రీశ్రీ ఓం నారాయణ్ జీ మహరాజ్ వారి ఆశీస్సులతో.
...హత్సం : బ్రహ్మశ్రీ జటావల్లభుల కృష్ణ సోమయాజులుగారు &
...స్ : శ్రీయుత ఇ. అహోబలరావుగార్ల సంపూర్ణ ప్రోత్సాహంతో

# ద్భాగవత మహాపురాణము

## షష్ఠ, సప్తమ స్కంధాలు

## తృతీయ సంపుటము.

ప్రథమ ప్రచురణ :
ది. 15-5-1992
వైశాఖ పూర్ణిమ

*

మూల్యము :
రు. 25-00

ముద్రణా నిర్వహణ :
భరద్వాజా బైండింగ్ వర్క్సు
రాజమండ్రి - 4.

*

ప్రతులకు :
**ణపండ రాధాకృష్ణమూర్తి**
శ్రీ టాకీస్ రోడ్ — రాజమండ్రి-4.

ఫోన్ : 76356.

# ఎవరో ఆ మహా భాగ్యశాలురు ?

విశ్వవ్యాప్తంగా గల శ్రీకృష్ణ భక్తులకు, అసంఖ్యాక భక్తజనులను విశేషంగా
ంచే శ్రీకృష్ణ ఆలయ, మందిరాలకు - (ఆంధ్రభాష తెలిసిన వారికి) వేద పండితు
హరిదాసులకు, పౌరాణికులకు, భక్త సమాజాలకు, సత్సంగాల వారికి - దాతల
స్థ సహకారంతో సుమారు 10 లక్షల రూపాయల వ్యయంతో.

# శ్రీకృష్ణ లీలామృతము

గ్రంథ రత్నం యొక్క 18 వేల ప్రతులను ప్రచురించి వారి ద్వారానే ఉచితంగా
ేయ బూనినాము. ప్రథమ ప్రచురణగా ముద్రించిన ప్రతులు పూర్తికాక మునుపే
ం ప్రచురణ ప్రయత్నాలు చేస్తున్నాము.

లక్ష రూపాయల వంతున అందజేయగల ప్రథమ శ్రేణికి చెందిన దాతలను
ంగా 10 మందిని ఆహ్వానిస్తున్నాము.

## అపూర్వ మహత్తర సదవకాశము

వీరి వంశ పరిచయంతో కలర్ ఫొటోను శ్రీకృష్ణ లీలామృతంలో ప్రచురించి -
నిమిత్తం శ్రీకృష్ణ లీలామృతం యొక్క బైండ్ ప్రతులను 500 అందజేసెదము.
గోత్ర నామాలపై సర్వ రక్షాకర ధారణా యంత్రాన్ని మేలిమి బంగారంపై

ం అందిన తరువాత మండల దీక్షానంతరం - పూజచేసి, సిద్ధివేసి అందజేసెదము.
టోను యిక్కడ ప్రచురించబడు గ్రంథా లన్నిటిలోనూ ప్రకటించి 250 కాపీలను
యోగార్థం పంపుచుండగలము.

పరమాత్మ ప్రసాదించిన సదనకాశాన్ని శ్రీమంతులైన ఉదారులారా! సద్విని
చేసుకోండి. కోటి గో భూ, సువర్ణ, వస్త్ర, అన్నదానాలను అధిగమించిన
ఫలాన్ని అధికమించిన ఈ గ్రంథరత్న ప్రచురణ ప్రచార, వితరణ రూప జ్ఞాన
కి సహకరించి శాశ్వత కీర్తిని పొందండి. పరిపూర్ణ దివ్యావతారుడైన శ్రీకృష్ణ
దివ్యానుగ్రహాన్ని పొందండి. ప్రచారమే మా లక్ష్యం, గ్రహించి సకాలంలో
ంచండి. మీ నుండి ద్రవ్యం అందిన శతదివసముల కాల వ్యవధిలో గ్రంథరత్న
మ ప్రకటనానుసారం అందజేసెదము. మీ మార్గం సభ్యులకు సర్వదా ఆదర్శ
గాక! ప్రచురణ కాపీని మీ కోరికపై - మీ పరిశీలన నిమిత్తం పంపగలము.

వివరాలకు:

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

జయశ్రీ టాకీస్ కుడివైపు సందులో

రాజమండ్రి - 4.

---

న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే నమృతత్త్వ మానసుః.

---

సుఖస్య మూలం ధర్మః - సుఖపడడానికి మూలము ధర్మము.
ధర్మో రక్షతి - రక్షితః - తనను రక్షించు వారిని ధర్మం రక్షిస్తుంది.

---

**నాడ - రామదాస్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ ఛైర్మన్**
**యుత కె. వి. ఆర్. చౌదరి గారి సౌజన్య శుభాకాంక్షలతో.**

---

**ంకాపల్లి : శ్రీశ్రీశ్రీ స్వప్రకాశానందావధూతస్వామి వారి**
**దివ్య సందేశ, అమృతాశ్యాశీస్సులతో.**

# శ్రీమద్భాగవత మహాపురాణము

## షష్ట, సప్తమ స్కంధాలు
## తృతీయ సంపుటము.

### విషయానుక్రమణిక :

### షష్ట స్కంధము


| విషయము | పుట |
|---|---|
| అజామిలోపాఖ్యానము | 5 |
| భాగవత ధర్మ నిరూపణ, అజామిళుడు పరమ పదం చేరుట | 15 |
| దూతలతో యమునకు సంవాదం | 19 |
| దక్షుని స్తుతికి భగవంతుడు సాక్షాత్కరించుట | 22 |
| దేవర్షి నారదునివల్ల దక్ష కుమారులు విరక్తులగుట. | |
| దక్షుడు నారదుని శపించుట | 29 |
| దక్ష పుత్రికల వంశ వర్ణన | 33 |
| దేవ గురువు అమరులను త్యజించ గా వారు విశ్వరూపుని ఆశ్రయించుట | 37 |
| నారాయణ కవచము | 40 |
| విశ్వరూప వధ, వృత్రాసురుడు ఆవిర్భవించి, దేవతలను జయించుట, | |
| శ్రీహరి ప్రేరణానుసారం అమరులు దధీచి మహర్షి నాశ్రయించుట | 44 |
| అమరులు దధీచి వెన్నెముకతో వజ్రాన్ని నిర్మించుట, | |
| వృత్రాసుర సేనలతో వారు పోరాడుట | 54 |
| వృత్రాసురుని ధైర్య వచనాలు, దైవ ప్రాప్తి | 57 |
| వృత్రాసుర వధ | 61 |
| బ్రహ్మహత్య మహేంద్రుని ఆవహించుట | 64 |
| వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతము | 67 |
| అంగిరస నారద ఋషులు—చిత్ర కేతువునకు జ్ఞానోపదేశం చేయుట | 72 |
| చిత్ర కేతునకు వైరాగ్యం సిద్ధించ, సంకర్షణుడు సాక్షాత్కరించుట | 75 |

పార్వతీమాత చిత్రకేతువును శపించుట 82
అదితీ, దితుల సంతాన వర్ణన, మరుద్గణోత్పత్తి 85
పుంసవన వ్రతానుష్ఠాన విధానము 92

## సప్తమ స్కంధము

నారద ధర్మరాజుల సంభాషణ, జయ విజయుల గాధ 95
సోదరుని మరణానంతరం హిరణ్య కశ్యపుడు బంధు బాంధవ
సమేత అయిన మాతృ మూర్తికి ధైర్యం చెప్పి ఓదార్చుట 100
హిరణ్య కశిపుడు తపస్సు చేయుట, వరాలు పొందుట 106
హిరణ్య కశిపుని దురాగతాలు, ప్రహ్లాదుని సద్గుణ వర్ణన 109
ప్రహ్లాదుని అంతంచేయ హిరణ్య కశిపుడు ప్రయత్నించుట 114
మిత్రబృందానికి ప్రహ్లాదుడు జ్ఞానోపదేశం చేయుట 119
నారదోపదేశాన్ని ప్రహ్లాదుడు మాతృ గర్భంలో ఉండి ఆలకించుట 123
నృసింహావతార ప్రాదుర్భావము-హిరణ్య కశిప సంహారము 129
నృసింహదేవుని ప్రహ్లాదుడు స్తుతించుట 137
ప్రహ్లాదుని పట్టాభిషేకము-త్రిపుర దహనము 145
మనుష్య, వర్ణ, స్త్రీ ధర్మాల అభివర్ణన 151
బ్రహ్మచర్య, వానప్రస్థ నియమాలు 154
యతి ధర్మ వర్ణన, అవధూత ప్రహ్లాద సంవాదము
గృహస్థ ధర్మాలు 162
రాక్ష ధర్మ వర్ణన 165



ఓం గం గణపతయే నమః - కృష్ణం వందే జగద్గురుం ఐం-హ్రీం-శ్రీం

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-1

### అజామిళోపాఖ్యానం

శుకమహర్షికి ప్రణమిల్లి భాగవత కథా శ్రవణ కుతూహల మానసుడైన పరీక్షిన్మహా ప్రశ్నిస్తున్నాడు.

"మహాత్మా! గతంలో తమరు నివృత్తి మార్గ, అర్చిరాధి మార్గాల ద్వారా - జీవుడు లోకంలో ప్రవేశించి ముక్తుడవుతాడని కదా చెప్పారు. ప్రవృత్తి మార్గంలో సత్త్వ మోగుణ యుతమైన స్వర్గాది లోకాలు లభిస్తాయనీ ప్రకృతి బంధన బంధితుడైన వాడు ం పొందజాలక జనన మరణ రూప సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తుంటాడనీ వర్ణిం అధర్మ కర్మాచరణవల్ల ప్రాప్తించే నరక యాతనలను గురించీ మన్వంతర వర్ణనా కూడ ప్రియవ్రతోత్తానపాదుల ప్రసంగంలో గిరి ద్వీప సాగర నదీ నద వన జంబూ వృక్ష వర్ణన కూడ చేశారు. భూమండల స్థితీ, తదంతర్గత తద్వీప, వర్ణ విభాగ, పరిణామ, నూ నక్షత్రస్థితినీ సప్త పాతాళ లోకాల వర్ణనచేస్తూ పరమాత్మ ఏ సృష్టిని ఏ రీతిగా చెప్పారు. ఇప్పుడు రౌరవాది భయంకర నరకాల నుండి మనుష్య మాత్రులు తప్పించు పాయాలను, అనుష్ఠాన విధానాలను వర్ణించండి.'' అని అర్థించగా శుకమహర్షి బదులు కున్నాడు.

"పరీక్షిన్మహారాజా! త్రికరణాల ద్వారా పాపాలు చేసేవాడు యిహంలోనే వాటికి శ్చిత్తం చేసుకుంటే సరేసరి, లేదంటే జన్మాంతరంలో దుర్భర నరక యాతనలు అనుభ తప్పదు. తన్నరకయాతలను గురించి గతంలో వర్ణించాను కదా! రోగ, మృత్యువులు ందే మానవమాత్రుడు త్వరిత గతిని పాప విచారణ చేసుకుని ప్రాయచిత్తం చేసుకో సమర్థుడైన వైద్యుడు వ్యాధి హేతువులను, వాటి తారతమ్య భేదాన్నీ గ్రహించి వెను వైద్యం చేసి వ్యాధిని నిర్మూలించేటట్లు ప్రాయశ్చిత్తాల ద్వారా మానవుడు పాపాలను

గాపుకోవాలి." అంటూ పలికిన శుకమహర్షిని తిలకిస్తూ పరీక్షిత్తు – స్వామీ! ప్రభు
ుల ద్వారా వేధింపబడేవాడు – శాస్త్రోదేశిత నరకాదులను అనుభవించక తప్పదని
కూడ – పరాధీనుడై పదే పదే దుష్కర్మలే ఆచరిస్తూంటాడు. అట్టివాడు ఎలా ప్రాయ
చేసుకోవాలి! పాపాలను ఒకచో ప్రాయశ్చిత్తాల ద్వారా రూపుమాపుకుని మరొకచో
నః ఆ పాపకర్మలే ఆచరిస్తూంటాడు. అట్టి జాతికి చెందినవారు మోక్ష సామ్రాజ్యాన్ని
దెట్లు? ఏనుగు పావన గంగలో స్నానం చేసి గట్టెక్కి ఒడలంతా దుమ్ము పోసుకున్న
– ప్రయోజన రహితంగా ఉండేవాడు పాప దూరుడెలా అవుతాడు?" అని ప్రశ్నించగా
బదులు పలుకుతూ – 'రాజా! కర్మ ద్వారా కర్మలు నాశనం కావు. కర్మలను మానవుడు
అజ్ఞానం వల్ల ఆచరిస్తూంటాడు. అజ్ఞానం సంపూర్ణంగా నాశనమయే వరకూ పాప
ు దూరం కావు. తత్త్వ జ్ఞానం మాత్రమే పాపాలను రూపుమాపుకోవడానికి ఏకమాత్రా
. మితంగా, హితంగా ఆహార వ్యవహారము పట్ల చరించ గలవాడు. ఆరోగ్య శాలిగా
లుగుతాడు. సదాచారంతో నియమంగా ఉండగలవాడే క్రమ క్రమంగా పాపదూరుడై
ప్రద తత్త్వ జ్ఞానాన్ని పొంద సమర్థుడవుతాడు. వెదురు పొదలలో ప్రభవించిన అగ్ని
దలనే రూపుమాపేటట్లు ధైర్య, స్థైర్య, ధర్మాసక్తులు కలవాడు తపో బ్రహ్మచర్య,
య సంయమన, సత్య, దాన బాహ్యాభ్యంతర, శౌచ యమ నియమాలనే సాధనల ద్వారా
పాపాలనూ రూపుమాపుకో గలుగుతాడు. కొందరు మాత్రం వాసుదేవ భగవానుని సేవిస్తూ
మార్గంతో ఆ దేవదేవుని కరుణామృత ధారలతో పునీతులై పాప సర్వస్వదూరు అవు
ారు, రాజా, సూర్య స్పర్శ మాత్రంచే మటుమాయమయ్యే మంచులా భక్తులు యిష్ట
నుగ్రహ మాత్రంచే పాపదూరు లవుతారు. భక్తజనసేవ, ఆత్మ నివేదనల ద్వారా పరిశుష్క
ట్లు మానవులు తపస్స్వాధ్యాయ దాన యజ్ఞాదుల ద్వారా కూడ పాప దూరులు కాజాలరు.
పుంగవులూ, శీల సంపన్నులూ, భక్తి పరాయణులూ యీ పథాన్నే అనుసరించారు.
కే పెద్దలు- జ్ఞానులు కూడ భక్తి మార్గాన్నే సర్వోత్కృష్ట మార్గంగా సువ్యక్తం చేశారు—ం
మార్గమే నిర్భయమై, కళ్యాణప్రదమైనది. సురాభాండాన్ని పావనగంగ కూడ పవిత్రం
జాలనట్లు భక్తిహీనుణ్ణి ప్రాయశ్చిత్తాది కర్మలు విముక్తుణ్ణి చెయ్యజాలవు. భగవద్గుణానురాగి
న మనో మధుకరాన్ని శ్రీకృష్ణ చరణ కమల మకరందా స్వాదన చేయించగల మాన
పాప సర్వస్వ దూరుడై స్వప్నంలో సయితం యమధర్మరాజును కానీ, ఆయన సేవకులను

హడడు. రాజా ! ఈ విషయమై విష్ణు — యమ దూతల సంవాద రూపమైన గాథ నొక
వినిపింప జేస్తాను ఆలకించు.

అజామిళుడనే విప్రోత్తముడు కన్యాకుబ్జమనే నగరంలో నివసిస్తుండేవాడు. వాడు
పెళ్ళాడి ఆమె కారణంగా సదాచార దూరుడై దురాచార రతుడై పోయాడు. దారులు కాస్తూ
, జూదాలాడుతూ మరోనాడు అన్యులను మోసగిస్తూ వారి ధనాదునులను అపహరిస్తూ,
వృత్తితో కాలాన్ని గడుపుతూన్నాడు. దాసీ కుటుంబాన్ని ఆశ్రయించి వారిని పోషించ
అనేకమందిని వేధించి బాధిస్తూన్నాడు. అలా వాడి జీవితంలో ఎనభై సంవత్సరాలు గడచి
యి. అప్పటికే ఆ దాసీ స్త్రీ వల్ల అజామిళునికి పదిమంది కుమారులు కలిగారు. ఆ
లలో కనిష్ఠుని పేరు 'నారాయణుడు.' మాతా పితరు లిద్దరూ కూడ వాణ్ణే అధికంగా
స్తూన్నారు. అజాళుడు వృద్ధుడైనా కూడ పుత్ర మోహంతో ఆ చిన్నవాణ్ణే మనస్సులో
ని కాలం గడుపు తూన్నాడు. వాడి చిలుక పలుకులకు, ఆటపాటలకూ మురిసిపోయేవాడు.
పేమ వశుడై — తనతోటే దగ్గరగా కూర్చో బెట్టుకొని వాడికి భోజనం పెట్టడం పాలూ,
త్రాగించడం చేస్తూ సదాసర్వదా వానితోటే కాలం గడుపుతూన్నాడు. మూఢ వశుడు
వల్ల దగ్గరలో ఉన్న మృత్యు కాలాన్ని కూడ గ్రహించలేక పోయాడు. అంతే ! మరణ
ం ఆసన్నమయిన వాడు ప్రియ కనిష్ఠ కుమారుణ్ణే చింతిస్తూండగా వికట భయంకరులైన
వాడి కంట పడ్డారు. వారి భుజాలు ఏనుగు తొండాలవలె ఉన్నాయి. పాశాలు చేబూనిన
అజామిళుని ప్రాణాలు తీయ సంసిద్ధమై ఉన్నారు. తత్సమయంలో క్రూరవాడైన నారా
డు అల్లంత దూరంలో ఆడుకుంటున్నాడు. యమకింకరులను చూసి వ్యాకులుడై ఉన్న
ుడు ఖీతిల్లుతూ 'నారాయణా !' అని కొడుకును పిలిచాడు. ఆ పిలుపు విన్న విష్ణు దూతలు
దేవదేవుని నామాన్ని ఉచ్చరించాడన్న ఉత్సాహంతో వాని చెంతకు వచ్చి చూసే సరికి —
టులు ఆ దురాత్ముని సూక్ష్మ దేహాన్ని బయటకు లాగుతూన్నారు. ఆ ఘట్టాన్ని తిల
విష్ణు దూతలు వారిని వారించగా - యమభటులు హరిభటులతో - మా ప్రభువాజ్ఞకు
గాన్ని కలిగించే మీ రెవరు ? ఎక్కడ నుండి యిక్కడకు ఎందుకు వచ్చారు ? ఈ పాపిని
పోకుండా మమ్మల్ని ఎందులకు ఆపుతూన్నారు ? పీతాంబర ధారులై, కమల నేత్రులై,
వ్సనులై, కంఠాలలో కమల మాలలను ధరించి భాసిల్లే మీరు చతుర్భుజాలతో

చక్ర, గదా పద్మాలనూ, ధనుర్బాణ కరవాలాలనూ కూడ ధరించి తేజరిల్లి పోతున్నారు. వ్యాప్తాంధకారాన్ని మీ దేహకాంతి దూరం చేస్తున్నది. ఈ ప్రాంతమంతా దివ్య ...తో భాసిల్లి పోతూంది. దండ ధరానుదరులైన మమ్ములను మీ రేల వారించి నారో ...ండి'' అని వారు మౌనం వహించగా హరిదాసులు పలుకుతున్నారు.

"యమభటులారా! యదార్థంగా మీరు దండధర సేవకులే అయితే ప్రథమంగా మాకు ...త్త్వ లక్షణాలను వివరించండి. దండనార్హు లెవరు? ఎలా వాళ్ళను శిక్షించాలి. పాపు ... దండనార్హులేనా? అందులో కొందరా?" అన విని యమభటులు — "హరి సేవకు ... వేదాలు విధి, ప్రతిషేదాల ద్వారా ధర్మా ధర్మ కర్మల నిరూపణ చేశాయి. భగవత్స్వ ...న వేదం ఆ దేవ దేవుని శ్వాస, ప్రశ్వాస రూపమైన స్వయంప్రకాశ జ్ఞాన స్వరూప ... విశ్వవ్యాప్తంగా గల త్రిగుణ పదార్థ సర్వస్వమూ, సర్వ ప్రాణులూ కూడ పరమాత్మ ఉంటాయి. వాటి గుణ నామరూప భేదానుసారం వాటిని వేదమే విభజిస్తూ ఉంటుంది. మనోవాక్కర్మల ద్వారా చేసే వాటన్నిటికీ సాక్షు లున్నారు. సూర్యుడు, అగ్ని, ఆకాశం, ...ు. ఇంద్రియాలు, చంద్రుడు, సంధ్య, అహోరాత్రులు, దిశలు, జలము, పృథ్వి. కాలము, ... — వీరందరి కందరూ కర్మసాక్షులే, యమభటుల ద్వారానే వీరి పాపాలన్నీ సమవర్తి ...లో నిరూపింప బడతాయి. దండనాదుల నిర్ణయం అప్పుడే జరుగుతుంది. కర్మ పరాయణు ...కి త్రిగుణ సంబంధం ఉంటుంది. అందులకే ఆందరి ద్వారా పుణ్య పాప కర్మలు కొనసాగుతునే ...యి. శరీరం ఉన్నంత వరకూ మానవులు కర్మలు ఆచరిస్తూనే ఉంటారు. కర్మ రహితులు ...ం కాజాలరు. పుణ్యా పుణ్య ధర్మా ధర్మ కర్మ ఫలానుసారమే మానవుడు తత్ఫలాలను ... విస్తూంటాడు. త్రిగుణ భేదం వల్ల యిహ లోకంలో ప్రాణులు త్రివిధాలుగా గోచరమవు ...యి పుణ్యాత్ములూ, పాపాత్ములూ, పుణ్య పాప సమన్వితులూ సుఖ జీవులు, దుఃఖ జీవులూ ...ుఃఖ మిశ్రమ జీవులూ ఉంటాయి. అట్లే పరలోకంలో కూడ త్రివిధాలుగా ఉంటాయి. వర్త ... కాలానుసారం భూత భవిష్యత్కాలాలను గుర్తించాలి. అలానే వర్తమానంలోని పాప ...లు కూడ గత, భవిష్య జన్మల పుణ్య పాపాలను నిరూపణ చేయగలుగుతాయి. సర్వ ...తర్యాలలోను విరాజిల్లు నట్టి మా ప్రభువు సర్వుల అంతరంగాన్ని గ్రహించ గలుగుతాడు. ... దశలో అజ్ఞాని అయిన వాడు కల్పిత శరీరాన్ని వాస్తవ దేహంగా భావించి నిద్రా, ...వస్థలను పొందే శరీరాన్ని మరచి పోవునట్లు జీవుడు కూడ తన పూర్వ జన్మను విస్మరించి

ాన దేహాన్ని నమ్మి రాబోయే శరీరాలను కూడ గుర్తించజాలక మూఢుడై సంచరిస్తూం
కర్మేంద్రియ పంచకం ద్వారా ఈ దేహ గత జీవుడు యిచ్చి పుచ్చుకోవడాలూ, పరిభ్ర
ం ఆదిగా గల కార్యాలు ఆచరిస్తూంటాడు. జ్ఞానేంద్రియ పంచకం ద్వారా రూప రస
విషయాలను అనుభవిస్తూ ఉంటాడు. పదునారవ దైన మనోయుక్తుడై పదహేడవవాడైన
కాకికా జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనసాదులలో విషయ భోగాలను అనుభవిస్తూంటాడు.
కళలతో సత్త్వాది త్రిగుణాలతో అనాదియైన లింగ శరీరం జీవునకై ఏర్పడుతూ
ది. ఇదే వీణ్ణి పదే పదే హర్ష శోక భయాలను కలుగజేసే జనన మరణ కాలచక్రంలో
పంప జేస్తూ ఉంటుంది. అరిషడ్వర్గాన్ని జయించ లేనివాడు కోరకయే వాసనానుసారం
కర్మ లాచరిస్తూటాండు. పట్టు పురుగులా తద్దశలో అతడు తనంత తానై కర్మ జాలాన్ని
మకుని ఆ జాలంలో బంధితుడై మోహానికి బలి అయి పోతాడు. శరీరధారు లెవరూ కర్మ
ండ క్షణకాలం ఉండజాలరు. నిజ జన్మాంతరాలలో సిద్ధించు నట్టి పుణ్య పాప సంస్కా
రం జీవుడు స్థూల సూక్ష్మ శరీరాలను పొందుతూ ఉంటాడు. వాడి ప్రబల స్వాభావిక
నరనారీ రూపాలను ప్రసాదిస్తూ ఉంటాయి. ప్రకృతి సంసర్గం ద్వారా పురుషుడు
స్వరూపాన్ని విస్మరించి విపరీత లింగ శరీరమే తానని భావన చేసి సంచరిస్తూంటాడు.
పరీత భావాలు భగవద్భజనవల్లనే నాశన మవుతూ ఉంటాయి. విష్ణు దూతలారా! సర్వ
సంపన్నుడైన ఈ అజామిళుడు సదాచార పరాయణుడు, బ్రహ్మచారి. జితేంద్రియుడు.
సంపన్నుడు, పవిత్రుడు. సత్య నిష్ఠుడు - అని మీకు తెలుసు కదా! గుర్వతిథి అగ్ని
వృద్ధాదులను సేవిస్తూ అహంకార శూన్యుడై సమస్త ప్రాణి హిత వాంఛా రతుడై
కార పరాయణుడై మితభాషియై అన్యుల గుణ గణాలను పరిగణించక అసూయా రహి
చరిస్తూ ఉండేవాడు. ఆలా కాలం గడుస్తూ ఉండగా ఓ నాడు...

అజామిళుడు తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యం చేరి అటనుండి కందమూల ఫలాలను,
లను సమిధ, కుశాదులనూ సేకరించి స్వగృహానికి మరలి రావడంలో భ్రష్టురాలైన
ంగనను చూశాడు. సిగ్గులేనిదీ విపరీత కామం కలదీ మధుపాన మత్త అయిన ఓ వేశ్యాం
ఆ శూద్ర స్త్రీ సంచరిస్తూన్నది. ఆ వేశ్య కూడ సురాపాన మత్తయై పరిభ్రమిస్తూ
ఆ వేశ్య కూడ సురాపాన మత్తయై పరిభ్రమిస్తూన్నది. వారు తమ శరీరం మీది

ు జారిపోయినా గ్రహించ లేకున్నారు. వారి కనులు మత్తులో ఉన్నాయి. ఆ శూద్రాంగన
్యతో కలసి ఓసారి ఆడుతూ, మరోసారి పాడుతూ, ఇంకోసారి నవ్వుతూ అనేక చేష్టలు
సాగింది. కామోద్దీపన కరాలైన అంగ రాగాలు ఆ శూద్ర వనిత అంగాలకు లేపనం చేయ
్నాయి. ఆ వేశ్యను ఆ కులట కౌగలించుకుని ఉంది. అట్టి దృశ్యాన్ని తిలకించిన అజా
 కామ పరవశుడై, మోహితు డై పోయాడు, అంతటి పండితుణ్ణి కామ పిశాచం ఆవ
ంది. వాని సదాచారం భ్రష్టమై పోయింది. శాస్త్ర జన్య చైతన్య నాశనమై పోయింది. ఆ
ు వానికిప్పుడు ఆరాధ్య దేవత అయింది, ధర్మ విముఖుడై అతడు ఆ కులట ఆనందం
అమెకు సుందరాంబర, ఆభరణాదులను తెచ్చియిస్తూన్నాడు. వాని ప్రితార్జితమైన ఆస్తి
ము నాశనమై పోవడంతో - వాడు అగ్నిసాక్షిగా పెళ్ళి చేసుకున్న భార్యను సయితం
ంచి హద్దులు లేని పాపాలు ఆచరించ సాగాడు. న్యాయాన్యాయ పుణ్యాపుణ్య విచారణ
 ధనాన్ని ఆర్జిస్తూ ఆ కులట కుటుంబాన్ని పోషిస్తూన్నాడు. స్వేచ్ఛా చారి కావడం వల్ల
మర్యాదలను అతిక్రమించి సంచరించడం వల్ల సత్పురుష నిందా పాత్రు డయ్యాడు. ఆ
ండించే చేతులతో సమమైన ఆహారాన్ని భక్షిస్తూ కాలం గడుపు తూన్నాడు. వాని జీవన
్వం పాప భూయిష్టమై పోయింది. ఇతః పర్యంతం వాడు చేసిన పాపాలకు ప్రాయ
 చేసుకోలేదు. కనుక వీణ్ణి మా ప్రభు సన్నిధికి తీసుకుపోతాము. యమదండనా నంతరం
ిశుద్ధు డవుతాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-2

### ాగవత ధర్మ నిరూపణ - అజామిళుడు పరమపదం చేరుట.

శుకమహర్షి పలుకుతున్నాడు — పరీక్షిన్నరపాలా! యమభటుల పలుకు లాలకించి
తలు స్వాభిప్రాయాన్ని సువ్యక్తం చేస్తున్నారు." — యమ దూతలారా! మీ పలుకులు
ఆశ్చర్యాన్నే కాదు విచారాన్ని కూడ కలుగజేశాయి. ధర్మ తత్త్వజ్ఞుల సన్నిధిలోనే
ప్రవేశం జరుగుతూన్నది. నిరపరాధులు దండనకు గురి అవుతూన్నారు. పరోపకారీ,
సకుడూ సమదర్శి అయిన యమధర్మరాజే జనులను విషమ భావంతో తిలకించి దండిస్తే
సంరక్షించే వారెవరు? సజ్జన మార్గంలోనే కదా సర్వులూ సంచరించేది? స్వకర్మాచరణ
ధర్మవేత్తలు ధర్మానుకూల కర్మలు ప్రమాణీకరిస్తే ప్రజలు కూడ ధర్మ కర్మలే ఆచ
గలుగుతారు. పశుప్రాయు లందరూ ధర్మాధర్మ జ్ఞాన శూన్యులై నమ్మిన సత్పురుషుని
జాడలలో పయనిస్తారు. దయార్ద్ర చిత్తుడూ విశ్వాస పాత్రుడూ అయిన సత్పురుషుడు
మిత్ర భావంతో చూసే ప్రజలకు ఎలా ద్రోహం తలపెట్ట గలుగుతాడు? అజామిళుడు
వేళలో స్మృతి శూన్యుడై మోక్ష కారకమైన నారాయణ నామోచ్చారణ చేశాడు.
ణ' అన్న చతురక్షరాలూ ఉచ్చరించిన వేళలోనే వాని పాపాలన్నీ నాశనమై పోయాయి.
, సురాపాన, మిత్రద్రోహ, బ్రహ్మహత్య గురుదారా గమనాదు లన్నీ మహా
. ఈ పాపాలు చేసినవాడూ, ప్రభు, గో స్త్రీ, జననీ జనకులను హత్య చేసినవాడూ —
టి అననేల వేదశాస్త్ర కథిత సమస్త పాపాలనూ ఆచరించిన వాడైనా భగవన్నామాన్ని
తక్షణమే వాని పాపాలన్నీ నాశనమై పోతాయి. వాని బుద్ధి గుణాలయందు రమిస్తుంది.
గవల్లీలా స్మరణ మాత్రంచే మహానందం పొందుతాడు. అప్పుడే పరమాత్మ కూడ
ఆత్మీయ బుద్ధితో చూస్తాడు, తపోధనులయిన మహర్షులు, పాప ప్రాయశ్చిత్తంగా కృచ్ఛ్ర,
య ణాదులను చెప్పారు. ఎన్ని ప్రాయశ్చిత్తాలు చేసుకున్నా సమూలంగా పాపం క్షీణిం
సమూలంగా పాపం నాశనం కావాలంటే — భగవద్గుణ జ్ఞాన ప్రబోధకమైన నామోచ్చారణ

లి. అనేకానేక ప్రాయశ్చిత్తాలు చేసుకుంటున్నా — మనస్సు పాపవాసనలవైపు పరుగులు
పే పునః పునః పాపాలే సిద్ధిస్తాయి. సమూలంగా పాపం నిర్మూలం కావాలంటే భగవ
ం వినా అన్య శరణ్యం లేదు. దైవ నామ స్మరణ మాత్రంచే తనంత తానై చిత్త శుద్ధి
తుంది. కాబట్టి యమ భటులారా! మీ లోకానికి యీ అజామిళుని తీసుకు పోకండి. మరణ
'నారాయణ' నామోచ్చారణ చేసిన వీని పాపాలన్నీ దగ్ధమై పోయాయి. అసంకల్పితంగా
చినా అగ్ని దహించక మాననట్లే 'నారాయణ' నామోచ్చారణ మాత్రంచే పాపాలు రూపు
ోతాయి. అజామిళుడు పాపాలు చేయడానికి అవకాశం లేకుండ వాని జీవితమే అంతమై
ది. అందువల్ల మీరు వీణి యమ సదనానికి తీసుకు పోరాదు.

సంకేత, పారిహాస్య, హేళనాది ఏ కారణాల చేతనైనా సరే భగవన్నామోచ్చారణ చేస్తే
పాపాలూ నశించి పోతాయని మహాత్ములకు తెలిసిన విషయమే. పతన సమయంలో కాలు
వేళలో, అంగ భంగమైనప్పుడు పాము కాటుకు గురి అయిన సమయాన అగ్ని వాతపడిన
"హరి, హరి!" అన్న భగవన్నామాన్ని ఉచ్చరిస్తే యమ యాతనలు దూరమై పోతాయి.
నులై, వేదవిదులైన మహర్షులు మహా పాప పరిహారార్థం కఠిన ప్రాయశ్చిత్తాలూ, సామాన్య
మలకూ సాధారణ ప్రాయశ్చిత్తాలూ వ్యక్తం చేశారు. వాటి ఆచరణ వల్ల — అంటే తపో
జపాదులవల్ల పాపాలు భస్మ మవుతాయి. కానీ పాప మలిన భూయిష్టమైన చిత్తశుద్ధి
ం ఏర్పడదు. అందుకు భగవన్నామ స్మరణ వినా అన్య తరణోపాయం లేదు. అమృత
తెలియక పానం చేసినా అట్టివాడు అమరుడవుతాడు. అట్లే తెలియక స్మరించినా భగవ
ం స్మరణ ఫలితం లభించి తీరుతుంది." అంటూ విష్ణు దూతలు యమ భటులకు భాగవత
పదేశం చేసి — వారి పాశాల నుండి అజామిళుని రప్పించి రక్షించారు. యావద్వృత్తాం
యమభటులు యమధర్మరాజుకు వివరించారు. యమపాశ విముక్తుడైన అజామిళుడు
దూతలను సందర్శించి తదానంద పరవశుడై తలవంచి నమస్కరించినాడు. తమతో అతి
మాట్లాడ సంసిద్ధుడు కావడం చూసి ఆ హరిసేవకులు అంతర్ధానమైపోయారు. తత్సమ
ో అతడు హరి సేవకులవల్ల భాగవత ధర్మమూ, యమభటులవల్ల వేదోక్త ధర్మమూ
ంచ గలిగాడు. తత్ప్రభావం వల్ల భగవన్నామ మహిమను గుర్తించి — మనసా అను
గాన్నాడు.

అరెరే! దాసీ లోలుడనై, ఇంద్రియ దాసుడనై విప్రత్వాన్ని పోగొట్టుకొని, శూద్ర
ాన్ని కని ఎంత పాపకార్యం చేశాను. నా జన్మ అంతా వ్యర్థమై పోయింది. సజ్జన నిందితు
పాపాత్ముడనై కులాన్నే కళంకితం చేశాను. చిన్నదై ఉత్తము రాలైన కులసతినే త్యజిం
మధుపాన మత్త అయిన కులటతో తిరిగిన నా తల్లిదండ్రులు నీచుడను. తపసంపన్నులూ,
లూ, నిస్సహాయులూ అయి ఉన్నారు. వారిని సేవించే వారెవరూ లేరు. అట్టి దశలో ఉన్న వారివి
నేను పరిత్యజించాను. ఎంత కృతఘ్నుడను. ఇప్పుడు నేను భయంకర నరకాలలో పడిపోతాను.
లూ, ధర్మ ఘాతకులూ అయినవారు ఏ నరక యాతనలకు గురి అవుతారో? నేను ఆ నర
యిప్పుడు పడిపోతాను. ఇప్పుడు దర్శించినదంతా స్వప్నమా? లేక యదార్థమా? అంతా
షంగానే చూశానా? పాశాలు ధరించి నన్ను ఈడ్చుకుపోయే వారేమై పోయారు? వారి
ండి నన్ను కాపాడిన సిద్ధులు నలుగురూ ఏమైనారు? ఈ జన్మలో దురాచారి నైన
పాపినే అయినా నేను పూర్వ జన్మలో ఏదో పుణ్యం చేసి ఉంటాను. తజ్జన్మలో ఉత్తమ
ల దర్శనం నాకు సిద్ధించినది. ఇప్పుడు నా కదే స్మృతి పథంలోకి వచ్చి యిప్పుడు కూడ
నందాన్ని కలిగించింది. జన్మాంతర పుణ్య ఫలమే నాకు లేకుంటే యీ సమయంలో
ణ భగవన్నామాన్ని ఎలా ఉచ్చరించ గలిగాను. వేశ్యా లోలుడనై, మహా పాపినై
తేజాన్ని కోల్పోయిన నే నెక్కడ? మంగళమయ దైవ నామ మెక్కడ? మనసేంద్రి
ు స్వాధీనమం దుంచుకుని యిప్పుడు నేను ఘోరాంధకారమయ నరక కూపాన పడకుండ
ట్టి విశేష ప్రయత్నం చేసెదను గాక! మూఢుడనై, వాంఛా లోలుడనై దేహ భ్రాంతితో
ని పాప కర్మలు చేశాను. ఆ పాప ఫలమే యీ బంధన హేతు వయినది. ఈ బంధనాన్ని
సర్వ ప్రాణుల యందూ హితము కలవాడనై దీనులపై దయ చూపుతూ - సంయ
ో వ్యవహరిస్తాను. నారీ రూపాన్ని ధరించి భగవన్మాయ నన్ను క్రీడా మృగాన్ని వలె
ంది. స్వప్రయత్నంతో నేనా మోహం నుండి విముక్తుడ నవుతాను. సత్యమైన బ్రహ్మను
ు గుర్తించ గలిగాను. ఇక నేను నాది అన్న దేహ భ్రాంతి పరిత్యజించి ఈశ్వరాయత్త
ై భగవన్నామ స్మరణ చేస్తాను. తద్వారా నా మనస్సు పరిశుద్ధమై నాకు ధ్యానయోగం
ది.

పరీక్షిన్నరపాలా! సజ్జనులైన విష్ణు సేవకుల క్షణకాల మాత్ర సాంగత్యం వల్ల అజా

కి వైరాగ్య మేర్పడగా అతడు శీఘ్రమే సర్వాన్నీ విడనాడి—మోహ దూరుడై హరిద్వారం పయనించాడు. ఆ పావన తీర్థం చేరి అక్కడి దేవ మందిరంలో సుఖాసీనుడై యోగ మార్గాను సర్వేంద్రియాలనూ విషయ వాసనల నుండి మరల్చి — మనస్సును బుద్ధిలో లీనం . ఆపై ఆత్మ చింతనతో విషయాల నుండి బుద్ధిని వేరుపరచి స్వానుభవ రూప ్మలో లగ్నం చేశాడు. తత్సమయాన హరిదూతలు అతనికి పునః దర్శన మిచ్చారు. వెను ే అతడు వారిని గుర్తించి వారికి ప్రణమిల్లి తక్షణమందే గంగాతీరాన్న దేహ త్యాగం ష్ణు పార్షద సమంగా చతుర్భాహు రూపుడై బంగరు విమానాన్ని ఎక్కి వారితో కూడ ్థ నివాస స్థానమైన వైకుంఠాన్ని పొందాడు.

స్వకులాచార ధర్మాల నుండి పతనుడై, స్వధర్మ మర్యాదలను పరిత్యజించి నిందిత కర్మ ఆచరించి అజామిళుడు నరకాలలో పడవలసినదే. కానీ మరణ వేళలలో 'నారాయణ' ్మరణ చేయడం వల్ల శీఘ్ర మే పాప విముక్తు డయ్యాడు.

తీర్థాలను సయితం తీర్థం చేయగల భగవన్నామ స్మరణకు మించి సంసార తరణానికి పాయం వేరేమీ లేదు. దైవ నామాశ్రయుని కర్మ బంధా లన్నీ విచ్ఛిన్నమై పోతాయి. ుక్తి అట్టి వానికి పునః కలగదు. ప్రాయశ్చిత్తాది కర్మల వల్ల త్రిగుణ నాశనం కాదు. క్త చిత్తాన్ని పాప వాసన లంటి ఉంటాయే గానీ పూర్ణంగా నశించవు. రాజా! అత్యంత మైన ఈ చరిత్ర పాప హారకమైనదని గ్రహించు. ఈ గాధను విశ్వాసంతో పఠించినా ు నరకాలు పొందడు. అట్టివానిని యమ భటులు కనులెత్తి చూడరు. అట్టి వారు పాప వైకుంఠాన్ని పొందుతారు. వారిని వైకుంఠ వాసులు గౌరవిస్తారు. నామోచ్చారణ ంచే మహా పాపి అయిన అజామిళుడే విష్ణు లోకం పొందగా సదాచారులు శ్రద్ధాసక్తి తో భగవన్నామ స్మరణ చేస్తే వారికి వైకుంఠం ప్రాప్తించడంలో సందేహం ఏముంది ?

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-3

### తన దూతలతో యమునకు సంవాదం.

అజామిళుని చరిత్ర నాలకించి పరీక్షిత్తు శుకమహర్షికి వందనం చేసి – "మహాత్మా! జీవరాశీ యమధర్మరాజు ఆధీనంలో ఉంటుంది. ధర్మాధికారి కూడ ఆతడే, అట్టి వానిని –రించి ఆయన ఆదేశాలను ఉల్లంఘించిన వారే హరి సేవకులు. ఆ విషయాలను సేవకుల ఆలకించి యమధర్మరాజు ఏమన్నాడు? సమవర్తి శాసనాన్ని ఉల్లంఘించ గలవా రని నే నెన్నడూ వినలేదు. ఈ ఘట్టంపై సమాజంలో అధిక సంఖ్యాకులకు సందేహం తుంది. దానిని తమరే నివారించాలి." అని పరీక్షిన్నరేంద్రుడు అర్థింపగా శుకమహర్షి ంతంగా బదులు పలుకుతూన్నాడు – "రాజా! తమ ప్రయత్నాన్ని విష్ణుదూతలు వ్యర్థం ంతో యమదూతలు తమ ప్రభు సన్నిధికి చేరి – "దేవా! ప్రపంచంలోని జీవులు పుణ్య, కర్మలూ, మిశ్రిత కర్మలూ కూడ ఆచరిస్తూన్నారు. తత్కర్మ ఫలాలను ప్రసాదించే ఱ విశ్వంలో ఎంతమంది ఉన్నారు? దండించే వారే విశేష సంఖ్యలో ఉంటే యీ జీవులకు కలిగేది ఎవరివల్ల? దుఃఖం ఎవరి వల్ల కలుగుతుంది? సక్రమ వ్యవస్థ బహు నాయకత్వం అసాధ్యం కదా? కర్మ లాచరించే వారు విశ్వంలో అసంఖ్యాకంగా ఉంటే – శాసకులు అగణితంగా ఉన్ననాడు లోకంలో శాసనమన్నది నామ మాత్రంగానే కొనసాగుతుంది. ఓ ాజ్యాధిపతి ఆజ్ఞాబద్ధులై సామంతులు అనేకంగా ఉన్ననాడు వారందరూ పేరుకు మాత్రమే ్రై నట్లవుతుంది. ధర్మ ప్రభూ! ఈ చరాచర విశ్వంలో నీ శాసన ధిక్కారం యింత ఎక్కడా జరుగలేదు. ఈ సమయంలో సిద్ధ పురుషులు నలుగురు మీ శాసన ధిక్కారం ా మార్గానికి అడ్డంగా నిలచి – ఓ పాపాత్ముని మేము పాశ బద్ధుని చేసి తీసుకు రావాలను ఉండగా వారు నలుగురూ ఆ జీవుణ్ణి పాశ విముక్తుని చేసి రక్షించారు. తద్రహస్యాన్ని తెలుసుకోవా లనుకుంటూన్నాము. అందుకు మేము అర్హులమన్న భావం తమకు కలిగితే ి." అంటూ యమభటులు మౌనం దాల్చగా యమధర్మరాజు ఒక్కసారి కనులు మూసు ్రహరి చరణారవిందాలను ధ్యానించి – "భటులారా! ఈ చరాచర విశ్వానికి నన్ను

గల ప్రభువు ఉన్నాడు. సూత్ర మందలి వస్త్రం వలె ఆ పరమ ప్రభువునందే ఈ విశ్వ
ఉంది. ఆ పరమాత్ముని అంశావతారులైన బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు సృష్టిస్థితి
రాది కార్యాలు కొనసాగిస్తూంటారు. ఆ దేవ దేవుని అధీనంలోనే యీ జగత్తు అంతా
వ్యవసాయదారుడు చిన్న చిన్న త్రాళ్ళతో వృషభాలను బంధించి ఆ త్రాళ్ళ నన్నిటినీ
ళ్ళతో చేర్చి బంధించునట్లే పరమాత్మ కూడ—బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య వ్యవస్థా రూపమైన
చర్యాది ఆశ్రమ రూపమైన చిన్న చిన్న త్రాళ్ళతో జీవ జాలాన్ని బంధించాడు. జీవులన్నీ
నామరూప కర్మ బంధన బంధితులై తమ సర్వాన్నీ ఆ దేవ దేవునికే అర్పిస్తూంటారు.
, చంద్ర, అగ్ని, వరుణ, నిరృతి, శంకర, వాయు, సూర్య, బ్రహ్మ ద్వాదశాదిత్యులూ,
పశ విశ్వే దేవులు, అష్ట వసువులు, సాధ్యులు, 49 గురు మరుత్తులూ, సిద్ధులు, ఏకాదశ
ం, త్రిగుణ రహితులైన భృగ్వాది మహర్షులూ, ప్రజాపతులు, అన్యాన్య దేవతలూ, నేనూ-
ందరమూ - సత్త్వగుణ ప్రధానులమై కూడ మాయాధీనులమై పరమాత్మ — ఎప్పుడు
స్తాడో గ్రహించ జాలము. అమరులమైన మేమే భగవల్లీలలను గ్రహించ జాలకుంటే
న్యులు ఏలా గ్రహించ గలుగుతారు ? ఘట, పటాది రూపాలు గల వస్తువులూ, వాటిని
ంప జేయగల కనులను చూడజాలనట్లు ఏ ప్రాణీ కూడ తనయందే ఉన్న సాక్షి రూప
త్మను చూడలేదు. సర్వతంత్ర స్వతంత్రుడైన ఆ దేవ దేవుడు సమస్త విశ్వానికీ
ై తేజరిల్లు తూంటాడు. ఆ దేవ దేవుని దూతలు కూడ అతనితో సమాన రూప, గుణ
సంపన్నులై లోకంలో సంచరిస్తూ ఉంటారు. అమర జన పూజితులైన ఆ దూతలు
శక్తి సంపన్నులు. అట్టి వారి దర్శనం అత్యంత దుర్లభమైనది. వారు భగవద్భక్తులను
సంరక్షిస్తూ ఉంటారు. శత్రు సమూహాల నుండీ, అగ్ని బాధల నుండీ, సమవర్తి నైన
డీ కూడ వారు భక్తులను కాపాడుతూ ఉంటారు.

భగవన్నిర్మిత మైన ధర్మ మర్యాదలను, ధర్మ సూక్ష్మాదులను, దేవ, ముని, సిద్ధాదులు
గ్రహించజాల రంటే సామాన్యుల విషయం వేరే వర్ణించాలా ? భగవత్ ప్రసాదితమైన
క ధర్మం అత్యంత గోపనీయమై పరిశుద్ధమైనది. దానిని గ్రహించడం ఏమంత
న్య విషయం కాదు. భాగవత ధర్మాన్ని గ్రహించ గలవాడు భగవత్ స్వరూప ప్రాప్తిని

వ గలుగుతాను. బ్రహ్మ, నారద, శంకర, సనత్కుమార, కపిలాచార్య, స్వాయంభువ
వు, ప్రహ్లాద, జనక, భీష్మ, బలి, శ్రీశుకులతో కూడ నేనూ — ఈ పన్నెండుగురమే
వత ధర్మాన్ని సంపూర్ణంగా గ్రహించిన వారము. నామ సంకీర్తనాది ఉపాయాల ద్వారా ఈ
ంలో పరమాత్మ పాద పద్మాలయందు భక్తి భావం కలిగి ఉండడమే జీవునకు పరమ
ము — సర్వోత్కృష్ట మోక్ష మార్గం కూడ యిదియే ఇంతకు మించి మానవ కర్తవ్యం
భగవన్నామాన్ని ఉచ్చరించిన దాని మహిమను గ్రహించినారా? కౄరాత్ముడైన అజా
డు ఒక్కసారి నామాన్ని ఉచ్చరించిన మాత్రాన మృత్యుపాశ విముక్తుడైనాడు. భగ
వి గుణ కర్మ సంబంధ నామ సంకీర్తన మానవుల పాపాలు హరిస్తుంది అంటే ఆశ్చర్యం
కౄరాత్ముడైన అజామిళుడు మరణ వేళలో 'నారాయణ' నామం కల తన కుమారుణ్ణి
ంగా 'నారాయణా!' అని పిలచాడు. అంతకే వాని పాపాలు భస్మమై ముక్తి కరతలా
మయింది. మహా మహులైన వేద పండితులతో యాగాదులు ఆచరిస్తూ కర్మాసక్త
— స్వర్గ భోగ వాంఛా తత్పరులై దత్తచిత్తులై ఉంటూ ఉంటారు. సులభంగా మోక్షాన్ని
దించునట్టి దైవ నామ మహిమను వారు గుర్తించ జాలరు. ఇది విచారకర విషయం
? సేవకులారా! తెలివి కలవారు ఆ యీ విషయాలను గుర్తించి శ్రీహరి దేవునియందే
న్న లగ్నం చేసి నిశ్చల భక్తి భావం కలిగి ఉంటారు. అట్టి భక్త జనులు నా దండనకు
రు. వారు పాప కార్యాలే ఆచరించరు. పొరబాటుగా పాపాలు వారి వల్ల జరిగినా దైవ
మహిమ వల్ల అవి శీఘ్రంగా నిర్మూలమై పోతాయి.

సాధు చిత్తంతో సమ దర్శనుడై సాధ్య సాధనలు రెండూ తనకు పరమాత్మయే అని
వ దేవునియందే తన భారాన్నంతటినీ ఉంచగల వానిని సిద్ధు లందరూ సేవించి వాని దివ్య
ను గానం చేస్తారు. అట్టి అనన్య భక్తులైన వారిని శ్రీహరి మహత్తరాయుధమైన గద
గా ఉంటుంది. విష్ణు భక్తులను మీరు ఎన్నడూ సమీపించకండి. వారిని దండించే శక్తి
గా, కాలానికీ కూడ లేదు. నామామృత రస లోభులైన పరమ హంసలు అహంకార,
కార వర్జితులై, అకించనులై శ్రీహరి చరణారవింద రసా స్వాదనలోనే సంలగ్నులై
రు. భాగ్యహీనులు గృహస్థాశ్రమాన్నే విశ్వసించి హరి చరణ స్మరణ దూరులై ఆశా
లై సంసార భారాన్ని మోస్తూ ఉంటారు. అట్టి వారిని పాశ బద్ధులను చేసి మీరు నాదగ్గరకు

రండి. దైవ నామ స్మరణ చేయని జిహ్వ కలవాడూ భగవంతుని ధ్యానించని చిత్తం
తూ, భగవంతుని శ్రీ చరణాలకు ప్రణమిల్లని శిరస్సు కలవాడూ దైవ సేవా విముఖు
ఉ – అయినట్టి వారిని పాపాత్ములనే మీరు నా దగ్గరకు తీసుకు రండి. నేడు మీరు విష్ణు
ములను ధిక్కరించి అపరాధమే చేశారు. సేవకులు తప్పు చేస్తే అది ప్రభువు చేసినట్లే.
న్నారాయణ భగవానుడు మా అపరాధాలను మన్నించును గాక! అజ్ఞానులమే అయినా
శ్రీహరి వారమే. సదా శ్రీహరి ఆదేశాలను పాలించడానికి సంసిద్ధంగా ఉంటాము. హరి
ము వారమైన మన రక్షణ భారము ఆ దేవ దేవునకు యోగ్య కార్యమే. అనంతుడూ
తర్యామీ, ఏక రస స్వరూపుడూ అయిన శ్రీహరి దేవునకు ప్రణమిల్లుతూన్నాను."
ఆ సమవర్తి తన సేవకులకు భాగవత ధర్మోపదేశం చేశాడు.

శుకమహర్షి పలుకుతూన్నాడు – రాజా! యమధర్మ రాజుకూ, దూతలకూ మధ్య
సంవాదాన్ని ఆలకించావు కదా! సర్వోత్తమమై, సర్వ పాపహారకమై, వాసనా సర్వ
నిర్మూలించునదైన నామ సంకీర్తన లోకాలకు కళ్యాణ దాయక మైనది. పరమేశ్వరుని
కృపా పూర్ణ పావన లీలా గాథాదులను ఆలకించునట్టి వాడు, పఠించునట్టి వాడు ప్రేమ
భక్తి భావంతో తేజరిల్ల గలుగుతాడు. తద్ద్వారా చిత్తశుద్ధి ఏర్పడునట్లు – మరి ఏ యిత
సాధనలవల్లా ఏర్పడదు. హరి పాదారవిందామృత పాన లోలుడైన భ్రమరం కాగలిగిన
పాద రమ్యాలైన దుఃఖ ప్రదాయక విషయ భోగాదులను పరిత్యజిస్తాడు. పునః ఎన్నడూ
భోగాలలో ఆనందించడు. హరి చరణారవిందామృత పాన విముఖుడైనవాడు కామ
చే భ్రష్టమైన బుద్ధి కలవాడు తన పాపాలను రూపుమాపుకునేటందులకు గాను ప్రాయ
కర్మలు అగణితంగా చేస్తూనే ఉంటాడు. కానీ ఏనాటికీ వాని కర్మ వాసనలు నాశనం కావు.
పునః వాడు పాపాలే చేస్తూంటాడు. రాజా! తమ ప్రభువు వల్ల హరి మహిమను విన్న
నే యమ భటుల సందేహాలన్నీ దూరమై పోయాయి. నాటిదిగా వారెన్నడూ హరి
జోలికి పోలేదు. సరి కదా కన్నెత్తి విష్ణు భక్తులను చూడలేదు కూడ. మలయ గిరిపై
సాగిస్తూన్న అగస్త్య మహర్షి ఒకానొకప్పుడు అత్యంత గుప్తమైన యీ అజామిళో
నాన్ని రాజా! నాకు వినిపించాడు."

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-4

### దక్షుడు తనను స్తుతించగా భగవంతుడు సాక్షాత్కరించుట.

పరీక్షిన్మహారాజు అడుగుతూన్నాడు – "శుకమునీంద్రా! సురాసుర నాగ మనుష్య పక్ష్యాదులు స్వాయంభువ మన్వంతరంలో సృష్టింపబడ్డ విధానాన్ని గురించి గతంలో సంక్షేపమాత్రం చెప్పారు. దానిని విశదంగా ఆలకించాలని ఉంది. ప్రకృత్యాది సర్వ విశ్వములకు కూడ పరమ కారణుడైన పరమాత్మ సృష్టిని ఏ శక్తితో చేస్తున్నాడు? ఎలా చేయ తూన్నాడో సవిస్తరంగా చెప్పండి." అని అర్థించగా శుక మహర్షి బదులు పలుకుడు. – "మహారాజా! ప్రాచీన బర్హికి పది మంది కుమారులు. వారంతా సాగర గర్భం బయటకు వచ్చుచుండగా తమ తండ్రి తపస్సం లగ్నుడై నివృత్తి పరాయణుడై ఉన్నాడు. గుల్మాదులతో పృథ్వి అంతా నిండిపోయింది. దానితో వృక్షాలపై కోపించిన వారి జ్వాలలకు వారి తపస్సు నాశనమైపోయింది. వృక్షాలను భస్మీపటలం చేయాలన్న ముఖాల నుండి అగ్ని వాయువులు బహిర్గతమయ్యాయి. ఆ వాయురగ్నులకు వనో కాదు దిశలన్నీ తిరుగుతూ తరుజాలాన్ని భస్మీపటలం చేసి వేస్తూన్నాయి. అంత డైన శశాంకుడు ప్రచేతసుల సన్నిధికి వచ్చి – శిరస్సు వంచి వినయంగా ప్రణమిల్లి భావంతో – మహాత్ములైన ప్రచేతసులారా! దైన్య దశకు గురి అయిన యీ తరువు భస్మం చేయకండి. ప్రజా వృద్ధిని కోరే ప్రజా పతులైన మీరు మహానుభావులు. పతిశుడైన శ్రీమన్నారాయణుడు – ప్రజలకోసమే వనస్పతులనూ, ఓషధులనూ చాడు. ఈ విశ్వంలో అనేక పశు పక్ష్యాదులకు వృక్షాలే జీవనాధారాలు. అనేక జంతు తృణ గ్రాసాదులే ఆహారం. హస్తాలు కల ప్రాణికోటికి తరులతాదులే ఆహారం కాగా, లకు శాలి గోధూమాదులే ఆహారం. చతుష్పాద జంతువులైన వృషభ, ఉష్ట్రాదిజంతువుల పృథ్వి పై గోధూమాది ఆహార పదార్థాలు తయారవుతాయి అనఘులారా! దేవాది మీకు పితృదేవుడూ అయిన భగవానుడు సృష్టి కొనసాగించుడని మిమ్మల్ని

ంచాడు. ఇట్టి దశలో మీరీ తరువులను నిర్మూలించడం న్యాయం కాదు. శాంతులై మీరు
ాన్ని విడనాడి మీ పితృ పితామహ, ప్రపితామహాదు లనుసరించిన మార్గాన్ని అనుస
డి. బాలురను మాతాపితరులూ, రెప్పలను కళ్ళూ, భార్యను భర్తా, శిశువులను గృహస్థూ,
ులను జ్ఞానీ రక్షిస్తూ వారి క్షేమాన్నే కోరుతూ ఉంటారు. అల్లే ప్రజలను ప్రభువైన వాడు
ాలి, ప్రచేతసులారా! భగవానుడు అంతర్యామి రూపంలో సర్వులలోనూ విరాజిల్లుతూ
ు. ఈ భావంతో మీరు ఉండ గలిగిననాడు పరమాత్మ మీకు ప్రసన్ను
డు. హృదయాన్ని దగ్ధం చేసే భయంకర క్రోధాన్ని తనయందే శాంతింప
గల వాడు క్రమంగా త్రిగుణాలను జయించ గలుగుతాడు మీరీ తరు సమూహాన్ని భస్మం
ండి. మిగిలిన తరువుల నైనా సంరక్షించండి. తద్ద్వారా మీకు శుభాలు చేకూరుతాయి.
శ్రేష్ఠురాలైన యీ కన్యను పోషించాయి. ఈమెను మీరు భార్యగా స్వీకరించండి,''
చంద్రుడు మౌనం దాల్చాడు.

ప్రచేతసులకు నచ్చజెప్పి చంద్రుడు మౌనం వహించి తరువాత ప్రమోచ పుత్రిని వారికి
సి వెళ్ళిపోయాడు ఆ కన్యకు ప్రచేతసుల వల్ల దక్షుడు ప్రభవించాడు. దక్షుడు చేసిన ప్రజా
జగత్త్రయం వ్యాపించి పోయింది. పుత్రికలయందు దక్షునకు అమితమైన ప్రేమ. ఆతడు
వీర్యాలతో చేసిన సృష్టి విస్తారాన్ని రాజా! సావధానంగా ఆలకించు. సంకల్ప
ంచే దక్షుడు ఆదిలో జల, స్థలాకాశాదులలో అనేకులను సృష్టించాడు. అది వర్ధిల్లక పోవడం
అతడు వింధ్యాచల ప్రాంత పర్వతాలకు వెళ్ళి మహా తపస్సు చేశాడు. అక్కడ అఘ
నామక మహా తీర్థం ఉంది. సర్వ పాపాలనూ నాశనం చేయునట్టివై ఆ తీర్థ జలాలు
తూన్నాయి. త్రికాల స్నానం చేస్తూ అతడు తపస్సు ద్వారా భగవదారాధన చేశాడు.
జాపతి 'హంస గుహ్య' నామక స్తోత్రం ద్వారా ఇంద్రియాతీతుడైన పరమాత్మను
చేసిన విధానాన్ని సావధానంగా ఆలకించు :—

పరమాత్మా! భవదీయ చిచ్ఛక్త్యనుభూతులు అమోఘమైనవి. ప్రకృతి, జీవుల కంటె
మైన వాడా! ప్రకృతి, జీవులను శాసించు వాడా! వారికి సత్తా స్ఫూర్తులను ప్రసాదించే
త్రిగుణ సృష్టిని సత్యమని నమ్మి నట్టి వాడు భవదీయ దివ్య స్వరూప సాక్షాత్కారాలను

జాలడు. నీ విషయంలో అవధులూ, హద్దులూ లేవు. ఏ ప్రమాణమూ నీ సన్నిధి వరకూ లదు. పరమాత్మవూ, స్వప్రకాశ స్వరూపుడవూ అయిన నీకు ప్రణమిల్లుతూ ఉన్నాను. ర మిత్రులై జీవేశ్వరు లిద్దరూ ఈ శరీరమందే ఉంటూన్నా, జీవుడు సర్వ శక్తి న్నదైన భగవంతుని సఖ్య భావాన్ని గ్రహించ జాలడు. అట్లే రూప, రస, గంధాది విష స్వప్రకాశానికి కారణాలైన నేత్ర ఘ్రాణాది ఇంద్రియ ప్రవృత్తులను గ్రహించ జాలవు. ు? జీవుడవూ, జగద్ద్రష్టవూ అయి నీవే ఉన్నావు. నువ్వు దృశ్యానివి కావు. పరమేశ్వరా! ు పాదారవిందాలకు ప్రణమిల్లు తూన్నాను. శరీర ప్రాణ, ఇంద్రియ, అంతరంగ గా పంచ మహా భూత, పంచ తన్మాత్రాదులూ కూడ జడ పదార్థాలే కావడం వల్ల తమ్ము గుర్తించ జాలవు. తమకన్న భిన్నమైన వానినే గుర్తించ జాలవు. కానీ జీవుడు మాత్రం ప్రాణాదులనూ వీటికి కారణాలైన త్రిగుణాలనూ, గ్రహించ గలుగుతాడు. అతడు కూడ , జ్ఞేయ రూపాలలో నిన్ను మాత్రం గ్రహించ లేడు. సర్వజ్ఞుడవు, అనంతుడవు - అయిన నేను కేవలం స్తోత్రం మాత్రం చేస్తూన్నాను. సమాధ్యవస్థలో ప్రమాణ, వికల్ప, విప రూపమైనవి, విధి జ్ఞాన, స్మరణ శక్తులు లోపించిననాడు నామ రూపాత్మక మగు ఈ ్న నిరూపించునట్టి మనస్సు ఉపరతం కాగా — అయ్యమనస్క యోగంలో సచ్చిదానంద మైన నీ స్వరూప స్థితి ద్వారా నువ్వు భాసిల్లుతూ ఉంటావు. భగవన్! నువ్వు పరిశుద్ధు ఏ వాస స్థానం కూడ పరిశుద్ధ హృదయమే అట్టి నీకు వందనాలు. 'సామధేనీ' నామక శ మంత్రాల ద్వారా యాజ్ఞికులు కాష్ఠమందు అంతర్నిహితమై యున్న అగ్నిని ప్రకటింప ట్లే జ్ఞానులు కూడ — 27 శక్తులకూ లోపల నిగూఢంగా ఉన్న నిన్ను శుద్ధ బుద్ధి ద్వారా ృదయాలలోనే అన్వేషిస్తూ ఉంటారు. ఈ విశ్వమందు కనిపించే విభిన్న రూపాలన్నీ ి కల్పితాలే. మాయను నిషేధించ గలిగిన నాడు పరమ సుఖ సాక్షాత్కార రూపమైన శేష రూపంలో భాసిల్లుతూ ఉంటావు. యోచన చేసి చూస్తే నీ స్వరూపంలో మాయోప ర్వచనం కూడ సిద్ధించవు. మాయ కూడ నువ్వే కనుక యీ నామ రూపాలన్నీ భవదీయ ితాలే అవుతూన్నాయి. ప్రభూ! ప్రసన్నుడవై నన్ను పరిపూర్ణుని చేసెదవు గాక! భగ వాక్కు ద్వారా పలుకబడేదీ, మనసా ఊహించేదీ, బుద్ధీంద్రియాల ద్వారా గ్రహించేదీ ం నీ స్వరూపం కానేరదు అది కేవలం గుణ స్వరూపం మాత్రమే. గుణాల ఉత్పత్తి

ూాలకు నువ్వు అధిష్ఠాన భూతుడవు. వాటి ప్రతీతి మాత్రమే నీ యందు ఉంటుంది. భగ
ా! ఈ విశ్వమంతా నీలోనే ఉంటుంది. నీ నుండియే యిది ప్రభవించినది. ఎట్టి అన్య
ార రహితంగా నువ్వు స్వయంగా దీనిని స్మరించినావు. ఇదంతా నీ కోసమే, సర్వం నీవే,
జీవులచేతా కార్య రూపాలు నువ్వే చేయిస్తూంటావు. నిర్మించుట, నిర్మింప జేయుట సర్వం
ంటావు. కార్య కారణ భేదం లేనప్పుడు కూడ సహజ సిద్ధ రూపంలో నువ్వు తేజరిల్లుతూ
ావు. సర్వ కారణుడవైన నీలో జీవ జగత్తుల భేదం లేదు. స్వగత భేదమన్నది కూడ
లేదు, స్వయంగా బ్రహ్మవై అద్వితీయుడవైన నువ్వు నాకు ప్రసన్నుడ వయ్యేదవు
అనంతా! వాది ప్రతివాదుల సంవాద వివాదాలకు నీ శక్తులే విషయా లవుతూ ఉంటాయి.
ందే అవియే వారిని మోహ సాగరంలో ముంచుతూ ఉంటాయి. అనంతమై అప్రాకృత
ు గుణాలు కల నీకు నా ప్రణామాలు. కరచరణాలను కల సాకార మూర్తి మా ప్రభువు-అని
ికులు చెబుతూ ఉంటారు, అవయవ రహితుడనీ నిరాకారుడనీ నిన్ను సాంఖ్య వాదులు వర్ణిస్తూ
రు. ఏకైక వస్తువును పరస్పర విరోధ భావాలతో వారు వ్యక్తీకరిస్తూన్నారు. కానీ
్య మాలోచిస్తే నీ యందు విరోధం లేదు. కారణం? పరమైన ఏకమాత్ర వస్తువు
వారు దత్త చిత్తులై ఉన్నారు. ఆలంబన రహితంగా కర చరణాదులు ఉండడం
ంవము. నిషేధానికి కూడ అవధి అనేది ఒకటి ఉండాలి. కనుక—నువ్వు సాకార నిరాకారాలు
టికీ విరుద్ధం కాని పరబ్రహ్మవు. అనంతుడవైన నీకు ప్రాకృత నామ రూపం లేకపోయినా
ులు నీ చరణ కమల సేవ చేస్తూంటారు. వారిపై దయ చూపడానికి నువ్వు అనేక
రూపాలతో అవతరించి లీలలు అనేకంగా ప్రదర్శిస్తూ ఉంటావు. దేవా! నన్ను కరుణించు.
ంనచలు సామాన్యంగా సాధారణ కోటికి చెంది ఉంటాయి. కనుకనే నువ్వు సర్వ హృద
తర్యామిగా ఉండి వారి వారి భావనాను రూపమైన విభిన్న రూపాలలో దర్శన మిస్తూ
ావు. గంధ లక్షణానుసారం — దాని నాశ్రయించిన వాయువు కూడ సుగంధ దుర్గంధాలు
అవుతుంది, స్వతః దానియందు సుగంధ దుర్గంధా లన్నవి లేవు. అల్లే దేవా! నువ్వు కూడ
ంకుల భావనానుసారం నామ రూపాలు కలవాడవు అవుతూ ఉంటావు. దయామయా! నా
ాన్ని నెరవేర్చెదవు గాక! అంటూ వింధ్యాచల మందలి అఘమర్షణను తీర్థంలో దక్ష ప్రజాపతి
ీతిగా పరమాత్మను ధ్యానించగా ఆ దేవ దేవుడు ప్రత్యక్ష మయ్యాడు.

గరుడుని అంస భాగాన పాదా లుంచి విశాల భుజాష్టకంలో శంఖ, చక్ర, గదా, ఖడ్గ, బాణ, పాశ డాలులనే అష్టాయుధాలనూ ధరించి వర్ష ఋతువులోని మేఘంతో సమంగా ఉన్న శరీరంపై పీతాంబరాన్ని ధరించి ఆ దేవ దేవుడు శోభిల్లు తూన్నాడు. వికసిత వదన నుండి కరుణా రసం ప్రవహించే నయన ద్వయంతో శ్రీవత్స, కౌస్తుభాద్యలంకారాలతో ప్రకాశిస్తూన్నాడు. కంకణ, కిరీట కుండలాదులూ, బంగరు మొలత్రాడూ, ఉంగరాలూ అంగద కేయూరాదులూ స్వస్థానాలలో అలంకృతాలై ఉన్నాయి. త్రిజగన్మోహనుడై, త్రిభువనపతియైన భగవానుడు మన్మోహనుడై భాసిస్తూన్నాడు. నంద, సునంద, నారదాది పార్షదులు సేవకులుగా నిలిచి ఉన్నారు. ఆ దేవ దేవుణ్ణి ఇంద్రాది దేవతా ప్రముఖులు స్తోత్రం చేస్తూన్నారు. ఆ కరుణా సాగరుని గుణాలను చారణ గంధర్వ సిద్ధాదులు గానం చేస్తూన్నారు. క్షణకాలం పాషాణ సదృశంగా నిలబడిపోయి అతడు భగవచ్చరణ రాజీవాలకు ప్రణామం చేశాడు. ప్రేమమైన సెలయేళ్ళ ద్వారా నది పొంగి పొరలేటట్లు మహానంద పారవశ్యం వల్ల దక్షుని సర్వేంద్రియాలూ సంభరితమై పోయాయి. ఆ స్థితిలో అతడేమీ మాట్లాడలేక పోయాడు.

రాజా! దక్షుడు వినయ భావంతో భగవత్సమక్షంలో నిలచి నతమస్తకుడు డయ్యాడు. హృదయాంతర్యామి అయిన భగవానుడు అతని ప్రజా వృద్ధి సంకల్పాన్ని గ్రహించి — "శ్రద్ధ భక్తి విశ్వాసాలతో నాకై నువ్వు చేసిన తపస్సు ఫలించినది. నీ యందు నేను ప్రసన్నుడ నయ్యాను. యావద్విశ్వంలోనూ ప్రజా వృద్ధికై తపస్సు చేశావు. అదే నా సంకల్పం కూడ కావడం వల్ల విశ్వమంతా సమస్త ప్రాణులూ వర్ధిల్లుతాయి. శంకర బ్రహ్మాదులూ నీ వంటి ప్రజాపతులూ, స్వాయంభువాది మనువులూ యితరేతర దేవేశ్వరులూకూడా నా విభూతులే. సర్వ ప్రాణులనూ అభివృద్ధి చేసే వారే మీ రందరూ. దక్షా! తపస్సే నా హృదయం, విద్య నా దేహం, కర్మ ఆకృతి, యాగాలే నా అవయవాలు, ధర్మమే నా మనస్సు, దేవతలే నా ప్రాణాలు. ఈ సృష్టి లేని వేళలో కూడ నిష్క్రియా రూపంలో ఉన్నది నేనొక్కడినే. బాహ్యాభ్యంతరాలలో ఏమీ ఉండదు, ద్రష్టా, దృశ్యాలు ఉండవు. అవ్యక్తుడను, జ్ఞాన స్వరూపుడనూ అయిన నేను మాత్రమే ఉంటాను. సమస్త దిశలూ కేవలం సుషుప్తిలో మాత్రమే ఉంటాయని తెలుసుకో. నేను అనంతుడనూ, అనంత గుణాధారుడనూ,

యమైన మాయా సంక్షోభం వల్ల యీ బ్రహ్మాండ శరీరం ఉత్పన్నమైన నాడే అయోనిజు బ్రహ్మ ప్రాదుర్భవించాడు. అతనియందు నేను శక్తి చేతనాలను సంచరింపజేసిన వేళలో ముఖుడైన బ్రహ్మ సృష్టించే సంకల్పంతో తనను శక్తి శూన్యునిగా భావించాడు. అప్పుడు అతణ్ణి తపస్సు చేయుమని ఆదేశించాను. అంత బ్రహ్మ తపస్సు చేసి ఆశక్తితో ఆదిలో తులైన మీ తొమ్మండుగురినీ ప్రభువింప జేశాడు.

దక్షా! పంచ జన పుత్రి అయిన 'అసిక్ని' అనే యీ కన్యను తిలకించు. నువ్వీ పరిణయమాడి గృహస్థ ధర్మాన్ని అవలంబించు. ఈమె నిన్ను అనుసరించి సంచ . ఆ వేళలో నువ్వీమె ద్వారా విశేషంగా ప్రజా సృష్టి చేయగలుగుతావు. దక్షా! ఇంత మాకు సంబంధించిన సృష్టి జరిగింది. ఇక నీ తరువాత ప్రజలందరూ నా మాయా లీలా తులై పురుష సంయోగం ద్వారా సృజింపబడిన వారందరూ నా సేవా సంపన్ను ను.

పరీక్షిన్నరపాలా! విశ్వానికి ప్రాణ శక్తిని ప్రసాదించే శ్రీహరి ఆ రీతిగా దక్షునకు చి అంతర్ధానమై పోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-4

## దేవర్షి నారదుని వల్ల దక్ష కుమారులు విరక్తు లగుట - దక్షుడు నారదుని శపించుట.

శుకమహర్షి – "పరీక్షిన్నరేంద్రా ! భగవచ్ఛక్తి సంచారం వల్ల దక్షుడు సర్వ సమర్థు
డు. అతడు అసిక్ని వల్ల పది వేల మంది కుమారులను కన్నాడు. వారందరి కందరూ
త్ర ఆచార స్వభావాలు కలవారై చరిస్తున్నారు. ప్రజా వృద్ధిని చేయుడని దక్షుడు వారిని
చగా – తపస్సార్థం పశ్చిమ దిశగా వెళ్ళిపోయారు. ఆ దిక్కులో సింధు నదీ సాగర
ప్రదేశంలో 'నారాయణ సరం' అనే మహా తీర్థం ఉంది. అక్కడ మహా మహా సిద్ధ
లూ, మహర్షులూ తపస్సంలగ్నులై ఉంటారు. ఆ సరస్సులో స్నానం చేయడంతో దక్ష
హర్యశ్వు లందరూ పరిశుద్ధాంతః కరణులైనారు. వారి బుద్ధి భాగవత ధర్మంలో
నా తండ్రి ఆజ్ఞకు బద్ధులు కావడం వల్ల ప్రజా సృష్టి – అభివృద్ధుల దృష్ట్యా మహా
తపస్సు చెయ్య సాగారు. అది చూసి నారదుడు – వీరు భాగవత ధర్మంలో రుచి కల
కూడ ప్రజా వృద్ధేచ్ఛతో – తపస్సంలగ్నులు కావడం చూసి వారిని సమీపించి పలుకు
డు.

'దక్షపుత్రులారా! ప్రజా పతులై కూడ మీరు మూఢులవలె వ్యవహరిస్తున్నారు. యదార్థా
ను పృథ్వి యొక్క అంతే చూడలేదు. అట్టి దశలో మీరు సృష్టి కార్యాన్ని ఎలా కొనసా
? చూడండి. ఓ దేశం ఉంది అక్కడ ఒకే ఒక పురుష టున్నాడు. అక్కడ నుండి
రావడానికి వీలులేని ఓ బిలం ఉంది. అనేక రూపాలు కల ఓ స్త్రీ కూడ అక్కడ ఉంది.
రికి పతిగా వ్యవహరించే ఓ పురుడు కూడ అక్క టున్నాడు. ముందుకూ, వెనక్కూ
ంచే ఓ నది కూడ అక్కడ ఉంది. పంచవింశతి (25) పదార్థాలతో తయారైన ఓ విచిత్ర
అక్కడ ఉంది. ఆ నగరంలోనే ఓ హంస కూడ ఉంటున్నది. ఖడ్గ, వజ్ర నిర్మితమైన
ం అక్కడే ఉంది తనంత తానై పరిభ్రమిస్తూ ఉంటుంది. పితాదేశానుసారం మూర్ఖులైన

యావిషయం ఎంతవరకూ గ్రహించ గలరో లేరో అంతవరకు మీరు సృష్టి కార్యంనెర వేర్చలేరు.

'రాజా! దక్ష పుత్రులైన హర్యశ్వులు స్వతః ధీశాలురు కావడం వల్ల దేవర్షి పలికిన వచనాలను గురించి యోచించ సాగారు :– సామాన్యంగా లింగ శరీరాన్నే జీవుడని ...షు. పృథ్వి ఆత్మకు అనాది బంధమై ఉంది. దీని పారాన్ని దర్శించకుండ వ్యర్థమై ఆచరించడం వల్ల ప్రయోజనం ఏముంది? యదార్థానికి భగవంతుడు ఏకమాత్రుడై ...తూ ఉంటాడు. అతడు జాగ్రత్ స్వప్న సుషుప్తుల కన్న, తదః సాక్షీమాన దేవతల కన్న ...నవాడు. సర్వాశ్రయుడైన అతనికి సాక్షీ తురీయమే ఆతనికి ఆశ్రయ మన్నది వేరే ...ను. ప్రకృత్యాతీతుడూ, నిత్య ముక్తుడూ, అయిన పరమాత్మను దర్శించకుండ సమస్త ...లాలనూ భగవదర్పితం చేయకుండ ఉండే వాని జీవనం వల్ల ప్రయోజనం ఏముంది? ...ప పాతాళంలో ప్రవేశించి మరలి రాలేని మానవునిలా – పరమాత్మను పొందిన జీవుడు ...్మ రహితుడు కాగలుగుతాడు. అంతః జ్యోతి స్వరూపుడైన పరమాత్మను తెలిసికోకుండ ...మే స్వభావంగా కల స్వర్గాది ఫలాలను ప్రసాదించే కారణ భూతాలైన కర్మాచరణం వల్ల ...జనం ఏమిటి? బహు రూపిణి యైన సత్త్వ రజస్తమో గుణాలను ధరించే స్త్రీతో సమాన ...స్వబుద్ధి. దీని అంతు యీ జీవితంలో తెలియదు. వివేక రహితంగా అశాంతిని వర్ధిల ...ర్మాచరణ వల్ల ప్రయోజన మేమి? కులట వంటి దీబుద్ధి. దీని సంగమ మాత్రం చేతనే ఐశ్వర్య, స్వాతంత్ర్యాలు రెండూ నాశనమై పోతాయి. ఆపై కులటకు పతి వలె సర్వే...త పరిభ్రమిస్తూ ఉంటాడు. విభిన్నమైన దీని గతిని గ్రహించ కుండ మూఢ భావంతో చేసే ... వల్ల ఫల మేమి? ఎదురు వాలులనే రెండు వైపులా ప్రవహించే నది మహా మాయయే. ...ప్రళయాలను రెండింటినీ యిది చేస్తుంది. తపో విద్యాదుల సహకారంతో ఎవరు యీ మహా...ను తొలగించుకో ప్రయత్నం చేస్తారో? అట్టి వారికి విఘ్నాలు కలిగించడానికి అహంకారి ...రూపాలను దాల్చి ఆ మహా మాయ తీవ్ర వేగంతో ప్రవహిస్తుంది. దాని వేగాన్ని ...చ జాలని వాడూ, అహంకారాదులచే వివశుడైనవాడూ మాయా కర్మల ద్వారా సత్ఫలి... ఎలా పొంద గలుగుతాడు? ఈ పంచవింశతి – 25 తత్త్వాలే ఓ అద్భుతమైన ...ము. ఆ గృహానికి పురుషుడే ఆశ్రయుడు. సర్వ కార్య కారణ రూప విశ్వానికి భగ...దే ఆశ్రయమని గ్రహించ జాలక యదార్థమైన స్వాతంత్ర్యం లేక మానవ మాత్రుడు చేసే

లన్నీ వ్యర్థాలే, దైవ స్వరూప నిర్ణయం చేసే శాస్త్రాలు — హంస — క్షీర నీరాలను
చి నట్లే — భగవచ్ఛాస్త్రాలు బంధ మోక్షాలూ చేతనా చేతనాదులూ వాటిని వేరు పరచి
తూ ఉంటాయి. అట్టి ఆధ్యాత్మ స్వరూప హంసను త్యజించి బహిర్ముఖునిగా చేసే కర్మల
ప్రయోజన మేమి? ఈ కాలమే ఓ చక్రం, యీ కాల రూప చక్రం నిర్విరామంగా
రం పరిభ్రమిస్తూ ఉంటుంది. ఖడ్గ, వజ్ర సమ తీక్షణ మైన దీ కాలచక్రం, యావద్విశ్వాన్నీ
పు ఆకర్షించుకునే దీనిని నిరోధించగలవాడు యీ జగత్తులో లేనేలేడు. దీనిని నిరోధించ
డు యీ జగత్తులో లేనే లేడు. అది గ్రహించ జాలక కర్మ ఫలాలనే శాశ్వతమని తలచి
లు సకామ కర్మ లాచరిస్తూ ఉంటారు. అట్టి వారు అనిత్య కర్మల వల్ల పొందే లాభం
? శాస్త్రమే తండ్రి. ద్వితీయ జన్మ శాస్త్రం వల్లనే ప్రాప్త మవుతుంది. శాస్త్రాదేశాను
కర్మలు చెయ్యడని కాదు—తత్కర్మల నుండి నివృత్తుని చేయడమే శాస్త్ర తాత్పర్యము.
షయాలను గ్రహించని వాడు శబ్దాది విషయాలయందే విశ్వాసం ఉంచ గలుగుతాడు. అట్టి
శాస్త్రోక్త నివృత్తి మార్గాన్ని ఎలా గ్రహించ గలుగుతాడు?'

రాజా! హర్యశ్వు అందరూ ఏకాభిప్రాయం కలవారు. వారందరి కందరూ నారద దేవర్షి కి
ల్లి మోక్ష మార్గాన్ని అనుసరించారు. దేవర్షి నాదబ్రహ్మలో లయమై కృష్ణ చరణార
సక్తమైన చిత్తంతో స్వేచ్ఛగా వెళ్ళిపోయాడు.

నారదోపదేశం వల్ల తన ప్రియ పుత్రులు స్వకర్తవ్య పాలన నుండి చ్యుతులై
ంతో దక్షుడు వ్యాకులుడై పశ్చాత్తాపంతో బాధపడ సాగాడు. ఒకచో ఉత్తమ సంతతి
బాధాకారణమే అవుతుంది. తత్సమయంలో బ్రహ్మదేవుడు స్వయంగా విచ్చేసి దక్షుని
డు, పునః దక్షుడు అసిరెక్ని వల్ల సహస్ర సంఖ్యలో పుత్రులను ప్రభవింప జేశాడు.
శ్వ నామధేయులైన వారందరి కందరూ ప్రజా సృష్టి వాంఛా తత్పరులై కూడ — తమ
మార్గాన్ని అనుసరించి పితృ దేశానుసారం నారాయణ సరోవరానికే పయనించి — అక్కడ
చెయ్యాలని ఆ సరోవరంలో స్నానం చేసి విశుద్ధాంతరంగులై ప్రణవాన్ని జపిస్తూ
లగ్నులయ్యారు. జల పానంతో కొన్ని నెలలూ, వాయువును మాత్రం సేవిస్తూ కొన్ని
గా గడిపి — నిర్మల చేతస్కులై సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణ భగవా
రాధించ సాగారు. గతంలో వలెనే నారదుడు విచ్చేసి — 'దక్ష నందనులారా! మదీయోప

ఆలకించండి. సోదర ప్రేమ కల మీరు మీ అన్నలనే అనుసరించండి ఆ మార్గం సర్వ
ననదని విస్మరించకండి.' అని పలికి వెళ్ళిపోయాడు.

దేవర్షి దివ్య దర్శనోపదేశాలు వృథా అవుతాయా? అగ్రజుల మార్గాన్నే శబలాశ్వులూ
ంచారు, అంతర్ముఖులై వారూ విముక్తి మార్గంలోనే ఉండిపోయారు. గతించిపోయిన
మరలి రానట్లే – వారు కూడ తన్మార్గంలోనే పురోగమించారు. వెనుదిరగ లేదు.
యంలో గోచరించిన దుశ్శకునాల వల్ల దక్షుడు – తన కుమారులకు ఏవో అరిష్టాలు
ఉంటాయని గ్రహించాడు. ఆ లోగానే దేవర్షి వల్ల తన పుత్రు లందరూ నివృత్తి
నిరతులై పోయారని గ్రహించాడు, దానితో అతనికి నారదుడిపై తీవ్ర క్రోధం కలిగింది.
ను కనిపించగానే క్రుద్ధుడై – 'నారదా! దుష్టుడవై పసివాళ్ళైన నా కుమారులకు భిక్షు
న్న చూపి నాకు మహాపకారం చేశావు. వారింకా ఋణత్రయం నుండి విముక్తులే కాదులే.
కర్మ మార్గాన్ని గ్రహించ లేదు. అట్టి వారిని యిహ పరాలకు దూరం చేశావు. నామ
నికి కూడ నీలో 'దయ' అనేది లేదు. ఇలా నువ్వు పిన్న వారి బుద్ధులు పాడు చేస్తూన్నావా?
పార్షదులతో ఉంటూ కూడ నువ్వు ఆ దేవ దేవుని కీర్తిని కళంకితం చేస్తూన్నావు.
జ్జ లేదు. దైవ పార్షదులు సదా తమ భక్తుల దుఃఖాలను దూరం చేసే దయాపరులై
రని విన్నాను. నువ్వు మాత్రం వైర భావాన్ని పురిగొల్పి ప్రేమ భావాన్ని నాశనం చేసే
నావు. ఎట్టి వారితోనూ శత్రుత్వ భావం లేని వారిలో కూడ నువ్వు వైర భావాల్ని కల్పి
స్నేహ పాశం వైరాగ్య మాత్రంచే ఖండింపబడి పోతుందనీ, విషయాసక్తి నాశన
ందనీ అనుకుంటున్నావు. నీ బుద్ధి యదార్థమైనది కాదు. కారణం? నీ వంటి వారి వల్ల
మైన వైరాగ్యం సిద్ధించదు. విషయ భోగానుభవ రహితుడు వాటి యందలి కటు
గ్రహించ జాలడు. విషయాసక్తుడై యీ సంసారం దుఃఖ మయ మని గ్రహించిన
అనుభవం ద్వారా విరక్తుడు కావాలే కానీ నీ వంటి కపట సన్యాసుల ప్రబోధం వల్ల
ం కాదు. ఉత్తమ గృహస్థుడనై ధర్మ మర్యాదలను పాలించు నట్టి నేను నువ్విట్టి మహాప
తలపెట్టినా ఊరుకున్నాను. నువ్వు నా వంశ పరంపరను నాశనం చెయ్య దలచావు. దానినే
ృచుకున్నావు. ఎక్కడా – పరలోకంలోనూ నివాసం లేని వాడవైన నువ్వు త్రిలోక

విగా పరిభ్రమిస్తూ ఉండెదవు గాక!' అంటూ శపించాడు.

శుకమహర్షి – "రాజా! దేవర్షి దక్షుని శాపాన్ని సానందంగా స్వీకరించాడు. విశ్వంలో ...న వాడు పరుల వల్ల కలిగే అపకారాదులను దైవ లీలగా సహిస్తాడే గానీ ప్రతీకారం ...షు. అంతులోనూ దేవర్షి సాధు శిరోమణి కావడం వల్ల ఆనందంగా వెళ్ళి పోయాడు."

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–6 అ ం–4

## దక్ష పుత్రి కల వంశ వర్ణన.

శుకమహర్షి అందుకున్నాడు – "రాజా! దక్ష శాపాన్ని సంతోషంగా స్వీకరించి ప్రతీ... తలపెట్టని నారద దేవర్షి అటనుండి వెళ్ళిపోయాడు. అంత దక్ష ప్రజా పతి దీనంగా ...స్తూ ఉండగా బ్రహ్మదేవుడు విచ్చేసి అతనికి ధైర్యం చెప్పి వెళ్ళి పోయాడు. అంత దేశాను సారం – దక్షుడు తన పత్ని అయిన అసక్ని ద్వారా అరవై మంది పుత్రికలను ... తమ తండ్రి యందు అత్యధిక ప్రేమానురాగాలు కల వారందరూ ఆనందంగా కాలం ...తూ ఉన్నారు. దక్షుడు తన పుత్రికలలో పది మందిని ధర్మునికీ, పదముగ్గురిని కశ్యపునికీ, ఏడుగురిని చంద్రునికీ. భూత, అంగిర, కృశాశ్వులకు యిద్దరేసి వంతున తార్క్ష్య నామధేయు కశ్యపునికి నలుగురినీ యిచ్చి పెళ్ళి చేశాడు. దానితో దక్ష కన్యల సంతతి వర్ధిల్లి జగత్ర... వ్యాపించింది. దక్ష కన్యల నామాలనూ వారి సంతతి నామాలనూ చెబుతాను ఆలకించు :- లంబ, కకుళ, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసుముహూర్త, సంకల్ప అనే పది ధర్ముని భార్యలు. వారి సంతాన నామాలు ఆలకించు. భాను నందనుడు దేవ ఋషభుడు. పుత్రుడు ఇంద్రసేనుడు. లంబ కుమారుడు విద్యుత్తు. వానికి మేఘ గణాలు ప్రభ... కకుభ పుత్రుడు సంకటుడు – వానికి కీకటుడు, కీకటునికి సర్వ దుర్గాభిమాన దేవతలూ

ంచారు. జామికి స్వర్గ, స్వర్గునకు నందీ పుట్టారు. విశ్వే దేవతలు విశ్వ వల్ల జన్మించారు. మాత్రం సంతానం కలగలేదు. సాధ్య వల్ల సాధ్య గణం, వారి ద్వారా అర్థ సిద్ధీ కలిగారు. ్రతికి మరుత్వంతుడూ, జయంతుడూ అనే కుమారులు కలిగారు. జయంతుడు దైవాంశ కుడు. ఆయననే మనీషులు ఉపేంద్రు డన్నారు. ముహూర్త వల్ల ముహూర్తాభిమాన ా పుట్టారు. వారు తమ ముహూర్తాలలో మానవులచే కర్మ ఫలాలను అనుభవింప జేయిస్తా ు. సంకల్ప సుతుడు — సంకల్పుడు. సంకల్పాలు కలిగించడమే వాని పని. వసువనే అష్ట వసువులు కలిగారు. వారి నామా లివి. ద్రోణ, ప్రాణ, ధృవ, అర్క, అగ్ని, వసు, విభా వసువులు. ద్రోణుని భార్య పేరు అభిమతి. ఆమెకు హర్ష, శోక, భయాది న దేవతలు పుట్టారు. ప్రాణ పత్ని అయిన ఊర్జస్వతి వల్ల సహ, అయు, పురోజ ు కల కుమారులు ముగ్గురు కలిగారు. ధృవుని పత్ని పేరు ధరణి — నగరాధిష్ఠాన దేవత నేకమందిని ప్రభవింప జేసింది. అర్క పత్ని అయిన వాసన — తృష్ణాదులను కన్నది, భార్య అయిన ధార వల్ల ద్రవిణాదులు పుట్టారు. కృత్తికా సుతుడైన స్కందుడు కూడ నందనుడే, అతనికి విశాఖాదులు పుట్టారు. దోష పత్ని అయిన శర్వరికి శిశుమారు డనే లిగాడు. భగవత్కళావతార మూర్తియై అతడు తేజరిల్లాడు. వసుని భార్య అంగిరస, శిల్ప కళానిధి అయిన విశ్వకర్మ ఉదయించాడు. కృతి అనే పత్ని వల్ల విశ్వ కర్మకు- మనువు ప్రభవించాడు. విశ్వే దేవులూ, సాధ్యగణమూ ఆయనకు జన్మించారు. విభా ుకు ఉషా దేవి వల్ల వ్యుష్ప, రోచిష, ఆతపులనే ముగ్గురు పుత్రులు కలిగారు. ఆతపునకు ామడు అనే కుమారుడు కలిగాడు, దినాభిమాన దేవత అయిన యీతని కారణంగానే స్వకార్యరతు లవుతూంటారు. భూత పత్ని అయిన సరూపకు కోటి రుద్ర గణాలు ు వీరిలో, రైవత, అజభవ, భీమ, వామ, ఉగ్ర, వృషా కపి, అజైకపాద, అహి ్య, బహు రూప, మహాన్ — అనే ఏకాదశ రుద్రులు ప్రముఖులై తేజరిల్లారు. భూత లో ద్వితీయు రాలైన భూత — భయంకర భూతాదులనూ, వినాయ కాదులనూ కన్నది. ంచిన ఏకాదశ రుద్రులూ మహా దేవునికి పార్షదులుగా ఉండిపోయారు. అంగిర, ప్రజా ప్రథమ కళత్రమైన స్వధాదేవి పితృ గణాన్ని కన్నది. అతని ద్వితీయ పత్ని సతీదేవి. అథర్వాంగిరస నామక వేదాన్నే పుత్ర రూపంలో ప్రభవింప జేసింది. కృశాశ్వ పత్ని

అర్చి ధూమ్రకేశుణ్ణి కన్నది. ద్వితీయ పత్ని అయిన ధిషణకు నల్గురు కుమారులు ు. వేదిశిర, దేవల, వయున, మను అను పేర్లతో వారు ఖ్యాతి గాంచారు. తార్క్ష్య నామక నికి నలుగురు పత్నులు, వారే వినత, కద్రు పతంగి, యామిని — అని పిలవబడ్డారు. వల్ల పక్షులూ, యామిని ద్వారా శలభాదులూ, వినత వల్ల అరుణ, గరుత్మంతులూ కలి గరుత్మంతుడు శ్రీమన్నారాయణ దేవునికి వాహన మయ్యాడు. అరుణుడు భాస్కరునికి అయ్యాడు. కద్రువ వల్ల అసంఖ్యాక సర్ప జాతి అవతరించింది.

మహారాజా ! కృత్తికాది 27 నక్షత్ర కన్యలూ చంద్ర పత్ను లయ్యారు. అందులో ి యందు చంద్రునికి అమితానురాగం. దానితో అతడు మిగిలిన భార్యలనుసక్రమంగా పోవడంతో కుపితుడైన దక్ష డతణ్ణి — క్షయ రోగివి కమ్మ — అని శపించాడు. పత్నికుడైన చంద్రునికి సంతానం కలగలేదు. మామగారైన దక్షుని మెప్పించి ఆతడు కంలో వర్ధిల్లుతూ, కృష్ణ పక్షంలో క్షీణించి షోడశ కళలతో విరాజిల్ల సాగాడు.

దక్ష పత్నుల నామాలను చెబుతాను — ఆలకించు, లోక మాత లైన వారి ద్వారా యీ వర్ధిల్లింది. అదితి, దితి, దను, కాష్ఠ, అరిష్ఠ, సురస ఇల ముని, క్రోధ, వశ, తామ్ర, తిమి — ఆదిగా గలవారు దక్ష పత్నులు. వారిలో తిమిద్వారా జలచరాలూ, సరమ వల్ల ాదులూ, సురభి ద్వారా గోగణ, మహిషగణాలే కాక రెండు గిట్టలు కల పశువులూ, డేగలూ గ్రద్దలూ ఆదిగా గల మాంసాన్ని భక్షించే పక్షులూ మునికి అప్సరసలూ యాతుధానులూ, అరిష్టకు గంధర్వులు, కాష్ఠకు అశ్వాదులూ కలిగారు. ధనువు వల్ల ఒక్క మంది పుట్టారు, ద్విమూర్ధ, శంబర, అరిష్ట, హయగ్రీవ, విభావసు, అయోముఖ, శిర, స్వర్భాను, కపిల, అరుణ, పులోమ, వృష పర్వ, ఏకచక్ర అనుకంపన, ధూమ్రకేశ, ాక్ష, విప్రచిత్త, దుర్జయాదులు ప్రముఖులుగా పరిగణకు వచ్చారు. స్వర్భానుకన్య సుప్రభను నముచి పరిణయ మాడాడు. వృషపర్వ పుత్రి అయిన శర్మిష్ఠను నహుష డైన యయాతి పెళ్ళి చేసుకున్నాడు. దను కుమారుడైన వైశ్వానరునకు నల్గురు సుందర ు కలిగారు. ఉపదానవి, హయశిర, పులోమ, కాలక — నామాలతో వారు ప్రసిద్ధి చెందారు. ్రదేశానుసారం కశ్యపుడే కాలక, పులోమ అనే కన్యల నిద్దరినీ పెళ్ళిచేసు కున్నాడు. దను ైన వైశ్వానరునికి సుందరులైన కన్యలు నలుగురు కలిగారు. ఉపదానవి. హయశిర,

, కాలక నామాలతో వారు ఖ్యాతి గాంచారు. హిరణ్యాక్షుడు ఉపదానవినీ, హయ శిరను
పెండ్లాడారు. కశ్యపుడే పులోమ కాలక - అనే కన్యలను స్వీకరించాడు. ఆ యిరువురి
...కి 60 వేల మంది జన్మించారు.

వారే పౌలోమ కాలకేయ నామాలతో విశేష ఖ్యాతి గాంచారు. నివాత కవచులన్న
నామం కూడ వీరికే ఉంది. యాగ విధ్వంస కారులైన వీరిని పరీక్షిన్నరపాలా!
మహాయైన అర్జునుడు స్వర్గానికి వెళ్ళిననాడు ఏకాకిగా సంహరించి ఇంద్రుని సంతుష్టుని
న్నాడు. సింహిక అను నామె విప్రచిత్ పత్ని. ఆమెకు 101 మంది పుత్రులు కలిగారు,
వారిలో జ్యేష్ఠుడు, గ్రహాలలో యితడు పరిగణింప బడగా మిగిలిన పుత్రు లందరూ
'మంతో వ్యవహరింపబడుతూ ఉంటారు.

శుకుడు — 'రాజా! శ్రీమన్నారాయణమూర్తి వామన రూపంలో అవతరించిన అదితి
గురించి చెబుతాను విను. వివస్వంత అర్యమ, పూష, త్వష్ట, సవిత, భగ దాత,
మిత్ర, ఇంద్ర, త్రివిక్రమ నామాలతో ద్వాదశాదిత్యులు వ్యవహరింపబడుతూ
. వివస్వంతుని ధర్మపత్ని అయిన సంజ్ఞకు, శ్రాద్ధ దేవుడు, మనువు, యముడు,
అనే నలుగురు సంతానం కలిగారు. సంజ్ఞాదేవి అశ్వ రూపంలో చరిస్తూండగా
వి వల్ల ఆమెకు అశ్వినీ దేవతలు అనే యిద్దరు పుత్రులు కలిగారు. వివస్వంతుని
పత్ని పేరు ఛాయాదేవి. అతని ద్వారా ఆమె శనైశ్చరుడు, సావర్ణి మనువు —
ఇరువురు కుమారులనూ, తపతి అనే పుత్రినీ ప్రసవించగా సంవరణుడు — ఆ తపతిని
మాడాడు. అర్యమ పత్ని అయిన మాతృక కర్తవ్యా కర్తవ్య జ్ఞాన యుక్తులైన
నామ పుత్రుని కన్నది. ఈ చర్షణుని ఆధారంగా చేసుకునియే బ్రహ్మదేవుడు వాతు
వ్యవస్థతో కూడిన మానవ జాతిని సృజించాడు. పూషా నామకాదిత్యునికి సంతానం
పురాతన కాలంలో దక్షాధ్వర విధ్వంస వేళలో వీరభద్రుడు అతని దంతాలను రాల
డు. నాటి నుండీ అతనికి క్షీరాన్నమే నైవేద్యంగా పెడతారు. దైత్య గణం యొక్క
సోదరి పేరు కుమారి రచన. ఆమెను త్వష్ట వివాహ మాడాడు. వారికి సన్నివేశ, విశ్వరూ
యిరువురు కుమారులు కలిగారు. విశ్వరూపుడు ఆ విధంగా శత్రువులైన రాక్షసులకు మేన
అయినా బృహస్పతి — ఇంద్రాదులచే అవమానితుడైననాడు పురోహితునిగా దేవతలు విశ్వ
వరించారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం- 7

## గురువు అమరులను త్యజించ వారు విశ్వరూపుని ఆశ్రయించుట

పరీక్షిత్తు ప్రశ్నిస్తున్నాడు – 'శుకమునీంద్రా! అమర గురువైన బృహస్పతి ప్రియ శిష్యులయిన అమరుల నెందుకు పరిత్యజించాడు? అమరుల బృహస్పతి పట్ల చేసిన అపచారం ఏమిటి? ఆ విషయాన్ని వివరించండి.' అనగా శుకమహర్షి బదులు పలుకుతూన్నాడు.–' రాజా! ఇంద్రుడు తాను త్రిలోకాధిపతిననే గర్వంతో సదాచారాన్ని ధర్మ మర్యాదలనూ కూడ మించి వ్యవహరిస్తూన్నారు. ఓ నాడు శచీ సమేతంగా అతడు సింహాసనంపై కూర్చుని ఉన్నాడు. మరుద్గణాలూ, వసువులూ, రుద్రులూ, ఆదిత్యులూ ఋభు, విశ్వ దేవులూ, సాధ్యులూ, అశ్వినీ కుమారులూ మహేంద్రుణ్ణి సేవిస్తూ వున్నారు. సిద్ధ, చారణ, గంధర్వాదులూ, వేత్తలైన మహర్షులూ అప్సర విద్యా ధరాదులూ, కిన్నర, పక్షి, నాగ గణాలూ ఆ రాజ్యాధి పతిని స్తుతిస్తూ సేవిస్తూన్నారు. దిశలన్నీ దేవేంద్రుని గుణ గానంతో నిండి ఉన్నాయి. శ్వేతచ్ఛత్రం చంద్రమండలం వలె శోభిల్లు తూన్నది. చామర, వాల, వ్యజనాదులు నాలలో ప్రకాశిస్తూన్నాయి. ఆ భవ్య సంఘంలో అమరేంద్రుడు శోభిల్లుతూ ఉన్నాడు. తత్సమయంలో అమర గురువు అయిన బృహస్పతుల వారు విజయం చేశారు. బృందారకు లందరి కందరూ లేచి నిలచి నమస్కరించినా మహేంద్రుడు గురువుల అగమనాన్ని తిలకించి కూడ లేవనూ లేదు వందన మాచరించనూ లేదు. కనీసం ఆసనమైనా యిచ్చి గౌరవించ లేదు. తాను కూడ లేవనే లేదు. సర్వం తెలిసిన బృహస్పతి – ఇదంతా ఐశ్వర్య మదం వల్ల కలిగినదని గ్రహించి వెంటనే స్వగృహానికి వెళ్ళిపోయాడు.

బృహస్పతులవారు దేవ సభను విడనాడి వెళ్ళిన తరువాత ఇంద్రుడు స్వదోషాన్ని గ్రహించి తనను తానే నిందించుకుంటూ – 'అహా! ఐశ్వర్య మదోన్మత్తుడనైన నేను ఆచార్యునే నిందించినాను. అత్యంత నిందాపాత్రమైన నా యీ కర్మ విచారించ దగినదే. సత్త్వగుణ ప్రధానులైన బృందారక సందోహానికి ప్రభువునైన నన్నే రజోగుణ ప్రధానులైన రాక్షసుల

ానిసిగా చేసిన యీ అమర రాజ్యలక్ష్మిని వాంఛించే వాడుంటారా? సార్వభౌముడై నా లెక్కలేదని చెప్పినవాడు ధర్మ స్వరూపం తెలియని వాడనియే అనాలి. అంతే కాక మార్గాన్ని ఉపదేశించినవాడు స్వయంగా ఘోర నరకాల పాలవుతాడు. అట్టి వచనాలను నట్టి వాడు పాషాణ నౌకను ఆధారంగా చేసుకున్నట్లే నరకాలలో అవశ్యం మునిగి ు. జ్ఞాన సాగరు లయిన మా గురుదేవులు బృహస్పతుల వారి ఎడల నేను అపరాధమే . శీఘ్రమే వారి సన్నిధికి వెళ్ళి క్షమాభిక్ష వేడుకుంటాను.' అని మహేంద్రుడు యోచి గానే బృహస్పతులవారు యోగ బలంతో అంతర్ధానమై పోయారు. దేవతాధిపతి అనుచరులు ఇంద్రుడు వెతికించడమే కాక తాను కూడ వెదికాడు, కానీ ఆయన జాడ తెలియ లేదు. ్య రహితంగా తాను సురక్షితుడు కానని మహేంద్రుడు గ్రహించాడు. అమర సమూహా ంగా స్వర్గ రక్షణ విషయమై సమాలోచన ఆరంభించాడు. ఎంతగా చింతించినా సమాధానం లేదు, దానితో మనశ్శాంతి కరువైపోయింది. ఆ యీ సమాచారాలు రాక్షస గురువు పడంతో—ఆతతాయులూ మదోన్మత్తులూ అయిన వారు ఆవకాశం చిక్కినది కదా అని స్వర్గ ా మీద దండెత్తి అమరులతో యుద్ధం ఆరంభించారు. అసుర వీరులచే ప్రయోగింపబడ్డ ాయు ో కాళ్ళూ, తలలూ నరకబడి తన సైన్యాలు హతమై పోతూంటే ఇంద్రుడు ఆ దృశ్యాలను జాలక వేదనతో బ్రహ్మదేవుని శరణు వొచ్చి ప్రార్థించగా కరుణించిన పితామహుడు పలుక డు.

"అమరులారా! యథార్థం ఆలోచిస్తే మీరు గురువు నవమానించి మహాపరాధమే చేశారు. మమన సంపన్నుడూ, భూసుర శ్రేష్ఠుడూ, వేదవేత్త అయిన ఆచార్య బృహస్పతినే ఐశ్వర్య, కార మదోన్మత్తులై అవమానించినారు. బలవంతులే అయినా మీ అపచారకారణ ంగా ల శత్రువుల ముందు తలలు వంచక తప్పలేదు. ఒకానొకప్పుడు రాక్షసులు కూడ నైన ఆచార్య శుక్రుల నవమానించి దరిద్రులై పోయారు. పునః శుక్రాచార్యులను సేవించి బల సమృద్ధులను యిబ్బడిగా పొందగలిగారు. అమరులారా! యిప్పుడు కూడ గురు ంం వల్ల రాక్షసులు నా లోకాన్ని కూడ ఆక్రమించేలా ఉన్నారు. భార్గవులు రాక్షస గణానికి శాస్త్రాన్ని సంపూర్ణంగా ఉపదేశించినారు. వారు ఏమి చెయ్యదలచినా చేసి వేస్తారు. వారికి గల ాపాయ, గుప్తాలోచనలు మీకు లేవు. ఈ దశలో వారికి స్వర్గాన్ని జయించడ మొక లెక్కా?

గొన్నయినా సునాయాసంగా కైవసం చేసుకో గలరు. గోవులనూ, గోవిందునీ, విప్ర శ్రేష్ఠ సర్వ శ్రేష్ఠంగా భావించి ఆరాధించునట్టి వారు శుభ పరంపరలనే పొందగలుగుతారు. అట్టి అమంగళా లన్న వే వుండవు. మీరు నా సూచనానుసారం త్వష్ట ప్రజాపతి పుత్రుడైన విశ్వ దగ్గరకు వెళ్ళి సేవించండి. సంయమన శీలుడు, తపోధనుడు అయిన అతని తల్లి రాక్షస పుట్టింది, రాక్షసులకు మేనల్లుడైన కారణంగా అతనికి వారి యందు సహజంగా అభిమానం ఉంటాయి. దానిని మీరు మనసులో వుంచుకుని విరోధించకండి. ఆయనను పరిపూర్ణ గౌరవించ గలిగితే మీ మనోరథాలు నెరవేరుతాయి. అన్న పితామహుని ఆదేశానుసారం లు విశ్వరూపుని దగ్గరకు వెళ్ళి అతణ్ణి హృదయమార కౌగలించుకుని పలుక సాగారు :—

"తపోధనా ! విశ్వరూపా ! నీకు అతిథులమూ ఓ విధంగా చూస్తే నీకు పితరులమూ మా మనోభీష్టాన్ని నెరవేర్చవలసిన బాధ్యత నీ మీద వుంది. గురుతుల్యు లయిన పిత జ్ఞలను పాలించి సేవించడం ఉత్తమ ధర్మమే కదా ! ఆచార్యుడు వేదం యొక్క, బ్రహ్మ యొక్క, సోదరుడు ఇంద్రుని యొక్క ప్రతిమూర్తులని గ్రహించి వ్యవహా . సోదరి దయామూర్తి, అతిథి ధర్మమూర్తి, అభ్యాగతుడు అగ్ని స్వరూపుడే. విశ్వ ండే ప్రాణులన్నీ ఆత్మ రూపాలని గ్రహించాలి. వత్సా ! శత్రువులైన అసురులు మమ్మ జయించారు. మేమిప్పుడు చాలా దుఃఖలో బాధలో వున్నాము. నిజ తపోబలంతో నువ్వు దుఃఖ దారిద్ర్యాదులను రూపుమాపి విజయాన్ని ప్రసాదించాలి. బ్రహ్మనిష్ఠుడవు కవున జన్మతః మాకు ఆచార్యుడవే. మాకు ఆచార్యునిగా నిన్ను వరిస్తున్నాము. భవదీయ తప తో సునాయాసంగా మా వైరి వీరులను జయించ గలిగెదము. కాలానుసారం — తనకన్న యిన వానికి కూడ ప్రణమిల్ల వచ్చును. గురుత్వానికి జ్ఞానం కావాలి కానీ వయస్సు అంటూ దైన్యంగా తనను ప్రార్థిస్తూన్న దేవతలయందు ప్రసన్నుడై విశ్వరూపు న్నాడు :-

'అమరులారా ! బ్రహ్మ వర్చస్సును పౌరోహిత్యం క్షీణింపజేస్తుంది. కనుకనే మనీషులు నిందించినారు. లోకాలకూ, నాకూ ప్రభువులైన మీరు వచ్చి కోరుతూ వుంటే నేను నేను. అలా అనడం న్యాయం కూడ కాదు. అకించనుడనైన నేను శిలోంఛ వృత్తులతో

న్నాను. సంతుష్టాంతరంగుడనై ప్రాప్త వస్తువులతో సత్కర్మానుష్ఠానం సాగిస్తున్నాను. నా జీవితం సాగిపోతున్నది, నిందనీయ పౌరోహిత్యం నాకేల? పాపాలకు ఆలవాలమైన హిత్యాన్ని అజ్ఞానులు మాత్రమే చేస్తారు. నన్ను మీరు కోరేది నింద్యమైన వృత్తియే. నా త్వాదృశ్యులు అర్థించగా తిరస్కరించడం భావ్యం కాదు కనుక నేను సిద్ధపడుతూ ను. త్రికరణ శుద్ధ్యాభవదీయ కార్యాలన్నీ నెరవేరుస్తాను.' అంటూ విశ్వరూపుడు మౌనం డు.

శుకమహర్షి పలుకుతూన్నాడు – 'రాజా! విశ్వరూపుడు మహత్తర తపశ్శక్తి సంప ను. ఉపరుక్త రీతిని అమరుల దగ్గర శపథం చేసి వారికి పురోహితుడై వారి సర్వ కార్యా నెరవేర్చ సాగాడు. ఆచార్య శుక్రులు నీతి శాస్త్రాను సారం అసురుల సంపదలను సంర వున్నారు. సర్వ శక్తి సంపన్నుడైన విశ్వరూపుడు వైష్ణవీ విద్యా ప్రభావంతో దేవతలకు న్ని కలుగజేస్తూ రాక్షసుల నుండి సర్వ సంపదలనూ గ్రహించి మహేంద్రుని స్వాధీనం ను. ఉదార, ధీశాలి అయిన వైష్ణవీ విద్యను మహేంద్రుడు విశ్వరూపుని నుండియే పొంద గాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం-8

# నారాయణ కవచము

పరీక్షిన్మహారాజు ప్రశ్నిస్తున్నాడు. శుక మునీంద్రా! దేవరాజైన ఇంద్రుడు ఏ నారా
కవచాన్ని ఆధారం చేసుకుని శత్రువులైన అసురుల చతురంగ బలాలనూ సునాయాసంగా
వాడో యే నారాయణ కవచ ప్రభావం చేత త్రైలోక్య రాజ్యలక్ష్మిని అనుభవించ కలిగాడో
ర సంగ్రామం యెలా జరిగిందో సవిస్తరంగా వివరించండి' అని అడిగిన పరీక్షిన్నరేంద్రు
కయోగి చెపుతున్నాడు. రాజా! దేవత లేసమయాన విశ్వరూపుని పురోహితునిగా వరిం
ఆదే సమయంలో ఇంద్రుని ప్రార్థనను అంగీకరించి విశ్వరూపుడు నారాయణ కవచం
ంచాడు.

విశ్వరూపుడు పలుకుతున్నాడు — దేవరాజా! ఇంద్రా! భయం కలిగినప్పుడు నారాయణ
ధరించి శరీరాన్ని రక్షించుకోవాలి. దాని విధి చెపుతాను విను. ఆదిలో కాళ్లూ చేతులూ
న చేసుకొని ఆచమనం చేసి ఉత్తర దిక్కుగా కూర్చుని పవిత్రాన్ని ధరించి మౌనియై
్న ధరించాలి. 'ఓమ్ నమో నారాయణాయ' 'ఓమ్ నమో భగవతే వాసుదేవాయ' అనే
రీ ద్వాదశాక్షరీ మంత్రాలతో హృదయాది అంగన్యాసం చేసికోవాలి. ఆదిలో 'ఓమ్
నారాయణాయ' అనే అష్టాక్షరిలో ఓమ్. మొదలుగా గల ఎనిమిది అక్షరములు క్రమంగా
జంఘ, ఊరు, ఉదర, హృదయ, వక్షఃస్థల, ముఖ; శిరస్సులందు న్యాసం చెయ్యాలి.
కాకపోతే పూర్వోక్తమైన మంత్రంలో 'య' కారం మొదలు విలోమ క్రమంలో ఓంకార
తం శిరో భాగాన్నుండి పాదముల వరకూ న్యాసం చెయ్యాలి. అనంతరం 'ఓమ్ నమో
తే వాసుదేవాయ' అనే ద్వాదశాక్షర మంత్రం యొక్క ఓంకారాది పన్నెండు అక్షరము
అంగుష్ఠ పర్వములందు న్యాసం చెయ్యాలి. కుడిచేతి వ్రేళ్ళతో ఆరంభించి ఎడమచేతి

తో సమాప్తి చెయ్యాలి. అందులో తర్జనాంగుళి ఆరంభించాలి. తరువాత ఓమ్, విష్ణవే నమః
మంత్రంలో ఓమ్ హృదయమందు 'వి' బ్రహ్మ రంధ్రమందు, 'ష్' భృూమధ్యమందు
ఖయందు 'వే' రెండు నేత్రములందు 'న' శరీరమందలి సర్వ సంధులందు, న్యసించి
మః, అస్త్రాయ ఫట్' అని చెప్పి దిగ్బంధనం చెయ్యాలి. ఈ విధానం తెలిసి న్యాసం
ాడు మంత్ర స్వరూపు డవుతాడు. ఆటు తరువాత సమగ్ర ఐశ్వర్య ధర్మ యశో,
జ్ఞాన, వైరాగ్య పరిపూర్ణుడైన ఇష్ట దేవుడగు భగవానుని ధ్యానించి తన్ను కూడ తద్రూ
నే భావించాలి. అనంతరం విద్య, తేజ, తపోరూపమైన నారాయణ కవచాన్ని పఠించాలి;

భగవానుడైన శ్రీహరి గరుడని వెన్నుపై చరణ కమలములు ఉంచి వున్నాడు. అణి
అష్టసిద్ధులూ ఆ హరిని సేవిస్తూంటాయి. శంఖ, చక్ర, ఖడ్గ, ధనుర్బాణ, గదా పాశములు
వుంటాడు. అట్టి ఓంకార స్వరూపుడైన భగవానుడు సర్వ దిక్కుల నుండీ నా శరీరాన్ని
ు గాక! మత్స్యమూర్తి యగు భగవానుడు నన్ను జలంలో జల జంతువుల నుండీ
ని పాశాన్నుండీ రక్షించు గాక! మాయా వటుడైన వామన మూర్తి స్థలమందూ విశ్వ
ైన త్రివిక్రముడు ఆకాశమందూ నన్ను రక్షించు గాక! ఎవని ఘోరాట్టహాసం వల్ల దశ
కంపించాయో యెవని గర్జన మాత్రాన దైత్య స్త్రీల గర్భములందున్న పిండాలు పతన
్యయో దైత్య యూథపతి శత్రువైన ఆ నృసింహుడు దుర్గములందు, అరణ్యములందు,
ములందూ, వికట ప్రదేశములందు నన్ను రక్షించు గాక! ఒకే కోరమీద భూమండ
ధరించిన వరాహమూర్తి మార్గమధ్యమందు పరశురాముడు శిఖరములందూ లక్ష్మణ
ుడైన శ్రీరాముడు ప్రవాస సమయమందూ నన్ను రక్షించు గాక! భగవానుడైన
ుణుడు మారణ మోహనాది అభిచార క్రియలు మొదలైన సమస్త ప్రమాదములనుండి
రక్షించు గాక! ఋషి శ్రేష్ఠుడైన నరుడు గర్వమునుండీ యోగేశ్వరుడైన దత్తాత్రేయుడు
విఘ్నముల నుండి త్రిగుణాధిపతియగు కపిల దేవుడు కర్మ బంధనాన్నుండి నన్ను
ు గాక! పరమ ఋషి సనత్కుమారుడు కామదేవుని నుండీ మార్గమధ్యంలో నడిచే
ు దేవతామూర్తులు మొదలైన నమస్కార యోగ్యములైనవారికి నమస్కరించనందువల్ల
ప్రమాదాల నుండి హయగ్రీవుడూ రక్షించు గాక! సేవాపరాధాల నుండి నారదుడు రక్షించు
సమస్త నరకముల నుండీ కూర్మ మూర్తి రక్షించు గాక! అపథ్యాన్నుండి ధన్వంతరీ,

సుఃఖాది భయహేతువులైన ద్వంద్వముల నుండి ఋషభ దేవుడూ, లోకాపవాదం నుండి పురుషుడూ, మనుష్యుల నుండి బలరాముడూ, క్రోధవశ నామకములైన సర్పాల నుండి నన్ను రక్షించు గాక! అజ్ఞానాన్నుండి వ్యాసభగవానుడూ, పాషండ గణాల నుండి, దాల నుండి బుద్ధదేవుడూ పాపబహుళమైన కలికాల దోషాల నుండి కలికిమూర్తి నన్ను గాక! ప్రాతఃకాలమందు గదాధరుడూ సంగవకాలంలో మురళీధరుడూ రెండు జాములు ందు శక్తిధారి యగు నారాయణుడూ రెండు జాములవేళ చక్రధారి యగు విష్ణు భగ నన్ను రక్షించు గాక। ధనుర్ధారి యగు మధుసూదనుడు మూడవ జామున రక్షించు గాక। కాలమందు త్రిమూర్తి స్వరూపుడైన మాధవుడు రక్షించు గాక। సూర్యాస్తమయా ం హృషీకేశుడూ అర్ధరాత్రివేళ, అర్ధరాత్రికి పూర్వమందు పద్మనాభు డొక్కడుగా రక్షించు గాక। రాత్రి నాలుగవ జామునందు శ్రీవత్సలాంఛనుడైన శ్రీహరి ఉషఃకాలంలో శి యగు జనార్దనుడూ సూర్యోదయాత్పూర్వం దామోదరుడూ సర్వ సంధ్యలయందూ వరుడూ నన్ను రక్షించు గాక।

రథచక్రంతో సమానమైన ఆకారం కలిగి ప్రళయ కాలీనమైన అగ్నితో సమానమైన ు కలిగి భగవంతుని ప్రేరణచే సమస్త దిశలకూ తిరిగే శక్తి కలిగి చరించే ఓ సుదర్శన గా! వాయు సహాయంచేత అగ్ని యెండు గడ్డిని దగ్ధ చేసినట్లు నా శత్రు సైన్యాలను వేయుదువు గాక! ఓ కౌమోదకీ నామకమైన గదాయుధమా! నీ నుండి జనించే నిప్పు వజ్రంతో సమానంగా సహింప శక్యము కానివి. నీవు భగవంతునికి ప్రియమైనదానవు. న సేవకుడను. గనుక నీవు కూష్మాండ, వినాయక, యక్ష, రాక్షస, భూత, ప్రేతాది దుష్టగణాలనూ చూర్ణం చేయుదువు గాక! నా సమస్త శత్రువులనూ హరింతువు గాక। ఓ శంఖమా। శ్రీహరి హస్తకమలాన్ని దీప్తించి ఆయనచే పూజింపబడి అందుండి బయలు భయంకర శబ్దం చేత శత్రువు హృదయ స్పందం ఆగిపోతుంది అట్టి భయంకర శబ్దో సామర్ధ్యం కల నీవు శత్రువుల హృదయాలను కంపి పచేసి యాతుధాన, ప్రమథ, మాతృకా, పిశాచ, బ్రహ్మరాక్షసాది భయంకర ప్రాణుల నిక్కడనుండి పారద్రోలుము. హస్త కమలాన్ని అలంకరించిన ఓ ఖడ్గమా। నీ ధార బహు తీక్షణమైనది. నీవు మాధ

పేరణచే, నా శత్రువులను ముక్కలు ముక్కలుగా ఖండించు, ఓ డాలూ! నీ యందనేక కారమైన మండలా లున్నాయి. పాపాత్ములూ పాపదృష్టి కలవారూ అయిన శత్రువుల ను మూసివెయ్యి. వారిని సర్వదా అంధులను చెయ్యి.

సూర్యాది గ్రహములు, ధూమకేతు మొదలైన కేతు గణాలూ, దుర్మార్గులైన మాన సర్పాదులూ, కోరలు గల సింహ వ్యాఘ్రాది క్రూర మృగాలూ, భూత, ప్రేత, పిశాచాది గా మొదలైన ప్రాణి హింసకములై లోక భయ కారణములైన వాని వల్ల భయమూ, గళమూ సిద్ధించడం అందరూ యెరిగినదే. భగవానుని నామ, రూప, ఆయుధాలను స్మరిం గ్రాతాన జీవుల కెట్టి భయం లేక అమంగళాలు నశించి మంగళాలు సిద్ధిస్తాయి. బృహత్, ర సామాదులచే స్తుతింపబడే వేదమూర్తి, గరుడుడూ, విష్వక్సేనుడూ వారి నామోచ్చారణ ం చేత మమ్మలను సమస్త విపత్తుల నుండీ రక్షింతురు గాక! శ్రీహరి యొక్క నామ వాహన, ఆయుధ, పార్షదులు మా బుద్ధీంద్రియాలనూ, మనో, ప్రాణాలనూ సర్వ విధాలా రు గాక!

కార్య కారణరూపమైన యీ జగమంతా భగవత్స్వరూపమే అనే సత్యాన్ని గ్రహిస్తే స్త ఉప ద్రవాలూ నశిస్తాయి. నిర్వికారమై నిరంజనమై నిరూపమైన పరబ్రహ్మ సజాతీయ య స్వగత భేద శూన్యమైన పరమాత్మ యొక్క ఏకత్వాన్ని యెవరైతే అనుభవ పూర్వ గ్రహిస్తారో, అట్టి వారి దృష్టిలో భగవానుడు సమస్త భేద రహితుడుగా గోచరిస్తాడు. తీయుడైన పరబ్రహ్మ అఘటిత ఘటనా సామర్థ్యవతి యగు తన మాయా శక్తి ద్వారా ఆయుధ, నామ, రూపాది శక్తులను ధరిస్తూంటాడు. ఇది త్రికాలాబాధ్యమానమైన . ఈ కారణం వల్లనే సర్వజ్ఞ, సర్వ వ్యాపక, సర్వ గతుడైన శ్రీహరి సర్వ కాలము నూ సమస్త ప్రదేశములందును మనలను రక్షించు గాక! భయంకరమైన తన అట్టహాసం సమస్త జీవుల భయాన్ని పోగొట్టే వాడూ తన తేజం చేత సమస్త తేజాలనూ హరించే అగు నృసింహ దేవుడు దిశావిదిశలందూ, ఊర్ధ్వాధో భాగము లందూ లోపలా బైటా ను రక్షించు గాక!

దేవేంద్రా! నీకు నేను నారాయణ కవచం వినిపించాను. ఈ కవచం వల్ల నీవు నన్ను

ంకో. దీనివల్ల నీవు అనాయాసంగా దైత్య యూధపతుల నందరినీ జయించ గలవు. ఈ
ంణ కవచాన్ని ధరించిన పురుషుడు నేత్రాలతో యెవని నైతే చూస్తాడో లేక స్పృశిస్తాడో
నీ కాలంలో సమస్త భయ విముక్తు డౌతాడు. ఈ నారాయణ కవచ రూపమైన వైష్ణవీ
నెవరైతే ధరిస్తాడో అట్టివాడు ప్రభువు, దొంగ, ప్రేత, పిశాచాదులు పెద్దపులీ మొదలైన
• జీవులవల్ల ఎప్పుడూ ఏ విధమైన భయమునూ పొందడు. దేవరాజా! ప్రాచీన కాలంలో
గోత్రికుడైన ఒక బ్రాహ్మణుడీ నారాయణ కవచాన్ని ధరించి యోగ ధారణ వల్ల తన
న్ని మరుభూమిలో త్యజించాడు. ఎక్కడైతే ఆ బ్రాహ్మణ శరీరం పడివుందో ఆ పై
గంధర్వ రాజైన చిత్ర రధుడు తన భార్యలతో కూడి విమానం మీద పయనిస్తున్నాడు.
తరథుని విమానము యీ బ్రాహ్మణుని కళేబరం మీదుగా పయనిస్తూ సరిగ్గా అదే ప్రదే
పడిపోయింది. చిత్రరథుడు విమానం పడిపోవటానికి కారణం తెలియక ఆశ్చర్యపోయాడు.
ఆలోచించినా కారణం అర్థం కాలేదు. ఇంతలో వాలఖిల్యాదుల దర్శనమై వారి వల్ల
యణ కవచ ప్రభావాన్ని గ్రహించి నారాయణ కవచాన్ని ధరించిన శరీరోల్లంఘనమే
న పతన కారణమని గ్రహించి చిత్రరథుడు ఆ బ్రాహ్మణుని అస్థుల పూర్వ వాహిని
సరస్వతీ నదిలో కలిపి ఆ నదిలో స్నానమాడి తన లోకానికి వెళ్ళిపోయాడని విశ్వ
డు ఇంద్రునకు నారాయణ కవచ ప్రభావం వినిపించాడు.

శుకుడింకా ఇలా చెపుతున్నాడు — పరీక్షిన్మహారాజా! నారాయణ కవచ ప్రభావం
వు కదా! ఏ మానవుడీ నారాయణ కవచాన్ని వింటాడో, ఆదర పూర్వకంగా యీ వైష్ణవీ
ను ధరిస్తాడో ఆ మానవుని ముందు సమస్త ప్రాణికోటీ ఆదరముతో శిరస్సు వంచి
డుతుంది. సమస్త భయ విముక్తు డౌతాడు. రాజా! శత్రక్రతువు లాచరించిన ఇంద్రుడు
ర్యుడైన విశ్వరూపునివల్ల వైష్ణవీ విద్యను పొంది రణ భూమిలో రాక్షసులను జయించి
లోక్య రాజ్యలక్ష్మిని అనుభవించాడు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం-9

### రూప వధ, వృత్రాసురుడు ఆవిర్భవించి, దేవతలను జయించుట.

### ంరి ప్రేరణాను సారం అమరులు దధీచి మహర్షిని ఆశ్రయి చుట.

శుకమహర్షి పలుకు తున్నాడు — 'రాజా! విశ్వరూపునికి సోమపాన, సురాపాన, ద — నామాలతో మూడు శిరస్సు లున్నాయని విన్నాము. అతని పితలైరున త్వష్టాదులూ, ాదిత్యులూ కూడ సోమపానార్హత కలవారే. అందులకే విశ్వ రూపుడు హవిర్భాగాలు ట్టి వేళలో త్వష్టామునకు ప్రత్యక్షంగా ఉచ్చైశ్వరంతో పంచేవాడు. మాతృ పక్షం రాక్షస కావడం వల్ల వారికి మాత్రం ప్రేమాధిక్యత వల్ల అనధికారులైన రాక్షసులకు కూడ గా నెమ్మదిగా హవిర్భాగాలను యిచ్చేవాడు. అది గ్రహించిన మహేంద్రుడు విశ్వ అధర్మానికి దండనగా వాని మూడు తలలనూ ఖండించి వేశాడు. సోమపానం చేసే కపిం జల రూపాన్నీ, సురాపానం చేసే మస్తకం కలవింక రూపాన్నీ, అన్నాన్ని ంచే ముఖం తిత్తిరి పక్షి రూపాన్నీ ధరించాయి. ఆ విధంగా విహంగ రూపాలను ధరించి రూపుడు దేహాన్ని విడనాడడంతో బ్రహ్మ హత్యా రూపమైన పాపం మహేంద్రుణ్ణి ఆవ ంది. దాని నుండి విముక్తిని పొందే శక్తి కలిగి కూడ మహేంద్రుడు బ్రహ్మ హత్యను ంచి సంవత్సర కాలం — ఆ పాపాన్ని అనుభవించి — తరువాత దానిని నాలగు భాగాలగా ని ఓ భాగాన్ని పృథ్విలోనూ, మరో భాగాన్ని తరువులయందూ తృతీయ భాగాన్ని ంనూ, నాల్గవ భాగాన్ని స్త్రీలయందూ ఉంచాడు. తన పాపాలను గ్రహించిన ఆ నాల్గిం కడు అవకాశాలు కల్పించాడు. పృథ్వియందు మానవులు త్రవ్వే గోతులు తమంత తామై ట్లూ, తరువుల శాఖలు నరికితే ఓ కొమ్మకు పది కొమ్మలు వచ్చేటట్లూ, ఎందరు ఎన్ని వినియోగించుకున్నా నదులు నిత్య ప్రవాహ రూపంలో ప్రవహించేటట్లూ, సంతానానంతరం

స్త్రీల సంపర్కం కలిగి పురుషులు వ్యవహరించేటట్లు చేశాడు. ఊసర క్షేత్రాలలో బ్రహ్మ హత్య ప్రవేశించడం వల్ల అక్కడ మాత్రం ధర్మ కర్మలు ఆచరించరాదు. తరువులలో జిగురులో వుంటుంది. కనుక శిష్ట సంప్రదాయానుసారం దానిని స్పృశించరాదు. బ్రహ్మ హత్య బుద్బుద రూపాలలో నదులయందు ప్రవేశించడం కారణంగా వాటిని తొలగించి నదులలో దులు ఆచరించాలి. స్త్రీలలో బ్రహ్మ హత్య ఆర్తవ రూపంలో ఉండడం వల్ల — రజోది త్రిరాత్ర పర్యంతం — వారి దర్శన, స్పర్శ, సంభాషణలు నిషేధించబడ్డాయి.

తన కుమారుడైన విశ్వరూపుణ్ణి మహేంద్రుడు సంహరించిన వార్త విన్న త్వష్ట ప్రజా క్రుద్ధుడై అభిచారిక హోమం ద్వారా మహేంద్రుణ్ణి అంతం చేయాలని నిశ్చయించుడు. 'మహేంద్ర శత్రుర్వర్ధస్వ' అన్న వేద మంత్రం తీసి హోమ వినియోగంగా 'ఇంద్ర వర్ధస్వ స్వాహా' అని హోమ మంత్రం అరంభించాడు. అంతే అన్వాహార్య పచనాగ్ని — గ్ని నుండి దారుణ భయంకర రూపుడైన రాక్షసుడు ఆవిర్భవించాడు. వాడు ప్రళయ మేఘంలా భాసిల్లి తేజరిల్లి పోతూన్న వాని శరీరం అనుక్షణం వర్ధిల్ల సాగింది. దగ్గ గాన్న పర్వతంలా, సంధ్యా సమయంలోని మేఘంలా వాని శరీరం నల్లగా ఉండి భాసి ప్తది. ప్రచండాగ్ని తప్తమైన తామ్రం వలె వాని కేశాలూ, గడ్డమూ, మీసాలూ శరీర వ్యాపించిన రోమాలూ ప్రకాశిస్తూన్నాయి. కళ్ళు మధ్యాహ్న మార్తాండునిలా భయంకర వెలుగు తూన్నాయి. అగ్ని జ్వాలలతో సమంగా తేజరిల్లే త్రిశూలాన్ని చేబూనిన ఆ ఘు అరుస్తూ, ఆడుతూ, గెంతుతూ పురోగమిస్తూ ఉంటే నదీ నద గిరి కానన సాగర సమే యావద్భూమండలం కంపించ సాగింది. త్రిశూలం మీద ఆకాశాన్ని ఎత్తి పట్టుకున్నాడా? స్తుంది, వాడు ఆవులిస్తూ ఉంటే దారుణమైన గిరి గుహలా — తెరువబడిన వేళలో — న్ని అంతటినీ కబళించి తారామండలాలను చప్పరిస్తాడా? అన్నట్లు గోచరమవుతూన్నది. కర దంష్ట్రలతో కూడిన ఆ వదన గహ్వరాన్ని తిలకిస్తూ ఉంటే జగత్త్రయాన్ని కబ? అన్న భయంతో సర్వులూ దిక్కులు తోచక పరుగులు తీస్తూన్నారు.

త్వష్ట ప్రజాపతి క్రోధమే ఆ రాక్షసుని రూపంలో — తమో గుణమే రాశీ భూతమై అన్నట్లుంది. సర్వ లోకాలనూ ఆక్రమించడం వల్ల అతనికి వృత్రాసురుడని పేరు

ఌ. ఇంద్రాగ్ని యమ వరుణాది అమరు లందరూ ఆ దానవుణ్ణి చతురంగ బలాలతో
ంచారు. వారి శస్త్రాస్త్రాలేవీ వానిమీద పనిచెయ్య లేదు. అమరు లందరూ భయభీతులై
గ్గాంతరం కానరాక క్షీరసాగర తీరం చేరి శ్రీమన్నారాయణమూర్తిని శరణువేడి ప్రార్థించ
రు. 'నారాయణ దేవా! పృథివ్యాప స్తేజో వాయురాకాశాది పంచ మహా భూతాలూ, వాటి
ా సృజింపబడ్డ లోక సర్వస్వమూ, సృష్టికర్తలైన బ్రహ్మాది లోకపాలురమైన మేమూ
సర్వ సంహారకమైన కాలానికి భీతిచెంది సర్వ సామగ్రులనూ సమర్పించి ఆరాధిస్తూం
ు. అట్టి కాలం సర్వదా శ్రీహరి దేవునికి భీతి చెందుతూ ఉంటుంది. అట్టి దేవుడే మాకు
డు. ప్రభూ! ఈ జగత్తులో నవ్యమన్న దేదీ లేకపోవడం వల్ల ఏమి జరిగినా నీకు
ర్యం కలుగదు. ఆత్మా రాముడవూ, సర్వజ్ఞత్వ, సర్వగతత్త్వ సర్వ వ్యాపకత్వాది
యుతుడవూ, త్రికాలా బాధ్యమానమై సచ్చిదానంద మయమై, భావా భావ రహితమైన
మాత్రమే సత్య సర్వ స్వరూపుడవై భాసిల్లుతూ ఉంటావు అట్టి నిన్ను విడనాడి అన్య
లను శరణు కోరేవారు కుక్కతోక పట్టుకుని సాగరాన్ని ఈదాలని ప్రమాదానికి గురి
ర మూర్ఖుని వంటి వారే అవుతారు.

పూర్వ కల్పంలో వైవస్వత మనువు ప్రళయ వేళలో పృథ్వీ రూపమైన నౌకను మత్స్య
పైన నీ శృంగానికి బంధించగా సునాయాసంగా ప్రళయ సంకటాన్నుండి రక్షించిన
్యవతారా! నిన్నే శరణు వేడుతూన్నాము. వృత్రాసురుని భీతి నుండి మమ్మల్ని సంరక్షిం
గాక! ప్రళయ కాలాన యావద్విశ్వమూ ఏకార్ణవం కాగా తత్సమయాన నీ నాభి కమ
బ్రహ్మ ఏకాకిగా ఉండగా - భయంకర ప్రళయ సాగరంలో - ఉత్తాల తరంగాలకూ,
ఘోషకూ నిస్సహాయుడై పడిపోగా రక్షించిన నారాయణ దేవా! వృత్రాసురుని సంకటా
కి మమ్మల్ని నువ్వే రక్షించాలి. సర్వతంత్ర స్వతంత్రా! అద్వితీయా! ఏకమాత్రుడవై
నువ్వు నిజ మాయా ప్రభావంతో మమ్మల్ని అందరినీ సృజించావు. దేవదేవుడవైన
ుగ్రహం వల్లనే మేమందరం సృష్టిస్థితి సంహారాలు కొనసాగించ గలుగు తూన్నాము.
త్మా! నువ్వే మా సమక్షంలో సర్వ కార్యాలూ చేస్తూ, చేయిస్తూన్నా అజ్ఞానవశులమై మేము
మని గర్విస్తూన్నాము. అభిమాన వశులమై నీ యదార్థ రూపాన్ని చూడజాలకున్నాము.
లచే అమరులు వేదన పడునప్పుడల్లా దేవా! గతంలో నువ్వు అనేకానేక సంకట స్థితులలో

్మలను రక్షిస్తూ వచ్చావు. ఈ ఘట్టాలు అనాదిగా జరుగుతూనే ఉన్నాయి. దేవా! నువ్వే -
త్మ స్వరూపుడవు. పరమారాధ్యా! వాసుదేవా! విశ్వకారణ కారణా! విశ్వాతీతా! విశ్వ
ా! మే మందరం సర్వాతీతుడవూ, శరణాగత వత్సలుడవూ అయిన నిన్నే శరణు వేడు
్నము. నీవారమూ, నీ భక్తులమూ దీనులమూ అయిన మమ్మల్ని నువ్వే రక్షించాలి.'

రాజా! పై విధంగా దేవతలు ప్రార్థించడంతో శ్రీహరి శంఖ చక్ర గదా పద్మ ధారియై
సమక్షంలో సాక్షాత్కరించాడు. అతని నేత్రాలు శరత్కాల వికసిత కమల దళ సమంగా
యి. విష్వక్సేనాది పార్షదులు పదహారుగురు ఆ దేవ దేవుని సేవలో ఉన్నారు. వారంతరి
హ హరి స్వరూపులే. వారికి మాత్రము వక్షఃస్థలమందు శ్రీవత్స చిహ్నమూ, కౌస్తుభమూ
ం ఉండవు. శ్రీమన్నారాయణ భగవానుని సందర్శించిన దేవతలందరూ విహ్వలురై అతనికి
ంగ నమస్కారం చేసి స్తుతించ సాగారు.

'దేవదేవా! యాగంలో స్వర్గాదులు ప్రసాదించే వాడవూ, యాగ ఫలాన్ని నిర్ణయించే
స్వరూపుడవూ కూడ నువ్వే. యాగ విఘ్నకారులైన రక్కసులను నీ సుదర్శనంతో నువ్వే
ిస్తూ ఉంటావు. అనంత నామాలు కలవాడా! మాటి మాటికీ నీకు ప్రణమిల్లుతూన్నాము.
! సత్త్వ రజస్తమో గుణాలను అనుసరించి ఉత్తమ, మధ్యమ అధమ గతులు
ంటాయి. వాటిని నిర్ణయించే నియామకుడవు నువ్వే. భవదీయ పరమపద సంబంధమైన
 రూపాన్ని యీ విశ్వంలోని ఎవరూ గ్రహించ జాలరు. దేవాధి దేవా! వాసుదేవా!
షుడవూ, పురుషోత్తముడవూ, అయిన నీ మహిమలు అనంతాలు. మంగళ
! పరమ కళ్యాణ స్వరూపా! దయామయా! సర్వ విశ్వాధారా! అద్వితీయా! సర్వే
సౌందర్య, మాధుర్య, మార్దవాదులకు అధిష్ఠానమైన శ్రీ మహాలక్ష్మికి పరమ గతివి
ప్రభూ! విరక్తులైన మహాత్ములు, ఆత్మ సంయమ రూప సమాధియందు నిన్ను
చు వేళలో — వారి విశుద్ధాంత రంగాలలో పరమహంస ధర్మమైన భగవద్భక్తి ఉద
వారి హృదయగత అజ్ఞానాంధకారం పటాపంచలై — వారి అంతరంగాలలో స్వాత్మ
రూపంలో నువ్వే గోచరిస్తావు. అట్టి ఆత్మానుసంధానం ద్వారా మానవులు నిరతి
దాన్ని పొందుతారు. ఆనందమయ స్వరూపా! నీ కివే మా వందనాలు. ప్రాకృత

ఆశ్రయ సహకారాదులు లేకనే నువ్వు నిరంతరం నిర్గుణ, నిర్వికారుడవై కూడ యీ
ఈ సృష్టిని చేసి, రక్షించి సంహరిస్తూంటావు. పరమాత్మా! ఈ సృష్టి [illegible]లో — దేవ
దులతో సమంగా గుణముల యీ కార్యరూప విశ్వంలో జీవ [illegible] జన్మించి కర్మాధీను
— పుణ్య పాపకర్మల ఫలానుభూతిని పొందు తున్నావో? లేక ఆత్మారాముడవై శాంత
భావంతో ఉదాసీనుడవై సాక్షి మాత్రుడవుగా ఉంటున్నావో కూడ మేము గ్రహించ లేక
ము. రెంటికీ సంబంధించి నువ్వే ఉంటావని ఊహించ లేకున్నాము. రెంటికీ సంబంధించి
ఉంటావని ఊహించడంలో కూడ దోషం లేదు. సాక్షాత్తూ [illegible]మైన నువ్వు అనంత
డవు. అగాధ మహిమాన్వితా! సర్వ శక్తిమంతా! [illegible] కల్ప, వికల్ప,
వితర్క విచారణల ద్వారా, అసత్య ప్రమాణాలతో [illegible] శాస్త్రాల
ంగా చదివి — దురాగ్రహం కలవారు కావడం వల్ల తమ హృదయ[illegible] చేసు
గాన్నారు. వాద వివాదావసరం — నీ పట్ల లేదు నీ యథార్థ స్వరూపం — [illegible]
సర్వస్వం కంటె పరమై, కేవలమైనది. మాయా [illegible] నీ మాయను
ఏపరచునాడు నీ యందు లేనిది ఏముంటుంది? అట్టి [illegible]లో నువ్వు [illegible]
గా ఉంటావు భావా భావా తీతా! అనిర్వచనీయా! [illegible]మైన [illegible] — భ్రాంత
కు పాముగా, మాలగా, దారంగా గోచరమవుతుంది. తెలుసుకుంటే అది భ్రాంతే. అట్లే
లకు నువ్వు కర్తగా, భోక్తవుగా గోచర మవుతావు. జ్ఞానులకు మాత్రం పరిశుద్ధ సచ్చిదా
రూపాన గోచరమవుతావు. సర్వంలోనూ నిండి [illegible]వై సర్వానికీ స్వామివై
జగత్కారణ బ్రహ్మవుగా, మూలప్రకృత్యాదులకు కూడ కారణుడవుగా — [illegible] చూడ
అర్థమవుతుంది. సర్వ జీవాంతర్యామీ స్వరూపా! నువ్వు ఆత్మారాముడవు కనుకనే
శ్వమందు గోచరించే గుణ దోషాదుల ప్రతీతి స్వాధిష్ఠాన రూపమైన [illegible]
లో చెబుతున్నాయి. విశ్వగత వస్తు సర్వస్వాన్నీ నిషేధించి శ్రుతులు శేష [illegible]లో
నిర్దేశిస్తున్నాయి. మధుసూదనా! అమృతమయమైన భవదీయ మహిమలు అనంత
సముమైనవి. ఒకే ఒకసారి — అట్టి అమృత రసాన్ని ఆస్వాదించిన మనస్సు [illegible]
నిత్యం నిర్విరామంగా పరమానంద ధార స్రవిస్తూ ఉంటుంది. తత్కారణం వల్ల [illegible]
కం విశ్వంలో విషయ భోగ సంబంధమైన లేశమాత్ర సుఖానుభవం ఉందో లేక లోక

ంభవ సంబంధమైన వచనాలు వినవస్తున్నాయో? వాటి నన్నిటినీ మరపించే వారెవరో ?
సర్వ ప్రాణి ప్రియతమా! సర్వ హితైషివీ, సుహృదుడవూ, సర్వాత్మ స్వరూపుడవూ,
శ్వర్య స్వరూపుడవూ, సర్వేశ్వరుడవూ అయిన నీ యందు సదా బుద్ధిని సంలగ్నం
నట్టివాడు, నిన్నే చింతించు నట్టివాడు నీకు అనన్య భక్తుడై స్వార్థ పరమార్థాలలో
క్యం కలవా డవుతాడు. శ్రీహరే! అట్టి నీ ప్రియ భక్తుడు జనన మరణ రూపకాల
నుండి వినిర్ముక్తుం చేసే నీ పాదారవిందార్చనను ఎలా త్యజిస్తాడు. త్రిలోకాశ్రయా!
స్వరూపా! పాద త్రయంతో జగత్త్రయాన్ని ఆక్రమించి అతిక్రమించిన వాడా!
సంచాలకా! నీ మహిమలు సర్వుల మనస్సులనూ హరిస్తాయి. దైత్య దానవాదులు
నీ విభూతులే అయినా వారి అభ్యున్నతికి ఇది వేళ కాదని యోచించి నిజయోగ
ద్వారా సుర, నర, పశు, నృసింహాది మిశ్రితాకారాలతో నువ్వు మత్స్య, కూర్మాది,
రూపాలలో ప్రాదుర్భవించి — వారి వారి అపరాధానుసారం వారిని శిక్షిస్తూ ఉంటావు.
రా! ఆ రాక్షసులను అంతం చేసినట్లే సురద్వేషి అయిన వృత్రాసురుణ్ణి కూడ అంతం
ప్రభూ! తండ్రివీ, తాతవూ, బాంధవుడవూ సర్వమూ మాకు నీవే. మేము నీవారమే,
దారవిందార్చనతో చరించే మా హృదయాలు నీ యందే ప్రేమ వల్ల బంధింపబడి
యి. దివ్య గుణాలతో సాకార రూపాన నువ్వు మా సమక్షంలో సాక్షాత్కరించి మమ్మ
ం వారినిగా చేసుకో తండ్రీ! మేము నిన్నే ప్రార్థిస్తున్నాము. దయా పూర్ణమై, విశదమై
శీతలమైన భవదీయ మందస్మిత మనోహర వదనారవిందంతో, వాగమృత వర్షంతో మా
తాపాన్ని శాంతింప జేసెదవు గాక! జనార్దన దేవా! అంశ భూతంగా అగ్నిగుండం
బయలు వెడలిన విస్ఫులింగాలు అగ్నిని ప్రజ్వరిల్ల జేయజాలనట్లు నీ అంశ రూపుల
మేము కూడ స్వార్థ పరమార్థ విషయాలను నీకు ఎరిగించ జాలకున్నాము సర్వజ్ఞా! నీతో
చెప్పగలిగేది ఏముంది? సృష్టిస్థితి సంహార కారణమైన దివ్య మాయా శక్తితో నువ్వు
స్తూ ఉంటావు. సమస్త జీవాంతః కరణలయందూ బ్రహ్మ, అంతర్యామి రూపాలలో
దీ నువ్వే. బాహ్య ప్రకృతి రూపాన తేజరిల్లే వాడవూ నువ్వే. ఈ ప్రపంచంలో ఉన్న
ాల, శరీరావస్థాదు లన్నింటికీ ఉపాదాన కారణం కూడ నువ్వే. ప్రకాశాల రూపంలో
ంతిని పొందేవాడవూ నువ్వే. సర్వ వృత్తులకూ సాక్షి మాత్రుడవూ, ఆకాశ సమంగా

గతుడవూ, అయి ఉండి కూడ నిర్లిప్తుడవుగానే నువ్వు ఉంటావు. పరబ్రహ్మా, పరమాత్మ
పా! మేము వచ్చిన అభిప్రాయం సర్వజ్ఞుడవైన నీకు తెలియనిది కాదు. కనుక మా
థాన్ని నెరవేర్చెదవు గాక! అచింత్యైశ్వర్య సంపన్నా! విశ్వ గురో! జనన మరణ
సంసార చక్రాన్నుండి విముక్తులను చేయ సర్వ శక్తి సంపన్నమైన నీ శ్రీచరణాలను
ందిన వారము. సర్వశక్తి సంపన్నా! మా శస్త్రాస్త్ర ప్రభావాది సర్వస్వాన్నీ హరించి-
యాన్ని కబళించ నున్న వృత్రాసురుణ్ణి అంతం చేసెదవు గాక! శుద్ధ స్వరూపా!
! హృద్గత విమల ప్రకాశ స్వరూపా! సర్వ సాక్షీ మాత్రుడవూ, ఆదిమధ్యాంత
డవూ, మహోజ్జ్వల యశస్సంపన్నుడవూ, అయిన నీ కివే మా ప్రణామాలు. పదే పదే
శరణు కోరునట్టి సంసార పథ గాములకు మాత్రమే నువ్వు పరమానంద ఫలాన్ని
స్తావు. అనేక జన్మల నుండీ వారు పొందుతూ ఉన్న క్లేశరాశిని దూరం చేసి వేస్తావు.
మైన ఆపదలనూ నిర్మూలనం చేయగల నీకు మేము పదే పదే ప్రణమిల్లుతూ ఉన్నాము.'

ఉపర్యుక్త విధంగా అమరులు తనను స్తుతించగా శ్రీహరి భగవానుడు వారితో అంటూ
— 'బృందారకులారా! స్తోత్రయుక్త జ్ఞానంతో మీరు నన్ను ఉపాసించారు. నేను మహా
చెందాను. ఈ స్తుతుల వల్ల మానవులకు నా యందు స్వ స్వరూప జ్ఞానం కలిగి భక్తి
ంది. అమర ప్రముఖులారా! నేను ప్రసన్నుడ నయితే యీ విశ్వ వాసులకు అలభ్య
మన్నదే ఉండదు. అయినా అనన్య భక్తులైన తత్త్వవేత్తలు నా కన్న భిన్నమైన
ాంఛించరు, విశ్వగత విషయాలే యదార్థాలని నమ్మే అజ్ఞానులు సత్యమైన కళ్యాణ
గ్రహించ జాలక — విషయ వాసనా జాలంలో చిక్కుకుని దార, పుత్ర, ధనాదులనే
ఉంటారు. మహేంద్రా! మీ సర్వులకూ శుభమగును గాక! ఇక విలంబం చెయ్యక
ుహర్షి వర్యుని దర్శించండి. తపస్సుద్వారా, వ్రతోపాసనల ద్వారా దృఢమై తేజిల్లే
వెన్నెముకను యిమ్మని అర్థించండి. బ్రహ్మానుభూతి కల ఆయన అశ్వినీ దేవతలకు
విద్యోపదేశం చేసినవాడు. అశ్వ శిరస్సు ద్వారా బ్రహ్మోపదేశం చేసిన కారణంగా
కి అశ్వ శిర నామం సార్థకమైనది. (ఉపనిషత్కాలంలో దధీచినే దధ్యఙ్ మహర్షి
) బ్రహ్మ, కర్మ విద్యలూ రెండూ తెలిసిన ఆయన — తమకు బ్రహ్మ విద్యను ఉప
నని — అశ్వినీ దేవతలు అర్థించగా కొంతకాలం ఆగి రమ్మన్నాడు. ఇది తెలిసిన

డు ఆయన దగ్గరకు చేరి — 'మహాత్మా! అశ్వినీ దేవతలకు మీరు బ్రహ్మ విద్యోపదేశం చేయకండి. వారు దేవ వైద్యులు. నా ఆదేశాన్ని అతిక్రమించి మీరు వారికి బ్రహ్మోపదేశం చేస్తే నేను మీ శిరస్సును ఖండించి వేస్తాను.' అని పలికి వెళ్ళిపోయాడు.

కొంతకాలం గడిచింది. అశ్వినేయులు దధీచిని దర్శించి — మహాత్మా! వాగ్దానానుసారం మాకు బ్రహ్మ విద్యోపదేశం చేయండి. అని అర్థించగా మహర్షి వారికి మహేంద్రుని హెచ్చరికను తెలియజేశాడు. అంత వారందుకుని — 'మహాత్మా! నీకు అసత్య దోషం అంటకుండా ఇంద్రునకు ప్రతిజ్ఞా భంగం కలగకుండ మేము చేయగలము, నీ శిరస్సును వేరుచేసి మా దివ్య ప్రభావంతో దానిని కాపాడుకుంటూ అశ్వ శిరస్సును నీకు మొండానికి అతుకుతాము. ఆ శిరస్సుతో నువ్వు మాకు బ్రహ్మ విద్యోపదేశం చెయ్యి. అప్పుడు మహేంద్రునకు వచ్చి నీ శిరస్సును ఖండించగా పునః మేము మీ శిరస్సును మీకు అనుసంధానిస్తాము.' అన్నారు. అంగీకరించి దధీచి మహర్షి అశ్వినేయులకు బ్రహ్మ విద్యోపదేశం చేశాడు. ఆ దివ్యోపదేశం పూర్తి కావడంతో దేవేంద్రుడు వచ్చి ఆ మహర్షి శిరస్సును ఖండించి వేశాడు. వెంటనే అమరవైద్యులైన అశ్వినీ దేవతలు మహర్షి మస్తకాన్ని యథాతథంగా అతికి వెళ్ళారు. నాటి నుండియే ఆ మహర్షికి 'అశ్వశిర' నామం ఏర్పడింది. ఆయన అశ్వినేయులకు ఉపదేశించిన విద్య కూడా 'అశ్వశిర' నామం అనే ప్రసిద్ధి గాంచినది.

అథర్వణ వేద వేత్త అయిన దధీచి మునీంద్రుడు నారాయణ కవచాన్ని ఆదిలో త్వష్ట ప్రజాపతికి ఉపదేశించాడు. అతడు తన కుమారుడైన విశ్వ రూపునకు ఉపదేశించగా దానినే ఆ విశ్వరూపుడు ఇంద్రా! నీకు ప్రసాదించాడు. ధర్మ మర్మజ్ఞుడైన దధీచి మహర్షి అశ్వినేయులు అడిగితే అమరులైన మీ కోసం తన శరీరాన్ని అర్పిస్తాడు. ఆయన ఎముకలతో విశ్వకర్మ ఆయుధాన్ని తయారు చేస్తాడు, దేవేంద్రా! నువ్వు ఆ దివ్యాయుధ ధారివై నా అపారానుగ్రహం నీకు తోడు కాగా వృత్రాసురుని అంతం చేసెదవు గాక! అనంతరమే మీ సర్వశక్తి ప్రభా వైశ్వర్యాలు చేకూరుతాయి. భవిష్యత్తులో మీకు సమస్త శుభాలూ చేకూరుతాయి. నన్ను శరణు వేడిన వారికి లోటు అన్నదే ఉండదు.

— 0

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం-10

### అమరులు దధీచి ఎముకలతో వజ్రాన్ని నిర్మించుట. వృత్రాసురు సేనలతో వారు పోరాడుట.

శుకమునీంద్రులు పరీక్షిన్మహారాజుతో పలుకుతూన్నారు – రాజా! విశ్వ ప్రాణదాత శ్రీమన్నారాయణ భగవానుడు మహేంద్రునితో ఆ రీతిగా భాషించి ఆదేశించి వెంటనే ్యమైపోయాడు. అంత మహేంద్రాది బృందారకులు దధీచి మహర్షి ఆశ్రమం చేరి ఉయ ణమిల్లి - హరి ఆదేశానుసారం దధీచిని తన శరీరం తమ కిమ్మని అర్థించగా మహో స్వభావుడైన ఆ పరమర్షి బ్రహ్మానంద పరవశుడై అమరులతో – 'బృందారకులారా! వేళలో జీవులు సహించరాని వేదన పడతారనీ, జీవాలతో ఉన్నప్పుడు వర్ణనాతీతమైన తప్పవనీ, అవసానదశలో స్మృతిని కోల్పోవడం మీకు తెలియదు. జగత్తులో చిరకాలం 'లని అభిలషించే వారందరికీ యీ దేహం కన్న మిన్న అయిన దేదీ లేదు. అట్టి ప్రాణ మైన శరీరాన్ని సాక్షాత్తూ భగవంతుడే వచ్చి యిమ్మన్నా జీవేచ్ఛ కలవా డీయడు. అట్టి ం చెయ్యగలవా డెవడు?' అనగా అమరులు సమాధానం యిస్తూన్నారు.

'మహాత్మా! త్వాదృశోదారులైన ధన్యాత్ములు సర్వ ప్రాణులయందూ కరుణ కల మహో కీర్తిని మనీషులైన జ్ఞానులు కూడ గానం చేస్తూ ఉంటారు. అట్టి విశ్వ విఖ్యాతులైన తమ వారికి జగత్కల్యాణం కోసం సమర్పించరాని వస్తు వన్నది ఉంటుందా? యాచకులు స్వార్థపరులే అయి ఉంటారు. దాతల కష్ట నష్టాలను గురించి యోచించే స్వభావం వారి . అట్టి భావమే ఉంటే అసలు వారు యాచించనే యాచించరు. అలాగే దాత కూడ ల కోర్కెలను నెరవేరుస్తాడు కానీ – వారి బాధలను గురించి యోచించడు. యాచకునకు కం, దాతకు దానం చెయ్యడం నైసర్గిక స్వభావాలై ఉంటాయి. కావున మీరు మాకు విపత్తులను కూడ గ్రహించి కాదనకుండా మీ దేహాన్ని ప్రసాదించెదరు గాక!' విని దధీచి మహర్షి చిన్నగా నవ్వి – 'అమరులారా! మీ వల్ల ధర్మ వాక్యాలు వినా

నేను పలికాను కానీ మరోటి ఏమీ లేదు. రేపోమాపో రాలిపోయే యీ దేహం స్థిర
కాదనీ ఏనాటికైనా పతనం కాక తప్పదనీ నాకు తెలుసు. అప్పుడీ దేహం వ్యర్థం కావల
దా! నేడే యిది విశ్వ కళ్యాణార్థం వినియోగపడుతూన్నదంటే యింతకన్న మిన్న అయి
మున్నది? అస్థిరమైన యీ శరీరాన్ని విశ్వసించి అజ్ఞానంలో మునిగిపో జాలను.
ంగా దీనిని మీకు సమర్పిస్తాను. అమర ప్రముఖులారా! అస్థిరమైన యీ దేహాన్ని
ంచి — జీవులపై కరుణ చూపక ధార్మిక భావ శూన్యులైనవారు వృక్షాదుల కన్న నీచులే.
యులందరూ సర్వదా ధర్మ మార్గానువర్తులై ఆత్మ కళ్యాణంలో లోక కళ్యాణాన్ని
ారు. అట్టి సత్పురుషుల సుఖ దుఃఖాలలో పాలుపంచుకుని పూర్ణ కాములు కాగలిగారు. ఈ
ో ఉండే ధన, జన, దేహాదులు క్షణ భంగురాలు కాగా వారెవరూ తనకు యిహంలో
పరంలో కానీ సుఖశాంతులను ప్రసాదించ జాలరు. వీటినే విశ్వసించి లోభి కృపణు
డు పరోపకార దూరు డవుతూన్నాడు. ఇది ఎంతగా విచారించ దగిన విషయమో గుర్తిం
అని పలికి జ్ఞాని అయిన దధీచి మహర్షి అస్థిరమైన యీ శరీరాన్ని పరిత్యజించి
హ సత్య రూపుడూ అయిన భగవంతునిలో లీనమై పోయాడు. ఆ మహర్షి మనో
దియాలు స్వాధీనంలోనే ఉన్నాయి, ఆయన తత్త్వజ్ఞుడు కావడం వల్ల ఆయన కర్మ
న్నీ విచ్ఛిన్నమై పోయాయి. దేహాత్మ భావం లేనివాడు కావడం వల్లనే తన శరీరం
ప్పదన్న విచారాన్ని ఆ మహాత్ముడు విడనాడ గలిగాడు.

మహేంద్రుడు దైవశక్తిని పొంది తేజోబల పౌరుషాదులతో వర్ధిల్లాడు. విశ్వకర్మ
అస్థికలతో వజ్రాయుధాన్ని తయారుచేసి దేవరాజుకు సమర్పించాడు. వజ్రపాణి అయిన
ద్రుడు ఐరావతాన్ని ఎక్కి అమరు లందరూ పరివేష్టించి రాగా, మహర్షి బృందాల స్తుతు
ఉహోత్సాహం చెంది లోక కంటకుడైన వృత్రాసురునిపై యుద్ధం ప్రకటించాడు. రుద్రుడు
మీద కురికినట్లు మహేంద్రుడు వృత్రుని మీదకు విపరీత క్రోధంతో ఉరికాడు. తన
సైన్యాలతో వృత్రాసురుడు కూడ యుద్ధ రంగంలో మహేంద్రునికి అభిముఖంగా మోహ
ంబడ్డాడు. వైవస్వత మన్వంతరంలో ప్రథమ చతుర్యుగ పరిభ్రమణంలో కృతయుగం
త్రేతాయుగం ఆరంభమైన వేళలో నర్మదా నదీ తీరాన యీ సురాసుర యుద్ధం ఆరంభ
ది. తత్సమయాన మహేంద్రుడు వజ్రాయుధాన్ని ధరించి ఐరావతారూఢుడై పురోగమిస్తూ

ఏ ఆదిత్య, వసు, రుద్ర గణాలూ అశ్వినీ దేవతలూ, మరుద్గణ, పితృగణ, అగ్ని, ఋభు, ్యగణ, విశ్వేదేవ గణాది దేవత లందరూ తనను వెన్నంటి యుద్ధ సన్నద్ధులై వస్తూంటే ంద్రుడు మహా ప్రకాశంతో తేజరిల్ల సాగాడు. వృత్రా సురాది దానవులకు దేవరాజు ప్రజ్వలి ్లా గోచరించ సాగాడు. వృత్రుని అనుసరించి నముచి, శంబర, అనర్వ, ద్విమూర్ధ, ఋషభ, ంర, హయగ్రీవ, శంకు శిర, విప్రచిత్త, అయోముఖ, పులోమ, వృషపర్వ, హేతి, ప్రహేతి, ), సుమాలి, ఉత్కళాది, సహస్ర సంఖ్యలలో రాక్షస ప్రముఖులు సువర్ణాభరణాలూ, ాలూ ధరించి సమస్త శస్త్రాస్త్రధారులై దేవ సేనలను ఎదురించ సాగారు. రాజా! తత్సమ లోని అమర సైన్యాలను మృత్యువు కూడ జయించ జాలదు. దురహంకారులైన రాక్షసులు ణరంగంలో భయ రహితంగా వీర విహారం చేస్తూ గదా, పరిఘ, బాణ, పాశ, ముద్గర, ంర, శూల, పరశు, ఖడ్గ, శతఘ్ని భుశుండీ — ఆదిగా గల శస్త్రాస్త్ర ప్రహారాలతో అమర ఎదుర్కొన్నారు. రాక్షసులచే ప్రయోగింపబడ్డ శస్త్రాస్త్రాలు దేవతలను సమీపించకముందే ర సేనలు వారి సమస్త శస్త్రాస్త్రాలనూ మధ్యే మార్గంలోనే తుత్తునియలు చేసివేస్తూన్నారు. రుల సర్వాయుధాలూ విఫలమై పోవడంతో వారు గిరులనూ, తరువులనూ ఆయుధాలుగా యోగించ సాగారు. వాటిని కూడ దేవతలు మధ్యే మార్గంలో నరికివేస్తూన్నారు. రాక్షసులు యోగించే ఆయుధాలేవీ దేవతలను కదల్చలేక పోతూన్నాయి. వారి ధైర్యం సన్నగిల్లి యింది. భగవద్భక్తులై, శ్రీకృష్ణానుగ్రహం పొందిన వారిని దుష్టుల దుర్వచనాలూ, ప్రయ లూ ఫలించనట్లే శ్రీకృష్ణానుగ్రహం పొందిన వారిని ఏమీ చేయజాలనట్లే భగవంతుని ఆశ్ర ించిన దేవతలను రాక్షసుల ప్రయత్నాలేవీ ఫలించలేదు. భగవద్విముఖులైన రాక్షసులు బలహీ ై, తేజో విహీనులై ధైర్యాన్ని పోగొట్టుకుని బలాహంకారాలను విడిచి వృత్రాసురుణ్ణి వదిలి పలాయనం చిత్తగించి వెళ్ళిపోయారు. బల పౌరుష హీనులై రణరంగం వదలి పారిపో ే సేనలను తిలకించాడు. వృత్రుడు, వికటంగా నవ్వాడు. ఆ వీర శిరోమణి దానవ ప్రముఖు తిలకించి — 'దానవులారా! మీరు పరుగులు తీయకండి. నా మాట వినండి. ఈ విశ్వంలో న ప్రతి ప్రాణీ గిట్టక తప్పదు. ఈ సృజన క్రమంలో మృత్యువు నుండి తప్పించుకునే యాన్ని చెప్పలేదు. ఈ దశలో కీర్తి, స్వర్గాదులను ప్రసాదించునట్టి మృత్యువును ప్రశాలి వాడు ఎలా త్రోసిపుచ్చ కలడు? ప్రపంచంలో రెండు రకాలైన మరణాలు ఏర్పడద

మని మనీష అంటున్నారు. అందులో ప్రాణాలను వశమందుంచుకుని భగవచ్చింతనలో
ఐ త్యాగం చెయ్యడం ప్రథమ శ్రేణికి చెందినది రెండవది — శస్త్రాస్త్రధారియై రణ
రో వెన్ను చూపకుండ యుద్ధం చేసి వీరోచితంగా దేహాన్ని త్యాగం చెయ్యడము.
వీరులు కావడం వల్ల ప్రథమ మార్గం లాభం లేనిది. మీరా వీరాగ్రేసరులు, సమ
ంభించినది. స్వర్గ ద్వారాలు సునాయాసంగా తెరుచుకుంటూ ఉంటే నరకం వైపు ఏల
మిస్తారు. శరీర ధారులకు మృత్యువు అవశ్యం భావ్యమన్న విషయాన్ని నిశ్చయంగా
ంచి యుద్ధరంగంలోకి దూకండి. జయించారా? రాజ్యలక్ష్మి కీర్తి కాంతా సమేతంగా
ం మవుతుంది. ప్రాణాలను కోల్పోయారో శాశ్వత సత్కీర్తితో వీర స్వర్గమే లభి
అంటూ వేద ధర్మాలను చెప్పాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–6 – అధ్యాయం–11

### వృత్రాసురుని ధైర్య వచనాలు, దైవ ప్రాప్తి.

శుకమహర్షి — 'రాజా! ధర్మబద్ధమైన వృత్రాసురుని పలుకులను ఆలకించే స్థైర్యం
తావరణంలో పడిపోయి భయభీతులై దానవులు పారిపోతున్నారు. సానుకూలం సమయం
ని అమరులు అసురులను తరిమివేస్తూన్నారు. నాయక రహిత సేనలవలె తన సేనలు అన్ని
న్నమై పారిపోవడం గమనించి క్రోధోన్మత్తుడైన వృత్రాసురుడు బలవంతంగా అమర
ముందుకు రాకుండా నిలిపి గర్జిస్తూ — 'క్షుద్ర దేవతలారా! రణరంగంలో వెన్నుచూపి
నం సాగించేవారా — వారి జననీ జనకులు విసర్జించిన మలమూత్ర సములు. అట్టి హీను
నులపై చేసే శస్త్రాస్త్ర ప్రయోజనం ఏముంది, శూర వీర పరాక్రమ సంపన్నులైన
ంటి జగత్రయ నాథులు భయకంపితులపై శస్త్ర ప్రహారం చెయ్యడం కీర్తి హానియే కానీ
కరమైనది మాత్రం కాదు. యదార్థంగా మీకు యుద్ధం చెయ్యాలని ఉన్నా — విషయ

లు అనుభవించాలని లేకపోయినా క్షణకాలం నాతో యుద్ధంచేసి విశేషాలను చూడండి.' అని
వృత్రాసురుడు తన విశేషాకార, బలాదులతో అమర సమూహాలను భయభీతులను
వేశాడు. కుపితుడు వాడు చేసే సింహనాద శ్రవణ మాత్రంచే తమపై
పలు పడినట్లు దేవతలు మూర్ఛపోయారు. మదపుటేనుగు తామర కొలనును మర్దించి ఛిన్నా
ం చేసివేసినట్లు వృత్రాసురుడు అమరసేనలను హింసించ సాగాడు. యుద్ధోన్మత్తుడై ఆ
దానవుడు భీకర త్రిశూలాన్ని ధరించి తన సింహ గర్జనలకు భీతిచెంది స్మృతి హీనులై
తనులై కళ్ళు మూసుకుని యున్న అమరులను కాళ్ళతో త్రొక్కి నలిపి వేస్తున్నాడు. వాని
నాద, పాద ఘట్టనలకు పృథ్వి కంపించి పోతూన్నది. అమర సేనల దైన్యావస్థను
డం చూసిన మహేంద్రుడు ప్రళయాగ్నిలా ప్రజ్వరిల్లి వృత్రాసురుని మీదకు ఉరికాడు.
తన శత్రువైన వృత్రుడు భయం లేకుండా తనమీదకు రావడం గమనించిన దేవరాజు
భీకరమైన గదను విసరగా వృత్రుడు అది తనమీదకు రాకుండానే పట్టుకుని దానితోనే
త కుంభస్థలాన్ని వేధించాడు. ఇంద్ర వాహనాన్ని వేధించిన వృత్రుని పరాక్రమాన్ని
చిన వారందరూ అతణ్ణి ప్రశంసించారు. ఆ గదాఘాతం వల్ల ఐరావత గజం ఎనభై
దూరం వెనుకకు పోయి మూర్ఛపోయింది. దాని శిరస్సు నుండి రక్తం స్రవించ సాగింది.
తప్పి పడిపోయిన ఐరావత గజాన్ని తిలకించిన మహేంద్రుడు విచారంలో మునిగి
డు. యుద్ధ ధర్మం తెలిసిన వృత్రుడు విచారంలో మునిగిపోయాడు. యుద్ధ ధర్మం తెలిసి
వృత్రుడు అది చూసి తిరిగి గదను ప్రయోగించక నిలబడ్డాడు. ఇంద్రుడు అమృతాన్ని
స్తంతో ఐరావతం యొక్క శిరస్సును స్పృశించడంతో ఆ దేవ గజం శ్రమను దూరం
న్నదై ద్విగిణీకృతోత్సాహంతో పురోగమించ సాగింది. అంతవరకూ యుద్ధాన్ని ఆపు
వృత్రాసురుడు పురందరుని పునరాగమనాన్ని చూసి మనసా యిలా అనుకుంటూన్నాడు –
ంద్రుడు వజ్రపాణియై రణరంగంలో పురోగమిస్తూన్నాడే' వెంటనే ఆతడు ద్విగుణీకృతా
తో సోదరుడైన విశ్వరూపుని యింద్రుడు సంహరించిన ఘట్టాన్ని స్మరించుకుంటూ గంభీ
పలకసాగాడు—

మహేంద్రా! నేడు నా అదృష్టం పండింది. నా సోదరుడైన విశ్వరూపుడు విప్రశ్రేష్ఠుడే
కు ఆచార్యుడు కూడాను. అట్టి గురువునే సంహరించిన నువ్వు నాకు పరమ శత్రు
ఉన్నావు. నీ వక్షఃస్థలాన్ని నిశిత త్రిశూలంతో వేధించి సోదర ఋణాన్ని తీర్చు

ను. ఇది నాకు బ్రహ్మానందకరమైన విషయమే. ఇంద్రా! భూసురోత్తముడు, వేద
యాగ దీక్షితుడూ, విశేషించి నీకు గురువూ అయిన నా సోదరుడైన విశ్వరూపుని
లను మూడింటినీ నువ్వు ఖండించివేశావు. స్వర్గకామి అయిన అయినవాడు దయా రహితంగా
లో పశు మస్తకాన్ని ఖండించినట్లే నువ్వూ చేశావు. శ్రీ, హ్రీ, యశస్సులు మూడూ
పరిత్యజించాయి. నరులే కాదు — అసురులు కూడ నిన్ను నిందించే పనిచేశావు. నిన్ని
నా త్రిశూలంతో ఖండ ఖండలు చేసివేస్తాను. నిన్ను చిత్రహింస చేసి మరీ సంహ
. పాపాత్ముడవైన నిన్ను అగ్ని దహించదు. అతి కష్టం మీద నువ్వు అంత మవుతావు.
గ్రద్దలు పొడిచి, పొడిచి మరీ భక్షిస్తాయి. మూఢులైన యీ అమరులు నీవంటి మహా
అనుసరించి నాతో పోరుతూన్నారు, వీరందరి శిరస్సులూ నా త్రిశూలంతో ఖండించి భూత
సంహార భైరవ, క్రోధన భైరవ, ఉన్మత్త భైరవాది గణాలకు బలి చేస్తాను. వీరా!
నువ్వు నా సైన్యాలను అంతంచేసి, నీ వజ్రాయుధంతో నా శిరస్సును ఖండించ వచ్చును.
నా దేహాన్నే బలి పశువుగా పశుపక్ష్యాదులకు సమర్పించి సర్వ కర్మ విముక్తుడనై
పురుషుల చరణారవిందాలను ఆశ్రయించి — మహనీయులు ఏ మహోత్తమ లోకాలను
తారో? నేనా ఉత్తమ లోకాలను పొందుతాను. ఇంద్రా! నీ శత్రువు నైన నేను నీ ఎదుట
ఉన్నాను. నాపై నీ అమోఘ వజ్రాన్ని ఏల ప్రయోగించవు? సంశయించకు. నీ గదా
గం వ్యర్థమైనట్లే నీ వజ్ర ప్రహారం కూడ విఫల మవుతుంది. లోభిని యాచించిన వానిలా
యత్నమూ వ్యర్థమై పోతుంది. శ్రీహరి తేజస్సుతో, దధీచి మహర్షి తపశ్శక్తితో నీ
యుధం శక్తివంతమై ఉంది. నన్ను అంతం చేయవలసినదిగా శ్రీమన్నారాయణ దేవుడు
జ్ఞ కూడ యిచ్చాడు. శ్రీహరి చేరి ఉన్న పక్షానికే యశో విజయ లక్ష్మిలు కూడ దక్కు
ఈ సమయంలో నీకు ఆ దైవం అనుకూలంగా ఉన్నాడు. శ్రీహరి దేవుని ఆదేశాను
నేనాయన శ్రీ చరణాలలో మనస్సును సంలగ్నం చేసి ఉంచుతాను. నీ వజ్రాయుధం
ంచేది నన్ను కాదు, నాలో ఉన్న విషయ వాసనా రూపమైన సంసార బంధనాన్ని
వేస్తుంది. నేను యీ తీరాన్ని పరిత్యజించి మునిజన సముచితమైన గతిని పొంద గలుగు
తనకు అనన్య భక్తుడైనవాడే శ్రీహరికి స్వజను డవుతాడు. అట్టి వానికి ఆ దేవదేవుడు
ను సంబంధిత సంపదలను ప్రసాదించడు. వీటివల్ల పరమానందం లభించదు. అకారణ

ం, ఉద్వేగాభిమాన కలహ, మనోవ్యధ దుఃఖాదులను కలిగించే ఉభయలోక భోగ భాగ్యాలూ క్షణికాలే. అందులకే పరమాత్మ తన భక్తులకు పునరావృత్తి లేని మోక్షాన్నే ప్రసాదిస్తాడు. వుడు తన వారికి ధర్మార్ధ కామ రూపమై, త్రివర్గ సాధనా రూపమైన ప్రయాసను వ్యర్ధం ు. యదార్ధం ఆలోచిస్తే వీటివల్ల దైవకృప అనుమానించబడుతుంది. ఆ స్వామి దివ్యాను ం కల భక్త జనులకు మాత్రమే ఆయన కృపా ప్రసాదం అనుభవ గమ్య మవుతుంది అన్యులకు దుర్లభమైనదని యోచించాలి.

మహేంద్రునితో అలా పలుకుతూనే వృత్రాసురుడు శ్రీమన్నారాయణ భగవానుని ప్రత్య వం కలవాడై స్తుతించ సాగాడు.

దేవాధి దేవా! నారాయణ దేవా! భవిష్యజ్జన్మలో ఏకాగ్ర చిత్తంతో నీ పాదారవిందాలను ఘించే ధన్యాత్ములను సేవించే భాగ్యాన్ని ప్రసాదించెదవు గాక! జగన్నాథా! నా మనస్స రం నీ దివ్యమంగళమయ గుణాలనే స్మరించేటట్లు ఉండును గాక! నా వాక్కు నీ ణ గుణ గానంలోనూ నా అవయవాలన్నీ నీ సేవయందూ సంలగ్నమై యుండును గాక! శ్వర నిధీ! నేను నిన్ను విడనాడి స్వర్గ, భూ, పాతాళలోక సామ్రాజ్యాలు కానీ, చివరకు న్ని కానీ అభిలషించరు. మనో వాక్కర్మల ద్వారా నిన్ను సేవిస్తూండే ఆనందం మరి లోనూ లేదు. రెక్కలు రాని పక్షి కూనలు తన తల్లి రాక కోసం ఎదురు చూసేటట్లు ఆకలితో దూడ తల్లి పాలను త్రాగాలని ఆతురతతో ఆవుకోసం ఎదురు చూసేటట్లూ భర్తృ వియో ఉన్న సతి అయిన విరహిణి ప్రవాహంలో ఉన్న భర్తకై వేయి కళ్ళతో నిరీక్షించేటట్లు నస్సు పద్మదళ లోచనుడవైన నీకై పరితపిస్తూన్నది. దేవా! నేను ముక్తిని కోరడం స్వకర్మ ఫలానుసారం విశ్వంలో ఎక్కడ ఏ జన్మ లభించినా బాధ లేదు కానీ, భగవద్భ మైత్రి లభించేలా కరుణించు దేవా! నీ మహామాయ వల్ల మోహితులై దారాపుత్ర గేహ ధనాసక్తులై ఉండేవారి సంబంధం మాత్రం నాకు ఎన్నడూ లేకుండా అనుగ్రహించు ! ఇదియే నా అభిలాష.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-12

## వృత్రాసుర వధ.

శుకమహర్షి పలుకుతూన్నాడు :– పరీక్షిన్నరపాలా ! యుద్ధరంగంలో వృత్రాసురుడు ప్ర త్యజించాలనియే కోరుతూన్నాడు. అతడు రాక్షసుడే అయినా జ్ఞాని కావడంవల్ల భగవత్ యే శ్రేష్ఠమని భావించాడు. అందులకే ప్రళయకాల సాగరంలో కైటభ దానవుడు శ్రీహరి లంఘించినట్లు వృత్రాసురుడు శూలపాణియై మహేంద్రుని మీదకు విరుచుకు పడ్డాడు. ం కాలాగ్ని జ్వాలా సదృశంగా భాసించే త్రిశూలాన్ని ధరించి వృత్రాసురుడు దానిని తిప్పుతూ ోపంతో ఇంద్రుణ్ణి సమీపించి ప్రళయ మేఘ సమంగా గర్జిస్తూ – ఒరే పాపీ ! నువ్వింక వు. అంటూ శూలాన్ని విసిరాడు. శూలాయుధం అగ్ని శిఖలను వెదజల్లుతూ తనవైపు చూసిన మహేంద్రుడు ధైర్యాన్ని కోలుపోక వృత్రుని బాహువుతో ఆ శూలాయుధాన్ని శక్తి సంపన్నమైన తన వజ్రాయుధంతో ఖండించి వేశాడు. భుజం ఖండింపబడగా సురుడు క్రోధోన్మత్తుడై ఇంద్రునిమీద పడి రెండవ చేతితో వాని హనువును వేధించగా ఆ ఇంద్ర హస్తం నుండి వజ్రాయుధం జారి పడిపోయింది. వృత్రుడు అంతతో ఆగక యుధంతో ఐరావతాన్ని కూడ వేధించి వేశాడు.

అలౌకికమైన వృత్రాసురుని పరాక్రమాన్ని తిలకించి సురాసుర చారణ సిద్ధ గణాలు ని కీర్తించాయి. కానీ మహేంద్రుని సంకట స్థితిని చూసి మాత్రం హాహా రవాలు చేశాయి. ఇంద్ర హస్తం నుండి జారి పడిపోయిన వజ్రాయుధం వృత్రాసురుని సమీపంలో పడి ది. ఆ దృశ్యాన్ని తిలకించిన మహేంద్రుడు లజ్జవల్ల దానిని తీయలేదు. వృత్రాసురుడు – ా ఇది విచారించవలసిన సమయం కాదు. వెంటనే వజ్రాయుధాన్ని తీసుకుని నీ శత్రువును ంచు. సర్వజ్ఞుడూ, సనాతనుడూ, ఆదిపురుషుడూ అయిన శ్రీహరి దేవుడు మాత్రమే ి సంహారాలు కొనసాగించ సర్వ సమర్థుడు. అతని కన్న భిన్నులైన దేహాభిమానులూ,

సక్తి కల ఆతతాయులూ ఎన్నడూ జయాన్ని పొందజాలరు. వారు ఒకచో జయాన్నీ, చో పరాజయాన్నీ పొందుతూ వుంటారు. లోకపాల సమేతంగా లోకాలన్నీ వలలో చిక్కిన వలె కాలాధీనులై, వివశులై ఉంటాయి జయాపజయాలకు అట్టి కాలమే మూలమూ, కారణమూ కూడ. ఆ కాలమే మనో బుద్ధీంద్రియ శరీర బల, ప్రాణ, జీవన మృత్యు లలో ఉంటుంది. అది గ్రహించలేని మూఢులు జడ రూపమైన యీ దేహాన్ని విశ్వసించి జయాపజయ కారణంగా భావిస్తారు. కర్రబొమ్మ, యంత్ర హరిణమూ - తమను ఆడించే శంలో ఉన్న రీతిగానే యావజ్జీవరాశీ భగవంతుని ఆధీనంలో ఉంటుందని గ్రహించు. కరుణ లేనివాడు ఎందుకూ పనికిరాడు. ప్రకృతీ, మహత్తత్త్వ, అహంకార, పంచభూత, యి, అంతఃకరణ చతుష్టయాదు లేవీ విశ్వ సృష్టి లయాదులకు సమర్థమైనవి కావు. పర యే సర్వ నియామకు డని తెలుసుకోలేనివాడు పరతంత్రుడైన జీవునే స్వతంత్రుడనీ, రూ, భోక్తయూ కూడ అతడే నని భావిస్తూ ఉంటాడు. యవాద్గానికి ప్రాణుల ద్వారా డే ప్రాణులను సృజించి అంతం చేస్తూ వుంటాడు. వ్యతిరేక కాల మాసన్నమైతే మాన కోరకపోయినా అపకీర్తీ మృత్యువూ కూడ ఏర్పడుతాయి. కాలం అనుకూలించిన వేళ ద్రాయ, ధన, యశస్సులూ ఐశ్వర్యాది భోగాలూ కూడ ప్రాప్తిస్తాయి. కనుక జయాప సుఖ దుఃఖ, కీర్తి అపకీర్తి జనన మరణాదులయందు యిచ్ఛానిచ్ఛలనూ ప్రకటించరాదు. వంతో ఉండి హర్ష శోకాదులకు వశీ భూతుడు కాకుండా సంచరించాలి. సత్త్వ రజ స్తమో మూడూ ప్రకృతి సంబంధితాలే గానీ ఆత్మ సంబంధితాలు మాత్రం కావు. కనుక వాటికి సాక్షిగా మాత్రం గ్రహించ గలవాడు ఆ గుణ దోషాలకు అతీతుడై ఉంటాడు. ంద్రా! నన్ను చూడు. నువ్వు నా హస్తాన్ని ఖండించావు. శూలాన్ని ముక్కలు చేశావు. పజయం కలిగించావు. అయినా నిన్ను అంతం చెయ్యాలనియే నేను శక్తి వంచన లేకుండ ంం చేస్తూనే ఉన్నాను. జూదం వంటి యుద్ధాలలో వీరులు ప్రాణాలనే పణంగా ు. శరాలే పాచికలుగా, వాహనాలే ఆడే ఆసన స్థానాలుగా అవుతాయి. ఆదిలో జయ నిర్ణయం జరుగదు. దానిని ఎవరూ నిర్ణయించ జాలరు.' అంటూ సత్యంగా కపటం వృత్రాసురుడు పలికిన పలుకులు విని మహేంద్రుడు వెంటనే వజ్రాయుధాన్ని తీసుకుని నవ్వుతూ పలక సాగాడు :—

'వృత్రాసురా! సిద్ధుడవు కనుకనే నీ కిట్టి ధైర్య స్థైర్యాలూ, భగవద్భావనా సిద్ధించాయి. ప్రాణి సుహృదుడూ, ఆత్మ స్వరూపుడూ అయిన పరమేశ్వరునికి నువ్వు అనన్య భక్తుడవు. వైష్ణవ మాయను జయించ గలిగిన నువ్వు రాక్షస భావ దూరుడవై మహా పురుషుడవు. నీ యీ సద్భావాలు నన్ను ఆశ్చర్య సాగరంలో ముంచి వేస్తున్నాయి. రజో గుణుడవే అయినా నువ్వు విశుద్ధ సత్త్వ మూర్తియైన శ్రీమన్నారాయణ దేవునియందు దత్తచిత్తుడవు కాగలిగావు. పరమ కళ్యాణ ప్రదాత అయిన శ్రీహరి దేవుని చరణారవిందాలను సేవించిన వారికి భోగ భాగ్యాలతో పని ఏముంటుంది? రాజా! మహా వీరులైన ఇంద్ర వృత్రాసురు లిద్దరూ ధర్మ తత్త్వం తెలుసుకోవాలన్న అభిలాషతో పరస్పరం సంభాషించుకుని యుద్ధోన్ముఖు లయ్యారు. హఠాత్తుగా వృత్రాసురుడు లోహ నిర్మిత పరిఘాయుధాన్ని అంబరవీధిలో గిర గిర త్రిప్పుతూ ఇంద్రునిపై ప్రయోగించాడు. అది గమనించి కుపితుడైన ఇంద్రుడు ఆ పరిఘాయుధాన్ని వజ్రాయుధంతో తుత్తునియలు చేసి కరి కరాల వంటి వృత్ర దానవుని బాహువు ఒకదానిని ఖండించి వేశాడు. వజ్ర ప్రహారంతో ఆ భయంకర దానవుని బాహువులు రెండూ నేల మీద పడిపోయాయి. దానితో వాని దేహం నుండి స్రవించిన రుధిరం ఏరులవలె ప్రవహించసాగింది. ఖండింపబడ్డ బాహువులు కల ఆ దానవుడు రెక్కలు నరకబడిన పర్వతంలా గోచరించసాగాడు. అంబరం నుండి నేల కూలిన మహా గిరిలా ఉన్నది వాని విశాల కాయం. పర్వతమే నడుస్తున్నదా? అన్నట్లు పురోగమిస్తూ ఆ దానవుడు పై పెదవిని ఆకాశానికీ క్రింది పెదవిని భూమికీ తగిలేటట్లు ముఖాన్ని తెరచి కాల నాగులా భయంకర వదనంతో, మృత్యు సమమైన కోరలు కలిగి జగత్రయాన్ని కబళించి వేస్తాడా? అన్నట్లు భయావహంగా ఉన్నాడు. వాని పాద ఘట్టనలకు పృథ్వి కంపిస్తున్నది. మహా వేగంతో వాడు గిరులను తల్లక్రిందులు చేస్తూ మహేంద్రుని సమీపించి పెద్ద కొండచిలువ ఏనుగును మ్రింగునట్లు ఐరావత గజ సమేతుడైన మహేంద్రుని మ్రింగి వేశాడు. అది చూసి ప్రజాపతులూ, మహర్షులూ, అమరులూ కంపించి పోయారు. శోకంతో వారు హాహా కారాలు చెయ్య సాగారు. దానవారి అయిన మహేంద్రుడు వృత్రాసురుడు మ్రింగినా మరణించ లేదు. అందుకు కారణం నారాయణ కవచ ప్రభావమే. యోగ బలంతో ఇంద్రుడు వృత్రుని ఉదరంలో సురక్షితంగా ఉన్నాడు. వజ్ర పాణియైన శచీ పతి ధైర్యంగా శ్రీహరిని ధ్యానిస్తూ చేతిలో ఉన్న వృత్రుని కంఠాన్ని చీల్చాడు. దారి ఏర్పడడంతో వాహన

ంగా బయటపడి ఆ రక్కసుని అంతం చేశాడు. ఉత్తరాయణ, దక్షిణాయన గతిలో ది గ్రహాలకు వచ్చే కాలంలో వృత్తుని శిరస్సు ఖండింప బడింది. అనగా వాని శిరస్సు ంబడడానికి అంతకాలం పట్టినదని అర్ధము. వాడు అంతం కావడంతో దేవ దుందుభులు యి. గంధర్వులు గానం చెయ్యగా అప్సరసలు ఆడారు. పూల వాన కురిసింది. సర్వులూ ంచారు. రాజా! ఆ భక్త దైత్యుని శరీరం నుండి దివ్యమంగళ కాంతులు బహిర్గతమై త్మలో లీనమై పోయాయి.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–6 — అధ్యాయం-13

### బ్రహ్మ హత్య మహేంద్రుని ఆవహించుట.

శుక మునీంద్రుడు పలుకుతూన్నాడు – పరీక్షిన్నరపాలా! దేవరాజు తక్కిన తక్కిన ్యవాసులూ, లోక పాలురూ కూడ వృత్రాసుర సంహారానికి పరమానందం చెందారు. సురుని వల్ల తమకు కలిగిన విపత్తులు దూరమయ్యాయి – అని సంతోషించారు. యుద్ధం కాగానే దేవ, పితర, ఋషి, భూత, దైత్య, గంధర్వాదు లందరి కందరూ మహేంద్రు చెప్పకుండానే స్వస్థానాలకు వెళ్ళిపోయారు. తరువాత శంకర, బ్రహ్మేంద్రాదులూ మరలి ారు.' అనగా ఆలకించి పరీక్షిత్తు అడుగుతూన్నాడు :– మహాత్మా! సర్వులూ వృత్రాసుర రానికి పరమానందం చెందగా దేవరాజు ఒక్కడూ ఎందుల కానందించ లేదు? అతని హేతు వేమిటి? వివరించండి.'

శుకమహర్షి సమాధానం యిస్తూన్నాడు – 'రాజా! వృత్రాసుర పరాక్రమానికి భీతిల్లిన ్షలూ, అమరులూ కూడ ఆ రాక్షసుణ్ణి అంతం చేయవలసినదిగా మహేంద్రుణ్ణి ప్రార్థిం

నీ బ్రహ్మ హత్యకు భీతిల్లి యింద్రుడు వారితో—'దేవతలారా! మహర్షులారా! విశ్వ
ంహారం ద్వారా నాకు సంభవించిన బ్రహ్మ హత్యా పాతకాన్ని నాలుగు భాగాలు చేసి
రీ, నదీ వృక్షాలకు పంచిపెట్టాను. తత్సమయంలో వారు నలుగురూ నన్ను కరుణించి
ాన్ని గ్రహించారు. బ్రహ్మ తేజస్సుతో, అగ్ని గుండం నుండి ప్రాదుర్భవించిన
రుణ్ణి సంహరించడం వల్ల కలిగే పాపాన్ని నేను ఎలా పోగొట్టుకుంటాను?' అని
చగా ఋషులు బదులు పలుకుతూన్నారు. — 'దేవేంద్రా! నువ్వు ఎంతమాత్రం భయ
నీ ద్వారా అశ్వమేధ యాగం చేయిస్తాము. తద్ద్వారా నువ్వు సమస్త పాపదూరుడ వవు
ర్వాంతర్యామీ, సర్వ శక్తి మంతుడూ, పరమాత్మ అయిన శ్రీహరిని ఆరాధించునట్టి
ర్వ విశ్వ సంహార రూపమైన పాపం నుండియే విముక్తుడవు కాగలుగగా ఏకమాత్ర
ర సంహారం వల్ల ప్రాప్తించే పాప మొక లెక్కయా? దీనిని గురించి యోచించకు
రాయణ భగవానుని నామస్మరణ మాత్రంచే మాతృ, పితృ, బ్రహ్మ, గురు, గోహత్యా
భస్మమై పోతాయి. అంతే కాదు శునక మాంస భక్షకుడు కూడ పాప దూరు డవుతాడు.
్మానుసారం మేము నీ ద్వారా అశ్వమేధయాగం చేయిస్తాము. తద్ద్వారా జరుగునట్టి
దేవతారాధన వల్ల — పిపీలికాది బ్రహ్మ పర్యంతంగా గల సర్వ జీవరాశినీ సంహరించిన
ాన్నే రూపుమాపుకో వచ్చును. అట్టి దశలో లోక కంటకుడైన వృత్రాసుర సంహార
పాప మొక్క లెక్కయా? సందేహించక వృత్రాసురుణ్ణి సంహరించు.'

ఉపర్యుక్త రీతిని మహర్షులు పలుకగా వారి ప్రేరణానుసారం మహేంద్రుడు వృత్ర
అంతం చేశాడు. తత్కారణంగా బ్రహ్మ హత్య ఇంద్రుణ్ణి సమీపించింది. దానితో
భరింపరాని తాపం ఆరంభ మయింది. సజ్జనునకు కళంకం ఏర్పడితే వాని ధైర్య స్థైర్యాలు
శనం కాగా సుఖం పొంద లేడు. చండాలినీ రూపాన్ని ధరించి బ్రహ్మ హత్య రాగా
ు పరుగులు తీయ సాగాడు. వృద్ధాప్యం వలె దాని శరీరం కంపించ సాగింది, క్షయ
సిత వలె ఆమె కనిపించ సాగింది. ఆమె కట్టిన బట్ట అంతా రక్తసిక్తమై ఉంది. పాపా
దేవత అయిన ఆమె కేశాలు తెల్లగా విరబోసుకు ఉన్నాయి. 'ఇంద్రా! ఆగు' అంటూ
అరుస్తూ ఆమె వస్తూన్నది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలలో చేప కంపు వంటి దుర్వాసన

ఆ దారి అంతా దుర్గంధ దూషితమయి పోతూన్నది. దానికి భయపడి ఇంద్రుడు దశదిశలా
తిరిగి చిట్ట చివరకు — ఈశాన్య దిశగా ఉన్న మానస సరోవరం చేరి కమల నాళ తంతువు
సహస్ర వత్సరాలు రహస్యమయ జీవితం గడుపుతూ — బ్రహ్మ హత్యా పాతకాన్నుండి
ముక్తి పొందడానికి మార్గాన్వేషణ చేయ సాగాడు. అగ్ని ముఖం ద్వారా తనకు ఆహారాదులు
ంచే సావకాశం లేదు. అగ్ని మానస సరోవరంలో ప్రవేశించ జాలదు కదా! అందు వల్ల
తకాలమూ అతనికి ఆహారం లభించ లేదు. ఆ సహస్ర వత్సర కాల పర్యంతమూ విద్య,
యోగ బల సమన్వితుడైన నహుషుడే స్వర్గ రాజ్యాధి పతిగా తేజరిల్లినాడు. అధికార,
ఐశ్వర్య మదాంధుడై ఆతడు ఇంద్రుని అర్ధాంగి అయిన శచీదేవిని కామించి — దురాచారానికి
పడి బ్రహ్మరథమన్న పేరుతో మహర్షులనే అవమానించి వారిచే శపించబడి అజగర
పాన్ని దాల్చాడు. అప్పటికి హరి ధ్యానం కారణంగా మహేంద్రుని పాప సర్వస్వం నాశన
పోయింది. అంత బ్రాహ్మణోత్తముల ఆహ్వానంపై మహేంద్రుడు పునః స్వర్గానికి విజయం
డు. శ్రీహరి వక్షస్థలాలయయైన మహాలక్ష్మీ దేవి అంత మహేంద్రుణ్ణి కరుణించింది. అంత
ద భగవానుడు ఇంద్రుని పాపాన్ని తేజో హీనం చేశాడు. దానితో బ్రహ్మ హత్య దూరమై
యింది. తత్సమయంలో సుముహూర్తంలో మహర్షి బృందం నాకలోకం చేరి మహేంద్రునిచే
యుక్తంగా అశ్వమేధ యాగం చేయించాడు. ఆ యాగం ద్వారా శచీపతి సర్వ దేవ మయు
శ్రీమన్నారాణ భగవానుని ఆరాధించాడు. ఉదయాద్రిపై ప్రభాకరుడు ప్రవేశించడంలో
ట్లు మటుమాయమైనట్లు మాధవ దేవుని ఆరాధన మాత్రంచే మహేంద్రుని బ్రహ్మ హత్యా
తకం సమూలంగా నిర్మూలమై పోయింది. మరీచ్యాది మహర్షుల సమక్షంలో వారి ఆదేశాను
ం జరిగిన అశ్వమేధ యాగ ఫలంగా మహేంద్రుడు సర్వ పాప దూరుడై ఆదిలో వలె
జన పూజనీయు డయ్యాడు.

పరీక్షిన్నరేంద్రా! ఈ శ్రేష్ఠోపాఖ్యానంలో ఇంద్ర విజయ గాథ, అతడు పాప దూరుడు
డం, వృత్రాసుర చరిత్ర అభివర్ణితం కావడం వల్ల యిది తీర్థాదులను సయితం పవిత్రం చేసే
దనుగ్రహాది ప్రభావ గుణ సంపన్నం కావడం వల్ల సమస్త పాపాలనూ నాశనం చేసి
శాంతులను ప్రసాదించునట్టి భక్తిని ప్రసాదిస్తుంది. ధీమంతులు యీ గాథను పఠించి ఆల
మననం చేసుకుని తరించాలి. పర్వ దినాలలో దీని పఠన శ్రవణ, మననాదులు సాగించునట్టి

ంప దాయులై సత్కీర్తితో ధన ధాన్యాదులను పొంది ఆయురారోగ్యాలతో యిహపర
లో సమస్త సుఖాలూ పొందుతారు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం-14

## వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతము.

పరీక్షిత్తు ప్రశ్నిస్తున్నాడు — మహాత్మా! సహజాత రజస్తమోగుణాలు కల వృత్రా
అమరులకు క్లేశాలు కలిగించి లోకాలను వేధించినవాడు. అట్టి క్రూర కర్మునికి శ్రీహరి
మలాలయందు అనురక్తి భక్తీ ఎలా కలిగాయి? అత్యంత దుర్లభమైనది కదా భగవద్భక్తి.
త్త్వమయులయిన అమరులూ, మహర్షులూ కూడ పరమ ప్రేమమయమైన భగవద్భ
ందజాలక పోతూండడం మనం గమనిస్తూనే ఉన్నాము. ఈ జగజ్జీవజాల సర్వస్వం పృథ్వీ
సమంగా అగణితంగా ఉంది. అందులో మానవుల సంఖ్య అత్యల్పమే.
మార్గాన్ని ఉత్తములే అన్వేషించ గలుగుతారు. సంసార బంధాల నుండి విముక్తిని కోరు
సంఖ్య మరీ తక్కువగా ఉంది. మోక్షేచ్ఛ గలవారిలో వేయికి ఒక్కడు మాత్రమే
పొందగలుగు తూన్నాడు. మునీశ్వరా! అసంఖ్యాకులైన ముక్త పురుషులలో భగవదా
చిత్తులైన వారు లభించడం మహా కష్టమే. అట్టి దశలో మహా పాపీ, లోక కంటకుడూ
వృత్రాసురుడు — భయంకర యుద్ధ మధ్యలో శ్రీహరి దేవునియందు భక్తి పరాయ
ఉండ గలగడానికి హేతు వేమిటి? మహాత్మా! ఈ విషయమై నాకు కలిగిన సందేహాన్ని
చెయ్యండి.' అని అర్థించగా శుకమహర్షి పలుకు తూన్నాడు :—

'రాజా! వృత్రాసుర సంబంధమైన గాధను నేను నా తండ్రి వల్లా, నారద, దేవల మహ
ద్వారా కూడ ఆలకించాను. పురాతన కాలంలో చిత్ర కేతుడనే మహారాజు శూరసేన

పాలిస్తూ ఉండేవాడు. అతని రాజ్యంలో పృథ్వీదేవి ప్రజలకు స్వయంగా పాసీయాలు
ఇస్తూ ఉండేది. ఆయనకు కోటి మంది రాణులు. ఆ మహారాజుకు సంతానోత్పత్తి చేయ
శక్తి కలిగినా అందులో ఒక్క దానికి కూడ సంతానం కలగ లేదు. ఆ రాజుకు లోటు
దేదీ లేదు. అన్నీ ఉన్నా సంతానం లేని లోటు మాత్రం అతణ్ణి పీడిస్తూనే ఉంది. భూత
ఏకచ్ఛత్రాధిపతిగా పాలించే ఆ సమ్రాట్టు దగ్గరకు ఓనాడు సర్వశక్తి సంపన్నుడూ,
మానస పుత్రుడూ అయిన అంగిరస మహర్షి విజయం చేశాడు. చిత్రకేతు మహారాజు మహ
ఎదురేగి స్వాగత సత్కారాలు చేసి అర్ఘ్య పాద్యాదులచే అర్చించిన తరువాత—ఆ తపోధనుడు
నుడు కాగా ఆ రాజు కూడ ఆయనకు దగ్గరలో శాంతంగా నేలమీద కూర్చున్నాడు. ఆ
కేతుని వినయ భక్తి భావాదులకు ప్రసన్నుడైన అంగిరసుడు — 'రాజా! గురు, మంత్రి,
దుర్గ, కోశాగార, సైన్య, మిత్రాదులతో క్షేమంగా సుఖంగా ఉంటున్నావా?
గురు, మంత్రి, రాష్ట్ర, సప్త ప్రకృతులూ మహారాజు మీదనే తమ సంరక్షణ భారాన్ని
నాడే సుఖ, సిద్ధి లాభాలను పొందగలుగుతారు. రాజా! నీ అంతఃపురాంగనలూ మంత్రి
ంత, పురోహిత, దండనాయక, దౌవారిక, పురజన, పరిజన అమాత్య వర్గ, పుత్ర, మండ
పతులూ — మొదలైన వారందరూ నీకు స్వాధీనులై ఉంటూన్నారా? స్వాధీన మనస్కునికి
వశమై ఉంటా యన్నది పరమ సత్య విషయమే. అంతేగాక లోకపాల సమేతంగా
టూ అట్టి ప్రభువుకు పురస్కారాలు అందజేసి అతణ్ణి ప్రసన్నుని చేసుకుంటాను. రాజా!
చూస్తుంటే ఎందుకో వేదన పడుతూన్నట్లుంది. నీ ముఖావలోకన మాత్రాన నీ అంతరంగ
ం ప్రస్ఫుట మవుతూన్నది. నీ అసంతోషానికి హేతువు నీవేనా? లేక యితరుల వల్ల
ంత ఏర్పడినదా?' అని ప్రశ్నించాడు.

సర్వజ్ఞుడైన అంగిరస మహర్షి అలా ప్రశ్నించగా చిత్రకేతు రాజు ఆయనకు బదులు
తూన్నాడు :— మహాత్మా! ధ్యాన ధారణ సమాధుల ద్వారా, తపో జ్ఞానాదుల ద్వారా
యోగుల పాపం దగ్ధ మవుతుంది. అట్టి త్వాదృశ యోగీశ్వరులకు మా బోట్ల
భ్యంతర విషయాలు తెలిసియే ఉంటాయి. సర్వజ్ఞులై కూడ మీరు నా విచార కారణాన్ని
స్తున్నారు. అయినా మీ సేవకుడను కనుక నా విచార కారణాన్ని విన్నవించు కుంటు
. ఆలకించండి. నాకు లేని సంపద యీ కాలంలో యీ భూతలంపై మరెవరికీ లేదు.

ాకు సంతానం లేక పోవడం బాధాకరంగానే ఉంది. సర్వైశ్వర్యాలూ ఉన్నా ఆకలి దప్పి ఉన్నవారికి అన్న పానీయాలు లేకుంటే బాధలు తీరనట్లు సంతాన రహితుడనైన నాకు ా చింత కలుగుతూనే ఉంది. నాతో బాటు నా పితృ దేవతలు కూడ వేదన చెందుతున్నారు. కరుణించి నాకు సంతాన ప్రాప్తి కారకమైన మార్గాన్ని చూపించండి. పుత్ర సంతానాన్ని ించి నన్ను పున్నామ నరక దూరుని చేయండి." అంటూ ప్రార్థించాడు.

నిగ్రహానుగ్రహ సమర్థుడైన అంగిరస మహర్షి చిత్ర కేతు ప్రార్థనను ఆలకించి, అంగి –త్వష్ట ప్రజాపతికి యోగ్యమైన చరువును తయారు చేసి అగ్నిలో హోమం చేసి యాగ న హవిస్సును సద్గుణ సంపన్న అయిన కృతద్యుతి మహారాణికి యిచ్చి చిత్రకేతువుతో– నీ యీ మహారాణి వల్ల నీకు ఏక మాత్ర పుత్రుడు కలుగుతాడు. అతని వల్ల నీకు – విచారాలు రెండూ ప్రాప్తిస్తాయి." అని పలికి స్వేచ్ఛగా వెళ్ళిపోయాడు. అనంతరం– హారాణి గర్భం ధరించింది. చిత్రకేతుని తేజస్సుతో ఆమె గర్భం దిన దిన ప్రవర్ధమానం ంది. సకాలంలో ఆమె గర్భం నుండి సుకుమార సుందర బాలుడు ఉదయించాడు. ఆ శుభ విన్న దేశ ప్రజ అందరూ మహానంద పరవశు లయ్యారు. ఇక రాజ దంపతుల, రాజ పరి యొక్క ఆనందానికి హద్దులే లేవు. అతడు స్నాన మాచరించి, వస్త్రాలంకారాలు ధరించి శ్రేష్ఠులు స్వస్తి వచనాలు పలుకుతూండగా, మంగళాశీస్సులు అందజేస్తూండగా పుత్రునికి ్మాదులు పూర్తిచేసి కాంచన, రజత, వస్త్రాలంకారాలే గాక, గ్రామ గవాశ్వ గజాదులను భూసురోత్తములకు పురస్కారాలుగా సమర్పించాడు. తన పుత్రుని యశోధన వృద్ధ్యర్థం ారాజు ఎవరేమడిగితే అదే ఆనందంగా సమర్పిస్తూన్నాడు.

ఐశ్వర్యకాంక్షి యైనవాడు విశేష ధనం లభించగా దానియందే దృష్టిని కేంద్రీకరించినట్లు తు మహారాజు లేక లేక కలిగిన బిడ్డయందే విశేష ప్రేమానురాగాలు కలిగి మెలగు డు. అతని రాణియైన కృతద్యుతి కూడ పుత్ర స్నేహంలో పతిని అధిగమించింది. కానీ గల రాణులందరూ తమకు సంతానం కలగకపోవడం, సవతికి మాత్రమే పుత్ర ం కలగడంతో అసూయా గ్రస్థలై అనుక్షణం ద్వేషంతో మథనపడ సాగారు. దానికి ల అనురాగం కూడ వారి పట్ల సన్నగిల్లింది. భర్త ఆదరణలేని సతుల స్థితి ఎవరికి

స్తుంది ? నానాటికీ సంతానవతియైన కృతద్యుతియందు మహారాజుకు ప్రేమాదరాలు వర్ధిల్లి యి. అశాంత చిత్తులైన ఆ నారీ బృందం పరస్పరం భాషించుకో సాగింది. — 'సోదరీ లారా ! గొడ్రాలికంటె దురదృష్టవంతురాలు ఉండదు. సంతానవంతురాలు తన సవతులను గా భావిస్తుంది, తిరస్కరిస్తుంది. సంతానవతినే పతి అయినవాడు ఆదరిస్తాడు గనీ మిగిలిన లను చూడడు. సంతాన శూన్యురాలి జీవితం దుర్భరమైనదే. సంతానం లేని మన జీవితాలు తి హీనమై పోయాయి. దాసీలకు దాసీలమైన వారిలా ఉంది మన స్థితి.' అనుకుంటూ వారు చి పోతున్నారు. తమ బాధ దూరం కావాలంటే కృతద్యుతి పుత్రుణ్ణి అంతం చెయ్యాలని యించుకొని అందరూ కలసి ఓ రోజున ఆ రాజ పుత్రునికి విషం పెట్టారు. అది మహా తెలియదు. సవతులు యింత దుర్మార్గానికి పాలు పడతారని ఆమె ఎన్నడూ ఊహించలేదు. ఎప్పటికీ బిడ్డ లేకపోవడంతో దాసీని పిలచి బిడ్డను తీసుకు రమ్మని ఆదేశించింది. మహారాణి నుసారం వెళ్ళి చైతన్య రహితంగా పడి ఉన్న బిడ్డను తిలకించి 'హా హతోస్మి' అంటూ ప్పోయింది.

కొన్ని క్షణాలు గడిచాయి. ఆమె స్మృతి కలుగగానే లేచి గుండెలు బాదుకుంటూ ఏడ్వ ది. దాని ఏడుపులూ కేకలూ విన్న మహారాణి లోపలకు వెళ్ళి మృతుడై పడి ఉన్న ఏక క పుత్రుణ్ణి చూసి సహించజాలని దుఃఖంతో స్మృతి తప్పి పడిపోయింది. ఆమె కేశాలు స్తమై పోయాయి. ఆమె కట్టుకున్న బట్టలు కూడ సరిగా లేవు. ఆమె వర్ణనాతీత రోదన కు అంతఃపుర వాసు లందరూ అక్కడకు వచ్చి శోక సాగరంలో మునిగిపోయారు. పెట్టిన రాణులు కూడ లేని దుఃఖాన్ని తెచ్చుకుని కపటంగా విలపించ సాగారు. పుత్ర ంతో చిత్ర కేతు రాజుకు యావద్విశ్వమూ అంధకార మయంగా గోచరమయింది. ఆ బ్రాహ్మణ, అమాత్య వర్గాన్ని వెంట తీసుకుని మహా దుఃఖంతో పడుతూ, లేస్తూ డై పడి ఉన్న పుత్ర కళేబరం దగ్గరకు వచ్చాడు. సహించరాని వేదనతో, విడిపోయిన శంతో జారిపోయే బట్టలతో మైమరచిన దుఃఖ భారంతో, దీర్ఘంగా నిట్టూరుస్తూ, కన్నీరు రై ప్రవహించ గద్గద గాత్రంతో నోట మాట రాక పడిపోయాడు. పుత్రుని మరణానికీ, కీ — ఆ మహారాణి అంతం లేకుండ దుఃఖించ సాగింది. వారి దయనీయ దశను అక్కడి

_రూ విచారించ సాగారు. ఆ మహారాణి కన్నీటి ధారలకు ఆమె కాటుకయే కాక, వక్షః_
_ందలి చందన, కుంకుమ లేపనాలను కడిగివేస్తూన్నాయి. ఆమె అలంకరించుకున్న పుష్పా_
_లిపోయాయి. తన బిడ్డ కోసం ఆమె కురరి పక్షిలా విలపించ సాగింది. శోక సంతప్త_
_మయై — 'విధాతా! నువ్వు యదార్థంగా మూర్ఖుడవే. సృష్టికి ప్రతికూలంగా చరించే నీ_
_న్ని ఆశ్చర్యాన్ని కలగజేసేవిగానే ఉంటాయి. వృద్ధులను జీవింప జేసి పసివాళ్ళను_
_చేస్తూంటావు. ఇట్టి విపరీత భావాలే నీలో ఉంటే జీవులకు నువ్వు పరమ శత్రువుగా_
_పబడతావు. జనన మరణాలకు క్రమమే లేకపోతే యీ విశ్వ ప్రాణులు ప్రారబ్ధ_
_సారం జన్మించి అంత మవుతూ ఉంటాయి. అట్టి దశలో నీ అవసరం ఏముంది?_
_వర్ధిలజేసి, బంధు బాంధవ్యుల మధ్య స్నేహ బంధాన్ని వర్ధిల్ల జేయడానికే కానీ నువ్వు_
_దుకూ కాదు కదా! ఇట్టి పసికందులను అంతంచేసి నువ్వు యేమీ ఎరుగని వానిలా_
_స్తూంటావు.' అని మృత శిశు కళేబరాన్ని తిలకిస్తూ ఆమె యింకా యిలా పలుక_
_:—_

_నాయనా! నువ్వు లేని నా బతుకు వ్యర్థమైనదే. నన్ను విడనాడి దీనను చేసినావు. నీ_
_విడిచి నువ్వు పోదగునా? నీ సహకారంతో పున్నామ నరకం నుండి తరిద్దామనుకున్నాము._
_యముని వెంట నువ్వు వెళ్ళిపోకు బాబూ! లే బాబూ! లే. నీ తోటివారితో ఆటలాడుకో._
_న్ను పిలువ వస్తారు. నువ్వు నిదురపోయి చాల సేపయింది, నీకు బాగా ఆకలి వేస్తోంది._
_్వరగా అన్నం తిను, లేదా పాలు త్రాగు, మా దుఃఖాన్ని దూరం చెయ్యి, పుత్రా!_
_నీ వదనంలో చిరునవ్వు చిందులాడడం లేదు, నీ వినోద క్రీడలను చూడని నేను_
_ృణాలనే, నీ చిలుక పలుకులను ఆలకించే భాగ్యం నాకు లేదా? తిరిగి రావడానికి వీలుకాని_
_కే యమరాజు నిన్ను తీసుకు పోయాడు.' అంటూ ఆమె బోరున ఏడవ సాగింది._

_పరీక్షిన్నరేంద్రా! పుత్ర వియోగ దుఃఖంతో మథనపడే సతిని చూసి చిత్రకేతువు కూడ_
_ా శోకించ సాగాడు. కంటికీ, మంటికీ ఏకధారగా వారు ఏడ్వడం చూసిన వారందరూ కూడ_
_ారు. పట్టణ మంతా విచార సముద్రంలో మునిగిపోయింది. మహారాజు ఏడ్చి యేడ్చి_
_్యాన్ని కోలుపోయాడు. ఆ రాజ దంపతులు శోకాన్ని ఎవరూ శాంతింప జెయ్యలేక_

యారు. తత్సమయంలో అంగిరస, నారద మహర్షులు యిద్దరూ అక్కడకు విజయం
రారు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–6 — అధ్యాయం-15

### అంగిరస, నారద ఋషులు – చిత్రకేతువుకు జ్ఞానోపదేశము చేయుట.

పరీక్షిన్నరేంద్రుని తిలకించి శుకమహర్షి పలుకుతూన్నాడు :— రాజా! పుత్ర కళే ంపై చిత్రకేతు రాజు పడి ఉన్న సమయానికి అంగిరస నారదులు యిద్దరూ అక్కడికి ఆ రాజును ఓదారుస్తూ జ్ఞానోపదేశం చెయ్య సాగారు — 'ప్రభూ! మరణించిన వానికోసం కు విచారిస్తావు? వీడు పూర్వ జన్మలోనూ, రాబోయే జన్మలోనూ మీకు ఏమవుతాడు? కి మీరేమవుతారు? నీకూ సంబంధం ఏమిటి? ప్రవాహ వేగం వల్ల యిసుక రేణువులు కలిసి కొంత దూరం ప్రయాణించి విడిపోయే టట్లు యీ కాల మహా ప్రవాహంలో సంయోగ వియోగాలు పొందుతూ ఉంటాయి. కొన్ని బీజాలవల్ల మరికొన్ని బీజాలు ంపబడినట్లే దైవ ప్రేరణవల్ల కొన్ని జీవుల నుండి మరికొన్ని జీవులు ప్రభవించి అంత తూ ఉంటాయి. నేనూ, నువ్వూ, నావారూ, నీవారూ అనే సంబంధం కల యీ జగత్తు — నీ పూర్వంలో గానీ, అనంతర జన్మలో కానీ ఉండదు. అందువల్ల గతంలో లేనిదీ, ఉండనిదీ ఎన్నడూ ఉండనట్లే గణనకు వస్తుంది. ఏకమాత్ర మహా మాయా ప్రభావం లేనిది ఉన్నట్లుగా గోచర మవుతుంది, ఉండేది సదా సర్వదా ఉంటుంది లేనిది ఎన్నడూ . కానీ సత్పదార్థమైన బ్రహ్మ పదార్థం మాత్రం త్రికాలా బాధ్య మానంగా ఉంటుంది. మోహితు డైనవాడు ఉన్నట్టి బ్రహ్మ వస్తువును లేనిదానిగానూ, లేని విశ్వాన్ని —

; ప్రపంచాన్ని ఉన్నట్లు గానూ తిలకిస్తూ ఉంటాడు. సర్వ ప్రాణికోటికీ అధినాథుడైన
మరణా లన్నవి లేవు. ఆయనలో యిచ్ఛాదులు సయితం లేవు. పరతంత్ర ప్రాణులను
స్వతంత్రంగా సృజిస్తూ వాటి ద్వారా అన్యాన్య ప్రాణికోటి సృష్టిస్థితి సంహారాలను సాగి
గాడు. ఆడుకున్నంతసేపు ఆడుకుని బాల బాలికలు తాము చేసిన బొమ్మరిళ్ళను తామే కూల
కూడ ఆనందిస్తూ ఉంటారు. అదే రీతిగా పరమాత్మ విశ్వ సృష్టిస్థితి సంహారాలను కొన
స్తా ఉంటాడు.

మహారాజా! తండ్రి ద్వారా మాతృ గర్భం నుండి ఓ బీజం నుండి మరో బీజం పుట్టి
పుత్రుడు ఉదయిస్తాడు. మాతా పితరులూ, పుత్రుడూ కూడ జీవ రూపాన శరీరులు గానూ
రూపాన బంధు మిత్ర పరివార జనులు గానూ గోచర మవుతారు. పృథ్విలో ఘటత్వాది
ఘటాదుల వస్తు విభజన కేవలం కల్ప, నామ మాత్ర మగునట్లే దేహ గేహాల విభాగం
అనాదీ, అవిద్యా కల్పితాలే అని గ్రహించు. అనిత్యమైన యీ శరీరం అసత్యమైనదే.
ం అసత్యం కాగా — తద్భిన్న రూపాలలో ఉండే తల్లీ తండ్రీ బంధు బాంధవ దారాపుత్ర
పుర జనాదులపై కల అభిమానాలు మాత్రం ఎందుకు అసత్యాలు కావు? త్రికాలా బాధ్య
మైన పరమాత్మ భావం మాత్రమే సత్యమై శాశ్వత మైనది. ఏకమాత్ర అద్వితీయ పర
మాత్రమే ఉండగా — అంటే అన్య వస్తువే లేనినాడు శోకం దేనికి? అది ఉచితం
అంటూ ఆ తపోధనులైన అంగిరస, నారద మహర్షులు శోకోప శమన వచనాలు పలికి
న్ని కలిగించగా చిత్ర కేతు రాజు ముఖం తుడుచుకుని వారితో — 'మహాత్ములారా!
రా, జ్ఞానులూ అయిన మీరు అవధూత వేషాలలో విజయం చేశారు. దయదలచి మీ
వివరించండి. అనేకమంది భగవద్భక్తులు నావంటి సాంసారిక విషయ వాసనా లోలురకు
దేశం చేసేటందులకు ఉన్మత్తుల వేషాలు ధరించి పృథ్విపై స్వేచ్ఛగా విహరిస్తూ ఉంటారు.
మార, నారద, ఋభు, అంగిర, దేవల, అసిత, అపాంతర తమ, వ్యాస, మార్కండేయ,
, వశిష్ఠ, పరశురామ, కపిల, శ్రీశుక, చ్యవన, దత్తాత్రేయ. ఆసురి, పతంజలి, వేదశిర,
ముని, పంచశిర, హిరణ్యనాభ, కౌసల్య, శ్రుతదేవ, ఋత తధ్వజ్వాది మహర్షులే గాక, సిద్ధ
ంది ఈ విశ్వంలో సంచరిస్తూ మానవ మాత్రులకు జ్ఞానోపదేశం చేస్తూంటారు. మహా
రా! విషయ వాసనలలో మునిగి గ్రామ్య పశువులా అజ్ఞానాంధకారంలో మునిగి
ను. అట్టి నన్ను మీరు మీ జ్ఞానజ్యోతితో వెలుగులోకి తీసుకు రండి. అంటూ అర్థించాడు

జిజ్ఞాసతో చిత్రకేతువు అలా ప్రార్థించగా అంగిరసుడు బదులు పలుకుతూన్నాడు –
నార్థం పరితపించే నీకు సంతానాన్ని ప్రసాదించాను. అందరూ నన్ను అంగిరసుడని పిలు
, నీ సమక్షంలో ఉన్న యీతడు నారద దేవర్షి. పుత్ర శోకంతో పరితపించే నీకు జ్ఞానో
ం ద్వారా అజ్ఞానాంధకారాన్ని దూరం చెయ్యాలని మేమిలా వచ్చాము. దేవ బ్రాహ్మణ
ఖ ఎన్నడూ విచారించరాదు, పుత్ర వియోగ దుఃఖం యిప్పుడు నిన్ను తీవ్రంగా వేధిస్తూ
. దేహ, గేహ, ధన, దార, సంపదాదులూ, శబ్ద, స్పర్శ, రూప రసాది విషయాలూ
రాజ్య వైభవాదులూ, సైన్య, కోశాగార, సేవక, అమాత్య బంధు బాంధవాదులూ సర్వమూ
్యలే, ఐహిక పార లౌకిక సంబంధాలైన భోగ సాధనలన్నీ అనిత్యాలే కావడం వల్ల –
మోహ, భయ దుఃఖ హేతువులని మనీషులు నిరూపించారు. మనో కల్పితాలైన యివన్నీ
్వ నగర, స్వప్న వస్తు తుల్యాలే. ఇంద్రజాల సమంగా అసత్యాలే కానీ నిత్య సత్యాలు
తం కాదు. కర్మ వాసనల ద్వారా ప్రేరేపింపబడునట్టి విషయ సుఖాలను గూర్చి చర్చిస్తూ
ంచునట్టి మానవుని మనస్సు అనేక కర్మలను సృష్టిస్తూ ఉంటుంది. మహా భూత, జ్ఞానేం
, కర్మేంద్రియ పంచకంతో ఏర్పడిన యీ దేహం జీవునికి వివిధ క్లేశాలను కలిగించి
పాన్ని రేకెత్తిస్తుంది. అందువల్ల నువ్వు మనస్సును విషయ వాసనల నుండి మరల్చి –
చిత్తుడవై యదార్థమైన ఆత్మ తత్త్వాన్ని గురించి విమర్శించుకో. ద్వైత భావంలో
క్య బుద్ధిని పరిత్యజించి పరమ శాంతి ప్రదమైన పరమాత్మ తత్త్వంలో సంలగ్నం చేసి
సుఖాన్ని పొందు.' అంటూ ఆ మహాత్ముడు మౌనం దాల్చాడు.

ఆ తరువాత నారద దేవర్షి అందుకుని – 'రాజా! నీకు మంత్రోపనిషత్తును ఉపదేశిస్తూ
. దానిని గ్రహించిన వారికి సప్తాహ దీక్షా కాలంలో సంకర్షణ భగవద్దర్శన మవుతుంది.
శంకర భగవానుడు యీ సంకర్షణ మూర్తినే ఆరాధించి ఆశ్రయించాడు. అతని ద్వైత
దూరం కాగా ఆతడు అనంత మహిమాన్వితు డయ్యాడు. మహా దేవునితో సమాన
ు గలవా రెవరూ లేరు. నువ్వు కూడ ఆ సంకర్షణ దేవుని అనంతానుగ్రహాన్ని సంపా
పరమ పదాన్ని అందుకో.' అన్నాడు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-16

### చిత్రకేతువునకు వైరాగ్యం సిద్ధించ, సంకర్షణుడు సాక్షాత్కరించుట.

చిత్రకేతూపాఖ్యానాన్ని కొనసాగిస్తూన్నా శుకమహర్షి పలుకుతూన్నాడు – 'రాజా!
సమేతంగా చిత్రకేతు మహారాజు తిలకిస్తూండగానే – ఆ రాకుమారుని జీవాత్మతో –
పరివారం యొక్క దుఃఖాన్ని ఉపశమింపజేయగోరి – 'ఓ జీవాత్మా! నీకు మంగళ
చేకూను గాక! నీకై నీ మాతా పితరులు, స్వజన మిత్ర బాంధవాదులూ శోకిస్తూ
వారి శోకాన్ని దూరంచేసి పునః యీ శరీరంలో ప్రవేశించు, మిగిలిన ఆయుర్దాయంతో
భోగ భాగ్యాలు అనుభవిస్తూ రాజ సింహాసనాన్ని అధిష్ఠించు. అనగా ఆలకించి ఆ జీవాత్మ
సమాధానం చెప్ప సాగింది :– 'మునీంద్రా! స్వకర్మానుసారం నేను సుర, నర, పశు,
అనేక జన్మలు ఎత్తుతూ సంచరించగా – వీరు నాకు ఆయా జన్మలలో మాతా పితరు
? అనేక జన్మలలో పరస్పరం – సోదర, బంధు బాంధవ మాతా పితృ, శత్రు, మిత్ర,
, ఉదాసీనులై, ద్వేషులై సంచరిస్తూంటారు. కాంచనాది వస్తు సముదాయం ఓ వ్యాపారి
మరొక వ్యాపారి దగ్గరకు మారుతూన్నట్లే జీవులు సయితం విభిన్న యోనులలో జన్మి
యి. యోచించగా మానవులకంటే చిరకాలం ఉండే కాంచనాది వస్తువులు సయితం
మానవులతో అధిక కాలం ఉండవు, అనుక్షణం అవి మారుతూనే ఉన్నాయి. తన దగ్గర
క కాలం వస్తువులయందు మానవులు మమకారం కలిగి ఉంటారు. నిత్యుడూ, నిరహం
అయిన జీవుడు మాతృ గర్భాన దేహాన్ని ధరించు నట్టి క్షణం నుండీ దేహమే తానను
వ్యవహరిస్తాడు. నిత్యుడూ, నాశన రహితుడూ జననాది శూన్యుడూ, సర్వాశ్రయుడూ,
కాశ స్వరూపుడూ కావడం వల్ల జీవునిలో జనన మరణాలు లేవు. పైగా తానే ఈశ్వరు
వల్ల – నిజ మాయా గుణాలతో తనకు తానే చరాచర రూప విశ్వంలో ప్రకటిస్తూం
జననాది రహితుడైన జీవునికి ప్రియా ప్రియలూ, స్వపర భేద భావమూ ఉండదు. ఏమన

మాత్ర భూతుడుగా, స్వతంత్రుడుగా తానే ఉన్నాడు. కనుకనే దేహాది గుణ దోషాలనూ, కర్మ ఫలాన్నీ, గ్రహించడు. సర్వదా వుదాసీన భావంతోనే ఉంటాడు.' అని పలికి జీవాత్మ ్ఛగా వెళ్ళిపోయాడు.

ఆ జీవుని పలుకు లాలకించిన వారంతా మహాశ్చర్యం చెందారు. వారి స్నేహ బంధం ే ఖండించబడిపోయింది. ఆతడు చనిపోయా డన్న వారి దుఃఖం దూరమయిపోయింది. తరం ఆ జాతి వారందరూ ఆ బాలుని కళేబరాన్ని స్మశాన వాటికకు తీసుకుపోయి తర సంస్కారాదులు పూర్తి చేశారు. త్యజించ వీలుకాని స్నేహ పాశం సమూలంగా ంపబడింది. శోక, మోహ, భయ, దుఃఖాలకు స్నేహ బంధమే ప్రధాన కారణము. బంధం ేవడంతో అవన్నీ దూరమై పోయాయి. ఆ రాకుమారుణ్ణి హత్య ేసిన ఆ రాణు లందరూ హీనలై పోయారు. లజ్జవల్ల శిరస్సులు దించేసి కనులార చూడలేక పోతూన్నారు. ఆంగి ంహాత్ముని దివ్యోపదేశానుసారం వారందరూ మత్సర శూన్యలై యమునాతీరంలో బాల కు ప్రాయశ్చిత్తం చేసుకున్నారు.

ఆంగిరస నారదుల దివ్యోపదేశాలను ఆలకించిన చిత్ర కేతు రాజు జ్ఞానం పొంది — దార, ధన, రాజ్యాది సంసారాంధ కూపం నుండి బయట పడ గలిగాడు. ఆతడు యమునలో ూచరించి తర్పణ కార్యాదులు నిర్వర్తించి సంయమన చిత్తుడై మౌనియై ఆ మహా చరణ కమలాలకు ప్రణమిల్లినాడు. ఆ మహారాజు భగవద్భక్తుడై, జితేంద్రియుడై శరణాగతుడు కావడం చూసి దేవర్షి ప్రసన్నుడై మంత్రోపనిషత్ రూపమైన సంకర్షణ ఈ రీతిగా ఉపదేశించాడు. 'ఓంకార స్వరూపా! భగవంతుడా! వాసుదేవ, ప్రద్యుమ్న, ్ధ, సంకర్షణ రూపాలలో క్రమంగా చిత్త, బుద్ధి, మన, అహంకారాలలో అధిష్ఠించి నువ్వే ు. అట్టి నీ చతుర్వ్యూహానికి ప్రణమిల్లుతూ ధ్యానిస్తూన్నాను. విశుద్ధ, విజ్ఞాన స్వరూపు పరమానందమయ మూర్తివీ, అద్వైత దృష్టి సంపన్నుడవూ, అయిన నీకు నేను ల్లుతూన్నాను. స్వస్వరూప భూతమైన ఆనందానుభవం వల్లనే మాయా జనితమైన రాగాది ను నువ్వు తిరస్కరించినావు. అట్టి నీకు ప్రణామాలు. సర్వులకూ, సర్వేంద్రియాలకూ

వే ప్రేరకుడవు. మహత్తర విరాట్స్వరూపుడవు. మనససమేతమైన వాక్కు నిన్ను సమీ
పించలేక మరలిపోతున్నది. మనస్సు ఉపరతమైనది కాగా అద్వితీయమై నామరూప రహి
తమై చైతన్య మాత్రమై, కార్య కారణాతీత పదార్థం మిగిలి ఉండిపోతుంది. అట్టి పరమాత్మయే
రక్షించును గాక ! కార్య కారణ రూపమైన ఈ విశ్వం ఎవని నుండి ఉత్పన్నమైనదో ? ఎవని
నివసిస్తూన్నదో ? ఎవనిలో లయమవుతూన్నదో ? సర్వమునందూ నిండి నిబిడీకృతుడై
నట్టి పరబ్రహ్మమూర్తి వగు దేవా! నీకివే వందనాలు. యావద్విశ్వమందూ బాహ్యాభ్యంతర
హితంగా ఆకాశం యిమిడి ఉన్న రీతిగా సర్వే సర్వత్రా అంతరంగ, బహిరంగ భేద
గా నువ్వు యిమిడి ఉంటావు. అయినా మనోబుద్ధి జ్ఞానేంద్రియాదులు - తమయందున్న
క్తి ద్వారా కూడ నిన్ను గ్రహించ జాలవు. కర్మేంద్రియ ప్రాణాదులు తమయందుండే
శక్తితో నిన్ను స్పృశించ జాలవు. అట్టి శక్తి అనంత సంపన్నా! నీకివే మా ప్రణామాలు.
దియ మనో ప్రాణ, బుద్ధ్యాదులు — స్వప్న జాగ్రదవస్థలలో నీ చైతన్యాంశతో
తమ తమ కార్యాలు చేయ గలుగుతాయి. సుషుప్తి, మూర్ఛావస్థలయందు — నీ చైత
లుప్తం కావడం వల్ల స్వకార్యాలను చేయజాలకున్నాయి. అగ్ని తప్తమైన లోహం
స్తువులను దగ్ధం చేయ గలదు. తద్భిన్నంగా ఉన్న లోహానికి దాహక శక్తి ఉండదు.
తన్య శక్తి లేనిదే — దేహేంద్రియ మనసాదులకు శక్తి లేదు. 'ద్రష్టా !' నామధేయా !
ది దశలలో నువ్వు ఆ నామాన్ని గ్రహిస్తావు. యదార్థానికి నీకన్న భిన్నంగా వాటికి
మన్నది లేదు. ఓంకార స్వరూపుడవు, అత్యంత ప్రభావ సంపన్నుడవూ, మహత్తర
పతివీ, భగవంతుడవూ మహాపురుషుడవూ అయిన నీకు ప్రణామాలు. భక్త శ్రేష్ఠులు
తులారా నీ పాదారవింద సేవ చేస్తూంటారు. ప్రభూ ! సర్వ శ్రేష్ఠా! సర్వదా నేను
ణమిల్లుతూన్నాను. అంటూ నారదమహర్షి చిత్ర కేతువుకు ఆ విద్యను ఉపదేశించి
సమేతంగా సత్య లోకానికి వెళ్ళిపోయాడు. చిత్రకేతు రాజు నారద మహర్షి ప్రబో
విషయాలను గ్రహించి తదాదేశానుసారం సప్తాహ దీక్షా కాల పర్యంతం జలాలనే పానం
కాగ్ర చిత్తుడై ఉపాసన చేశాడు. తద్విద్యా ప్రభావం వల్ల అనుష్ఠానం సక్రమంగా
గడం వల్ల ఆతనికి అఖండమైన విద్యాధరాధిపత్యం లభించింది. తరువాత కొంతకాలానికి
ప్రభావం వల్లనే ఆతడు విశుద్ధాంతరంగుడై శేష భగవానుని సన్నిధికి చేర గలిగాడు.

్వరుల సమాజంలో శేష భగవానుడు తేజరిల్లిపోతూ ఉండడం చూశాడు. ఆ రాజు కమల సమంగా ఆ శేష భగవానుని దివ్య దేహం భాసిల్లుతూ ఉన్నది. అతడు నీలాంబరాన్ని ి ఉన్నాడు. శిరోపరిభాగాన కిరీటమూ, భుజాలందు భుజ కీర్తులునూ, కటి భాగాన బంగరు త్రాడును, కరములందు సువర్ణ కంకణాలూ, ఇతరేతరాభరణాలూ భాసిల్లు తూన్నాయి. నయనాలు అరుణారుణాలై రత్న సమంగా ప్రకాశిస్తూన్నాయి. ప్రసన్న వదనంతో సర్వ ్షకుడై ఆ శేషమూర్తి తేజరిల్లి పోతూన్నాడు. ఆ శేష భగవద్దర్శన మాత్రం చేత చిత్ర ి సర్వ పాప విముక్తు డయ్యాడు. స్వచ్ఛమైన, నిర్మలాంతఃకరణలో ఉన్న అతని ియ గత భక్తి భావం పెల్లుబుక నయనాలు ఆనంద బాష్పాలను రాల్చాయి. శరీరం ంచితం కాగా కంఠం గద్గదత్వాన్ని పొందింది. ఆ దశలోనే ఆ రాజు శేష భగవానునికి ిల్లాడు. ఆనంద పారవశ్యాన నోట మాట రాకపోవడం వల్ల చాల సేపటి వరకు ఆ రాజు గవానుణ్ణి స్తుతించ లేక పోయాడు. కొన్ని క్షణాలకు బుద్ధి వివేకాన్ని ఆశ్రయించగా అతడు చే శక్తిని పొందాడు. సర్వేంద్రియాల బాహ్య వృత్తులనూ నిరోధించాడు. పాంచ రాత్రాది శాస్త్రాలయందు అభివర్ణించిన విశ్వ గురు వగు శేష భగవానుణ్ణి ఇలా స్తుతించ సాగాడు:-

'ఓ సంకర్షణ దేవా! సమదర్శులూ, జితేంద్రియులూ అయిన సజ్జనులు నిన్ను జయించ

తూన్నారు. నిజ సౌందర్య, మాధుర్య, కారుణ్యాది దివ్య గణ ప్రభావాలతో నువ్వు వారిని స్వాధీనం చేసుకో గలిగావు. నిన్ను కామనా రహితంగా సేవించే వారికి నువ్వు తో సర్వాన్నీ సమర్పిస్తావు. అట్టి అనుగ్రహ మూర్తివైన నీ కృపకు పాత్రులైనవారు ే, దేవా! సృష్టిస్థితి సంహారాలు నీ లీలా విశేషాలే, విశ్వ నిర్మాతలైన చతుర్ముఖా నీ అంశాంశలై ఉండీ కూడ — జగత్కర్తలమన్న భావంతో పరస్పరం వాదులాడు వుంటారు. అణువులో పరమాణు వాదిగా, మహత్తులో మహత్తత్త్వ పర్యంతం సర్వ జీవుల ఆది మధ్యాంతాలతో నువ్వే భాసిల్లుతూ ఉంటావు. స్వతః సిద్ధంగా మధ్యాంత రహితుడవైన వాడవు నువ్వు. కారణం? వస్తువుల ఆద్యంతాలలో ఉండేదే ో కూడ ఉంటుంది. ఏ పృథివ్యాదులతో బ్రహ్మాండ కోశము ఉన్నదో ఆ వృథి ు ఒకదానిని మించి వేరొకటి పది రెట్లు పెద్దవై ఒకదానిని వేరొకటి ఆవరించి యి. అట్టి సప్తావరణలతో కూడిన అనంతకోటి బ్రహ్మాండాలు నీలో పరమాణు రూపాన

ుస్తూంటాయి. చరాచర రూప అనంతకోటి బ్రహ్మాండాలు నీలో అణువులై ఉండగా నీకు
ొన్నది ఎక్కడుంది? అందులకే నువ్వు అనంతుడ వనబడ్డావు. పశు సమంగా ఎవడు
విషయ భోగాలయందే ఆసక్తుడై ఉంటాడో అట్టి వాడు నిన్ను సేవించక నీ అంశా
గు దేవేంద్రాదులను ఆరాధిస్తూంటాడు. రాజ వంశం నశించగా ఆ వంశీకులను ఆశ్రి
ి వారి జీవనాధారం కూడ నాశనమైన విధంగానే క్షుద్ర దేవతల కాలం తీరగానే — ఉపాస
వారిచ్చిన భోగాదులు కూడ నాశన మవుతాయి. జ్ఞాన స్వరూపుడవూ, నిర్గుణుడవూ కావడం
రమాత్మా! నువ్వు — నీ భక్తులకు జనన మరణ రూపమైన ఫలాల నీయవు. సత్త్వాది
వల్ల జీవునకు సుఖ దుఃఖాది ద్వంద్వ ఫలాలు ఏర్పడుతాయి. నిర్గుణం వల్ల ఫలాలు లభిం
ిర్గుణుడవైన నీ సేవ వల్ల మోక్షమే ప్రాప్తిస్తుంది కానీ అన్యం కాదు. నువ్వు భాగవత
్ని ఉపదేశించిన నాడే సర్వాన్నీ జయించినావు. అహంకార మమకారాలను విడనాడి, సర్వ
రిత్యాగులైన సనక సనందనాదులు కూడ మోక్ష ధర్మాన్నే ఆశ్రయిస్తూ వుంటారు. పరి
దది భాగవత ధర్మం మాత్రమే. సకామ ధర్మాలను బోధించే శాస్త్రాలవలె అది మానవు
షయ బుద్ధిని కలుగజేయదు. నేను, నాది — నువ్వూ — నీదీ అనే భేద భావాలను కలిగించే
— ద్వంద్వ భావాల వల్ల — నాశనమే ధర్మంగా కల అధర్మ ఫలమే ప్రాప్తిస్తుంది. దాని
స్టి వారికీ కూడ ఎట్టి ప్రయోజనమూ చేకూరదు. సకామ ధర్మానుష్ఠాన పరాయణులకు దుఃఖం
ంతో క్రోధం ఏర్పడుతుంది. పైగా తత్కర్మల వల్ల ధర్మ ఫలం లభించదు కూడ,
ంగా అధర్మ ఫలం సిద్ధిస్తుంది. నువ్వు ఉపదేశించిన భాగవత ధర్మం పరమార్థాన్నుండి
కాసీయదు. అందులకే చరాచర సృష్టిలో సమభావం కలిగి సంచరించే సజ్జనులు మాత్రమే
ధర్మ మార్గాన — నిన్ను ఆరాధిస్తూంటారు. పరమాత్మా! మానవుల సమస్త పాపాలూ
ర్శన భాగ్యం వల్లనే నాశనమై పోతాయి. నీ పావన నామాన్ని ఒక్కసారి విన్నంత
న పరమ చండాలుని పాప రాశి కూడ భస్మమై పోతుంది. ఇక నీ సందర్శన భాగ్యం
భించే అనంత ఫల విషయంలో సంశయం ఏమున్నది? పరమేశ్వరా! ఇప్పుడు నీ సంద
ప్రాతాన నా పాపాలన్నీ నాశనమై పోయాయి. అనన్యాయత్త చిత్తుడై నిన్ను సేవించు
రద దేవర్షి — నాకు యీ విషయాన్ని బోధించి యున్నాడు. ఆ దివ్యర్షి వాక్యం అసత్య
ందా? సర్వ విశ్వాత్మ స్వరూపా! జీవులు చేసే పాప విషయాలు నీకు తెలియకుండా

ప్ర. మిణుగురువు – భాస్కర భగవానుని భాసిలజేయ జాలనట్లే పరమ గురో! నీకు
నివేదించగలను? జగత్ ప్రభో! ఈ విశ్వ సృష్టిస్థితి లయాదులన్నీ నీ అధ్యక్షతలోనే
జరుగుతాయి. అహంకారులు భేద భావం వల్ల నీ సత్య స్వరూపాన్ని గుర్తించజాలరు. నీ
దివ్య స్వరూపానికి ప్రణామాలు. నీ దివ్యానుగ్రహ శక్తులను పొందియే బ్రహ్మాదులు
సృష్టి సమర్థులు కాగలుగుతున్నారు. నీ దృష్టి మాత్రం చేతనే జ్ఞానేంద్రియాలు చైతన్య
సంపన్నాలై స్వవిషయ గ్రహణ సమర్థా లవుతున్నాయి. పంచాశత్కోటి విస్తీర్ణమైన
శాల భూమండలం నీ మస్తకోపరిభాగాన ఆవగింజంత ప్రమాణంలో ఉంది. సహస్ర
నీ కివే నా వినయాంజలులు.' అని విద్యాధి రాజు అయిన చిత్ర కేతువు అలా ప్రార్థిం
సంకర్షణ భగవానుడు ప్రసన్నుడై – 'చిత్రకేతూ! నారద అంగిరసులచే ఉపదేశింపబడ్డ
ద్వారానే నువ్వు నన్ను దర్శించి సిద్ధుడవు కాగలిగావు. సర్వ ప్రాణుల రూపాలలో
నేనే, వాటి ఆత్మ స్వరూపుడనూ నేనే. శాసకుడనైన నా స్వరూపాలే శబ్ద బ్రహ్మలు
ము, ఆత్మయే కార్య కారణాత్మక విశ్వమంతా వ్యాప్తమై ఉంది. అట్టి ఆత్మయందే
విశ్వమూ స్థితమై ఉంది. ఈ రెండింటియందూ అధిష్ఠితుడనై నేనే ఉంటాను. ఈ రెండూ
లై నా యందే ఉంటాయి. నిద్రించినవాడు స్వప్నానంతరం యావద్విశ్వాన్నీ చూడ
కాడు స్వప్నం పూర్తి కాగానే తనలోనే జాగృతిని పొందుతాడు. ఆ దశలో విశాల
లో తానొక మూలగా ఉన్నట్లు చూడ గలుగుతాడు. యదార్థానికి అదీ ఓ సప్నమే. అట్లే
– జాగ్రత్ స్వప్న, సుషుప్త్యావస్థలు మూడూ భగవన్మాయా కల్పితాలే అన్న సత్యాన్ని
ని – సర్వ సాక్షీ, మాయా తీతుడూ. అయిన పరాత్పరుని స్మరించాలి. నిద్రించు నట్టి
. నిద్ర వల్ల అతీంద్రియ సుఖానుభూతిని పొందుతున్నాడో – ఆ పరబ్రహ్మను నేనే,
పరబ్రహ్మనే నువ్వు 'ఆత్మ' అని తెలుసుకో, నిద్ర జాగ్రదవస్థలయందు అనుగతుడైన
ము యదార్థానికి తదవస్థలకన్న భిన్నంగా ఉంటాడు. సమస్తావస్థలయందూ అఖండైక రస
పరబ్రహ్మ స్వరూపము, అదియే బ్రహ్మ పదార్థము. నా దివ్య స్వరూపాన్ని విస్మ
రి జీవుడు తనను వేరుగా భావిస్తాడు అందుకే జనన మరణ రూప కాలచక్రంలో పడి
తున్నాడు. అంటూ సంకర్షణ భగవానుడు ఇంకా ఇలా బోధిస్తున్నాడు :–

జ్ఞాన, విజ్ఞానాలకు నిలయమైన మనుష్య జన్మను పొంది కూడా స్వాత్మ స్వరూపుడైన

ర్మను గ్రహించనివాడు ఎక్కడ ఎన్ని యోనులలో జన్మించినా శాంతిని మాత్రం పొంద
సాంసారిక సుఖాన్ని వాంఛించి చేసే సమస్త ప్రయత్నాలవల్లా శ్రమా, దుఃఖం
ు మిగులుతాయి. పైగా సుఖాలకు బదులు క్లేశాలే ప్రాప్తిస్తాయి. కర్మల నుండి నివృత్తి
ఎట్టి భయమూ ఉండదని గ్రహించి ధీశాలి అయిన వాడు ఎట్టి కర్మలూ సంకల్పించక
లాపేక్షా రహితంగా ఉండాలి. దుఃఖం నశించి సుఖం లభిస్తుందన్న భావంతోనే సర్వులూ
చరిస్తారు. కానీ వారు మాత్రం దుఃఖ దూరులై సుఖాలను పొందడం లేదు. తాను
మేధావి నన్న భావంతో మానవుడు కర్మ లాచరిస్తూ — విపరీత ఫలాన్ని పొందుతాడు.
సూక్ష్మమైన ఆత్మ స్వరూపం జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలకన్న, తదభిమాన
కన్న భిన్నమై, విలక్షణమైనది. ఇహలోక సంబంధమై చూడబడునవీ, పరలోక సంబంధమై
నట్టివీ అయిన విషయభోగాలన్నీ అశాశ్వతాలని గ్రహించి వివేకంతో జ్ఞాన, విజ్ఞానాల
సంతుష్టి కలిగి నా భక్తుడై ఉండాలి. యోగ తత్త్వాన్ని గ్రహించడంలో కుశలుడైన వాడు-
హ్మైక్య సంధానమే జీవునకు యదార్థమైన స్వార్థమని గ్రహించి ఆత్మాను భూతిని
. నా యీ ఉపదేశాన్ని సావధానుడవై గ్రహించి ధారణచేసి జ్ఞాన విజ్ఞాన సంపన్నుడవై
సిద్ధుడవు కమ్ము.' అంటూ శ్రీహరి భగవానుడు చిత్ర కేతువునకు ఉపదేశించి అంత
పోయాడు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 అధ్యాయం-17

## పార్వతీమాత చిత్రకేతువును శపించుట.

శుకమహర్షి చెబుతూన్నాడు – 'పరీక్షిన్నరేంద్రా! సంకర్షణ భగవానుడు అంతర్ధాన దిశకు ప్రణమిల్లి చిత్రకేతు విద్యాధరుడు అంబర వీధిలో స్వేచ్ఛగా సంచరించ సాగాడు. యోగి అయిన అతడు సంకల్పాలను అన్నింటినీ నెరవేర్చు నట్టి సుమేరు గిరి దగ్గర చిర విహారం సాగిస్తూన్నాడు. అతని శరీర, ఇంద్రియ శక్తులు వర్ధిల్లు తూన్నాయే కానీ తగ్గడం సిద్ధ, చారణ, మహర్ష్యాదులు అతణ్ణి స్తుతిస్తూన్నారు. అతని సమక్షంలో విద్యాధరాంగనలు హరి గుణాలను గానం చెయ్య సాగారు. భగవంతుడు అనుగ్రహించిన విమానాన్ని ఎక్కి ఏ చిత్ర కేతువు సదాశివ భగవానుణ్ణి సందర్శించాడు. తత్సభలో సిద్ధ, చారణ, ఋషి, ముని స్తుతుడైన ఆ మహాదేవుని వామాంకమందు శ్రీ రాజ రాజేశ్వరి విరాజిల్లు తూన్నది. ఆ దృశ్యాన్ని తిలకించిన చిత్రకేతువు విమానం దిగకుండ పార్వతీ మాత వినేలా బిగ్గరగా నవ్వుతూ ! యావద్విశ్వానికీ ధర్మోపదేశకులైన గురువులూ. సర్వోత్తములూ అయిన మహాదేవులు నిండు సభలో తొడమీద అర్ధాంగిని కూర్చుండబెట్టుకుని ఆలింగనం చేసుకొని సుఖాసీనుడై డే. ప్రపంచంలో సామాన్యుడు కూడ అందరిలోనూ భార్యను ఆలింగనం చేసుకోడే. ఏకాంతంలోనే ఆమెను సమీపిస్తాడు. మహాదేవుడు అలా కాక సిద్ధ చారణ ఋషి మునిగణ మైన మహా సభలో యిలా ప్రవర్తిస్తూన్నాడే?' అన్నాడు.

రాజా! మహాదేవుని బుద్ధి అగాధమైనది. చిత్ర కేతుని పలుకులు విని చిరునవ్వు నవ్వి ఊ వహించాడే కానీ మారు పలుక లేదు. అతని అనుచర, సహచర వర్గం కూడా మౌనం పూండిపోయారు. శంకర ప్రభావం ఎరుగని చిత్ర కేతువు శంకరునే అపహాస్యం చెయ్య ు. అంతతో ఊరుకోక తాను జితేంద్రియుడ నని గర్వించ సాగాడు. అది చూసి సహించ పార్వదేవి కుపితయై – 'ఓహో! లజ్జా శూన్యులైన మావంటి దుష్ట బుద్ధులను శిక్షించ

సకుడు యీతఁ డొక్కఁడే బయలుదేరాడు. బ్రహ్మ, భృగు, నారదులూ, బ్రహ్మ పుత్రు సనక సనందనాదులూ, కపిల మన్వాది పురుషులూ — వీరెవరూ ధర్మ మర్మాన్ని గ్రహించ పోలేరు, అందువలనే వారు ధర్మోల్లంఘన చేసిన మహాదేవుని యీ విధమైన దుష్టత్వం నిరోధించ లేకపోయారు. చతుర్ముఖ మహేంద్రాదులచే వందనాలు పొందుతూన్న మహా ఆయన అనుయాయులనూ తిరస్కరించిన యీ క్షత్రియాధముడు శిక్షార్హుడే. వీణ్ణి వదకూడదు. ఈ మూఢ చిత్తుడు తాను పెద్దనని అహంకరిస్తూన్నాడు. ఓరీ! చిత్రకేతూ! ! నువ్వు పాప భూయిష్టమైన రాక్షస యోనిలో జన్మింతువు గాక! ఈ శిక్షను అనుభ తరువాత భవిష్యత్తులో ఎన్నడూ యిక అహంకరించ జాలవు.' అంటూ శపించింది.

జగజ్జననిచే శపింపబడిన చిత్ర కేతువు — విమానం నుండి క్రిందకు దూకి తలవంచి — ! నీ శాపాన్ని నేను చేతులు కట్టుకుని ఆనందంగా స్వీకరిస్తూన్నాను. మానవుల కర్మాను దేవతలు వారిని శపిస్తూంటారు, అనుగ్రహిస్తూంటారు. వారి కర్మ ఫలానుసారంగానే ద్ధిస్తూంటాయి. అజ్ఞాన జనితుడైన జీవుడు సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తూ సదా సుఖ దుఃఖాలు పొందుతూంటాడు. సుఖ దుఃఖా లన్నవి ఆత్మవల్ల కలుగవు. పరుల వల్లా పి. అజ్ఞానియైనవాడు పరులవల్ల తనకు సుఖ దుఃఖాలు ఏర్పడుతూన్నా యని అనుకుంటాడు. ప్రపంచమంతా సత్త్వ రజస్తమోగుణ ప్రవాహ రూపమై ఉంది. శాపానుగ్రహాలూ, స్వర్గ లూ సుఖ దుఃఖాలూ కూడ కల్పితాలే. కానీ సత్యాలు కావు, సజాతీయ. విజాతీయ స్వగత హితుడైన పరమాత్మయే నిజ మాయా శక్తితో చరాచర రూపమైన యీ ప్రాణికోటినీ మోక్షాలనూ, సుఖ దుఃఖాలనూ సృజిస్తూ ఉంటాడు. మాతా! సర్వ ప్రాణు లయందూ న శ్రీహరి దేవుడు మాయామల రహితుడై, ప్రియా ప్రియాలన్నవి లేనివాడై ఉంటాడు. త్మయందు స్వపర భేదం లేదు. సుఖముందే అతనికి రాగం లేనప్పుడు రాగ జన్యమైన ఎక్కడిది? పాప పుణ్యాలకూ, సుఖ దుఃఖాలకూ, హితాహితాలకూ, బంధ మోక్ష జనన మరణాలకు — భగవన్మాయా శక్తియే కారణ మవుతూన్నది. అమ్మా! శాప కై నేను నిన్ను ప్రార్థించడం లేదు. నా పలుకుల ద్వారా నీ కోపం చల్లారాలని అర్థిస్తూ .' అని వేడుకో సాగాడు.

ఉమామహేశ్వరులను ఆ రీతిగా స్తుతించి విద్యాధరుడైన చిత్ర కేతువు వారికి ప్రణమిల్లి

..డనుండి వెళ్ళిపోయాడు. అతడలా వెళ్ళడం చూసిన అక్కడి వారందరూ మహాశ్చర్యం ..రు. అంత మహాదేవుడు సర్వుల సమక్షంలోనూ పార్వతీ దేవిని తిలకించి — 'దేవీ! భగ ..లైన దివ్య లీలా విహారుల ఔదార్యాన్ని, నిస్పృహనూ స్వయంగా చూశావు కదా! భగవ ..నుదాసుల శక్తి నీ కిప్పు డర్థమైనదా? భగవంతులే శరణు వేడిన అనన్య భక్తులు వెను .., అంతేకాదు భీతి చెందరు కూడ. స్వర్గ, మోక్ష నరకాలు సమంగా ఉండే వీరు సర్వాన్నీ ..భావనతో చూస్తారు. జీవులకు భగవల్లీలల వల్ల దేహ సంయోగం జరుగుతుంది. తద్వారా .. దుఃఖ జనన, మరణ శాపానుగ్రహాలు సిద్ధిస్తాయి. స్వప్న దశలో సుఖ దుఃఖాలు ఏర్పడు .., జాగ్రదవస్థలో పూలమాలాదులయందు సర్ప భావం కలుగునట్లు, అజ్ఞానం కారణంగా ..వునకు ఆత్మలో సుర, నరాది భేద భావాలూ, గుణ దోషాది కల్పనా సిద్ధిస్తూ వుంటుంది, ..రి యందు భక్తి కలిగి జ్ఞాన వైరాగ్యాలను ఆర్జించిన వాడు రాగ ద్వేష శూన్యుడై సమస్త ..లనూ అతడు సమ దృష్టితో చూస్తాడు. నేనూ, చతుర్ముఖ, మహేంద్రాదులూ, సనక ..నాదులూ నారద, భృగు, కపిలాది మహర్షులూ, అమరులూ పరమాత్మ యొక్క గూఢ .. జీవులు ఈ లీలలను తెలుసుకోలేము. అట్టి దశలో సాధారణుల విషయం వేరే వర్ణించాలా? ..త్మ సర్వ ప్రాణి కోటికీ ఆత్మ స్వరూపుడై. సర్వ భూత హితకరుడై ఉంటాడని ..ంచాలి. దేవీ! ఈ విద్యాధర చిత్రకేతువు భగవంతుని ప్రియానుచరుడు. సమ దర్శియై ..చిత్తుడైనవాడు. నేను శ్రీహరికి ప్రియుడను. శాంత చిత్తులైన మహాత్ములగు భగవద్భక్తు ..ట్టి ఆశ్చర్యంగానూ చూడ నవసరం లేదు.' అని మౌనం దాల్చాడు.

పతి పలికిన హితకర వచనాలకు పార్వతీదేవి శాంతచిత్తురాలయింది. ఆమె విస్మయ ..యైన ఆనంద మగ్నురాలైనది. సమర్థుడై కూడ చిత్ర కేతువు పార్వతీ దేవికి ప్రతి శాపం ..లేదు. సరికదా ఆమె శాపాన్ని శిరసావహించాడు. సాధు సజ్జనుల మహత్త్వం అదియే.

కాలం గడచిపోతూన్నది. చిత్ర కేతువు దానవ యోనిని ఆశ్రయించి త్వష్ట ప్రజాపతి దక్షిణాగ్ని నుండి వృత్రాసురునిగా జన్మించాడు. అసుర యోనిలో జన్మించినా దైవభక్తుడు వల్ల భగవత్ జ్ఞానం కలవాడు కావడం వల్ల ఆ తత్త్వంతోనే దేహాన్ని చాలించాడు. ఈ గాధను ఆలకించిన వారంతా సర్వ బంధనాలనుండీ విముక్తు లవుతారు. హరినామ స్మరణ

ప్రాతర్వేళలో యీ వృత్రాసుర గాథను ఆలకించేవారూ, పఠించే వారు ఉత్తమ గతిని పొందుతారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–6 — అధ్యాయం–18

### అదితీ దితుల సంతాన వర్ణన, మరుద్గణోత్పత్తి.

శుకమహర్షి – 'రాజా! సవిత తన పతి వల్ల సావిత్రి, వ్యాహృతి, త్రయి, అగ్నిహోత్ర, పశు, సోమ, చాతుర్మాస్య, పంచ మహా యజ్ఞులన్న వారిని ఎనమండుగురిని కన్నాడు. భగుని భార్య సిద్ధి – మహిమ, విభు, ప్రభు నామాలు కల ముగ్గురు పుత్రులను కన్నది. ఆశిష అనే ఏక కన్య కూడ వారి సంతతియే. ధాత అనే వానికి నల్గురు భార్యలు వారి పేర్లు కుహూ, సినీవాలి, రాకా అనుమతీ. వారికి క్రమంగా సాయం, దర్శ, ప్రాతః, పూర్ణ మాస్యలనే వారు జన్మించారు. ధాత సోదరుడు – విధాత. అతని భార్య క్రియ. అతడు ఆమె వల్ల పురీష్యనామకమైన పంచాగ్నులను కన్నాడు విధాత. చర్షణి అను నామె వరుణుని భార్య. ఆమె భృగును ప్రసవించినది. వాల్మీకి కూడ వరుణ నందనుడే. వల్మీకం నుండి బహిర్గతుడు కావటం వల్ల అతణ్ణి వాల్మీకి అన్నారు. ఊర్వశీ సౌందర్య సందర్శన మాత్రాన వరుణుని రేతస్ఖలనం కాగా దానిని ఘటమందు వుంచి సంరక్షించగా దాని నుండి అగస్త్య వశిష్టులు పుట్టారు. మిత్రుని అర్ధాంగియైన రేవతి ఉత్సర్గ, అరిష్ట, పిప్పలులనే కుమార త్రయాన్ని ప్రసవించింది. పులోముని కుమార్తె అయిన శచీదేవి మహేంద్రుని అర్ధాంగిగా విశేష ఖ్యాతి గాంచినది. జయంత, ఋషభ, మీఢవానులనే కుమారులు ముగ్గురూ ఆమె పుత్రులే. సాక్షాన్నారాయణుడే వామనావతారంలో భాసిల్లాడు. అతడే త్రివిక్రమ రూపాన్ని దాల్చి బలియాగ మండపంలో మూడడుగుల భూమిని దానంగా యిమ్మని కోరి పదత్రయంతో జగత్త్రయాన్ని ఆక్రమించి,

ంద్రునకు అమరలోకాధిపత్యాన్ని అనుగ్రహించాడు. వామనుని పత్ని కీర్తి. ఆమె
డు బృహచ్ఛ్లోకుడు, సౌభగనామకు లయిన కుమారులు అనేకమంది అతనికి కలిగారు.
వల్ల కశ్యపునకు శ్రీహరియే వామనుడై అవతరించాడు.

కశ్యప మహర్షి ద్వితీయ పత్ని దితి. ఆమె సంతాన పరంపరను ఆలకించు. భక్త
దుడు తద్వంశంలోనే ప్రభవించాడు. ఆత్మార్పణ చేసిన బలిది ఆ వంశమే. దితికి దైత్య
వందనీయు లయిన కుమారులు యిద్దరు పుట్టారు. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులనే
ో వారు ఖ్యాతి గాంచినారు. కుంభ దానవుని పుత్రి అయిన కయాధూను హిరణ్య
కు వివాహం చేసుకున్నాడు. ఆ దంపతులకు సంహ్లాద, అనుహ్లాద, హ్లాద, ప్రహ్లాదు
నలుగురు పుత్రులు కలిగారు. వారికి సోదరిగా జన్మించిన కన్య సింహిక నామంతో
బడింది. విప్రచిత్తి అనే దానవుడు ఆమెను పరిణయ మాడగా వారికి రాహువు
డు. క్షీరసాగర మథన వేళలో అమృత ప్రదానం చేసే మోహినీ రూపుడైన శ్రీహరి యీ
మస్తకానే ఖండించి వేశాడు. సంహ్లాదుని భార్య కృతి — పంచజనుడు అనే కుమారుణ్ణి
సి. హ్లాద పత్ని అయిన ధమని వాతాపి, ఇల్వల నామక రాక్షసులను కన్నది. వాతాపిని
చేసి యిల్వలుడు అతిథిగా వచ్చిన అగస్త్య మహర్షికి వడ్డించాడు.

అనుహ్లాద పత్ని అయిన సూర్య మహిషాసుర బాష్కలులను కన్నది. ప్రహ్లాద పుత్రుడు
నుడు. అతడు తన భార్య యగు దేవివల్ల దానశీలీ, త్యాగధనుడూ అయిన బలిచక్రవర్తిని
డు. బలి పత్ని అయిన అశన బాణాసురాది పుత్ర శతాన్ని ప్రభవింప జేసింది. బలి
ర్తి కీర్తి ఆచంద్ర తారార్క మైనది. బాణాసురుడు శంకరుని ఆరాధించి ప్రమథ గణాలలో
ప స్థానాన్ని పొంద గలిగాడు. ఈ నాటికీ శంకర భగవానుడు బాణ దానవుని నగర రక్షకు
ఉన్నాడు. దితికి — హిరణ్యాక్ష హిరణ్య కశిపులే కాక — మరుద్గణ నామంతో 49 గురు
పలు పుట్టారు. వారిని మహేంద్రుడు — తనతో సమానులనుగా భావించు కుంటాడు.

అని శుకమహర్షి పలుకగా విన్న పరీక్షిత్తు ప్రశ్నిస్తున్నాడు. — 'మునీంద్రా! మరు
దానవ యోనిలో పుట్టినా దైవీ శక్తులతో తేజరిల్లుతూ మహేంద్రునిచే ఆదరించ బడడానికి
తువును వివరించ గోరుచున్నాను.' అని కోరగా శుకమహర్షి మరుద్గణ వృత్తాంతాన్ని
న్నాడు. 'రాజా! మహేంద్ర పక్షంలో చేరిన నారాయణుడు విశ్వ కళ్యాణ దృష్ట్యా

ృక్ష, హిరణ్యకశిపులను సంహరించాడు. పుత్ర వియోగ దుఃఖంతో శోక, క్రోధ సంతప్త ు అయిన దితి మనసా యోచించ సాగింది. 'విషయ లోలుడు, దయా శూన్యుడూ, చిత్తుడూ అయిన మహేంద్రుడు భ్రాతృ హంతకుడై, పాపియై స్వేచ్ఛగా ఉన్నాడు. ంతం చేసి కానీ నేను సుఖంగా నిద్రించను. ఇంద్రుడు తాను శాశ్వత మనుకుంటూ స్వనాశనాన్ని తాను గుర్తించక అప్రమత్తుడై సంచరిస్తూన్నాడు. కనుక వాడి గర్వాన్ని చేసే పుత్రుణ్ణి కనాలి.' అంటూ యోచన పూర్తి కాగానే దితి జితేంద్రియయై ప్రేమాది , వినయ భావంతో తపోధనుడైన కశ్యప మహర్షిని సేవాదుల ద్వారా ప్రసన్నుని ాలని విశేష ప్రయత్నాలు చెయ్య సాగింది. పతి మనోభీష్టాలను గ్రహిస్తూ తదను ి చరిస్తూ మనోహర వేషభాషలతో, మందస్మిత వదనారవిందంతో పతి చిత్తాన్ని ుకో సాగింది, ఆమె హావభావ విలాస విన్యాసాదులకు – విద్వాంసుడూ తపస్వీ అయి కశ్యప మహర్షి – ప్రేమ వశుడై – 'దేవీ! నీ మనోభీష్టాన్ని నెరవేర్చ నేను ిగా ఉన్నాను. కావలసిన వరం కోరుకో.' అన్నాడు. నారీమణులకు వశులై పురుషులు ిలకడంలో విచిత్ర మేమీ లేదు. సృష్ట్యాదిలో బ్రహ్మదేవుడు తన అర్ధ దేహం ద్వారా ృష్టించాడు. వారందరూ పురుషులను తమవైపుకు ఆకర్షించు కున్నారు. దితి కూడ తత్ప ో ఆ మార్గాన్నే అనుసరించింది. ఆమె భర్తను విశేషంగా సేవించి ప్రసన్నుని చేసు అతడు ఆనందంగా – 'ప్రియురాలా! నీ సేవలకు ప్రసన్నుడనై సంతుష్టుడ నయ్యాను. ప్రసన్నుడైతే భార్యకు యిహపరాలలో తీరని వాంఛలు ఏమి ఉంటాయి? నీ అభీష్టాన్ని ు. శ్రీమన్నారాయణ దేవుడే సర్వ హృదయాలలోనూ విరాజిల్లు తూన్నాడు. పరమాత్మా దైవమూ కూడ స్త్రీకి భర్తయే అని శాస్త్రాలు చెబుతూన్నాయి. విభిన్న రూపాలతో ించే దేవతోపాసనలు అన్నీ వాసుదేవ భగవానునికే చెందుతాయి. సజాతీయ, విజాతీయ భేద శూన్యమైన శ్రీహరి ఉపాసకుల భావాలను అనుసరించి ఆయా రూపాలతో దర్శన ారి మనోభీష్టాలను నెరవేరుస్తూ ఉంటాడు. ఆతడే సతులకు పతి రూపాన అనుగ్రహిస్తూ ు. కళ్యాణ వాంఛ కల నారీమణి పతినే పరమ పతిగా భావించి సేవించాలి. తద్వారా మనోభీష్టాలన్నీ నెరవేరుతాయి. సతికి ప్రియమైన పరమాత్మయూ కూడ పతియే. నన్ను భక్తుంతో సేవించినావు. పతివ్రతకు అసాధ్యమూ, దుర్లభమన్న దేదీ లేదు. కనుక కావల ిని అడుగు.' అన్నాడు కశ్యపుడు.

పతి పలుకు లాలకించి దితి ముదిత చిత్తయై మనోగతాన్ని వ్యక్తం చేస్తూ – 'ప్రభూ, ంద్రుడు హరిని అండగా చేసుకుని శూర వీరులైన నా ప్రియ పుత్రులను యిద్దరినీ చేయించాడు. మీకు నాపై అనుగ్రహమే ఉంటే – ఇంద్రుణ్ణి జయించ గలట్టి – వావు మారుణ్ణి ప్రసాదించండి.' అని అర్థించింది.

సతి అయిన దితి అభీష్టాన్ని ఆలకించిన కశ్యప మహర్షి విచారంగా – అరెరే! ఇప్పుడు ధర్మ సంకటంలో చిక్కుకున్నానే. నారీ రూపంలో మహా మాయ నన్ను ఆకర్షించి స్వాధీ సుకున్నది. ఇంద్రియ సంబంధ భోగాదులు సుఖమని భావించినాను. హీనాతి హీనమైన కు లోనైపోయాను. నాకు నరకమే సిద్ధిస్తుంది. సహజాత సిద్ధ మార్గాన, గామిని అయిన ఏ దోషమూ అంటదు. ఇంద్రియ లోలుడనై పరమార్థాన్ని పోగొట్టుకుని మూఢుడనై నేనే నిందించుకుంటున్నాను. నారీ స్వభావాన్ని గ్రహించగలవారు లేరు. స్త్రీల వదనాలు శర వికసిత సుందర కమలంలా ఉండ, వారి పలుకులు తేనె లొలుకుతూ, అమృత సమంగా యి. హృదయం క్షీర ధారా సమంగా ఉంటుంది. యదార్థానికి 'స్త్రీ' ఎవ్వరినీ ప్రేమించదు. పుత్ర, సోదరులు అన్న భేదం లేకుండ ఎవరినైనా అంతం చెయ్యగలదు. కానీ నే నీమెకు ం చేశాను. అది సత్యమై తీరాలి. మహేంద్రుడు అంతం కారాదు. ఇటు యీమె అభీష్టం గాలి.' అని మనసా భావించి భార్యతో – 'ప్రియురాలా! నీ అభీష్టం నెరవేరును గాక, అందుకూ నియమం ఉంది. దానికి బద్ధురాలవై నువ్వు ఓ సంవత్సర కాల పర్యంతం అనుష్ఠించాలి. అది సక్రమంగా విధి పూర్వకంగా సాగితే నీ గర్భాన ఇంద్ర విజేత ర్భవిస్తాడు. వ్రతంలో మాత్రం ఎట్టి లోపం కలుగరాదు. వ్రత భంగ మయితే మాత్రం క ఎట్టి దశలోనూ నెరవేరదు. ఏమంటావు?' అని ప్రశ్నించగా దితి బదులు పలికింది – '! నేను మీరు చెప్పే వ్రతాన్ని ఆచరిస్తాను. విధి, ప్రతి షేధాలతో కూడిన తద్వ్రత్వాన్ని పదేశించండి. వ్రతభంగ కారణాలను కూడ వివరిస్తే నేను సావధానవై వ్యవహరిస్తాను.'

ఉపర్యుక్త రీతిని అర్థించిన దితికి కశ్యప మహర్షి వ్రత నియమాలు వివరిస్తూనాడు – ఏ జీవినీ త్రికరణాలలో దేనిచేతనూ హింసించ రాదు. దూషించరాదు, శపించ కూడదు, ం పలుకరాదు. నఖ, కేశాలు ఖండింపు కోరాదు, అమంగళ వస్తువులను స్పృశించ రాదు. మునిగి స్నాన మాచరించకూడదు. క్రోధం పనికిరాదు. దుష్ట సాంగత్యం పనికిరాదు.

వస్త్రాలనూ, మాల్యాదులనూ. పరులు వాడిన వస్త్రాలను ధరించ కూడదు. ఉచ్ఛిష్ట, మాంస నిర్మిత, శూద్ర హస్త, రజస్వల చూసిన – అన్నాన్ని భుజించరాదు. దోసి లిపానం చెయ్యరాదు. ముఖ ప్రక్షాళన రహితంగా, ఆచమించకుండ, సంధ్యా సమయాన రబోసుకునీ, సింగారించుకో కుండాను, వాఙ్మియమం లేకుండాను, ఉత్తరీయ రహితం బయటకు పోరాదు. పాద ప్రక్షాళన రహితంగా, అపవిత్రుడై, తడి కాళ్ళతోనూ శయ ను. పశ్చిమోత్తర దిశలలో శిరస్సు ఉంచి శయనించ కూడదు. ఇవి సర్వదా నిషేధాః స్యపై పరునితో నిద్రించ రాదు. ప్రాతః సాయం వేళల్లో దిగంబరంగా నిద్రపోరాదు. టినీ పరత్యజించి సదా పవిత్రుడవై ఉండాలి. తెల్లటి, శుభ్ర వస్త్రాలను ధరించాలి, చిహ్నాలు అలంకరించుకోవాలి. ప్రభాత వేళలో మేలుకొని గో, బ్రాహ్మణ పూజ చేసి లక్ష్మీ నారాయణులను ఆరాధించాలి. తరువాత పుష్పమాల, చందన, సుగంధ ద్రవ్యా వివిధాభరణాలనూ తెచ్చి వాటిని సువాసినీ స్త్రీలకు అర్పించి పూజించాలి. భర్తను ఆరా స్తూ – పతి తేజస్సే నా గర్భమందు వర్ధిల్లు తూన్నదని ధ్యానిస్తూండాలి. దీనికి న' మని పేరు. ఈ వ్రతాన్ని ప్రమాదం లేకుండ నువ్వు ఆచరించ గలిగితే ఇంద్ర డైన పుత్రుడు లభిస్తాడు.'

భర్త ఉపదేశాన్ని ఆలకించిన దితి దృఢ నిశ్చయంతో సంసిద్ధురాలయింది. మనస్విని ఆమె కశ్యప మహర్షికి ప్రణమిల్లి ఆయన అనుమతి తీసుకుంది. భర్తృ వీర్యాన్ని గో ధరించి అతడు ఉపదేశించిన నియమాలను సునాయాసంగా పాలించ సాగింది.

మహేంద్రుడు సవతితల్లి అయిన దితి అభిప్రాయాన్ని గ్రహించాడు. తాను ప్రమాదం బయట పడాలని రక్షణకై కపట వేషంతో వచ్చి ఆశ్రమంలో దితిని సేవించ సాగాడు. ష్ప, కందమూల, కుశ, సమిధ, పత్ర, జలాదులూ, మృణ్మయ పాత్రాదులూ–సకాలానికి స్తూ ఆమెకు అందిస్తూన్నాడు. అతడు ఆమె వ్రత విధానాన్ని ఎప్పటి పరికిస్తూన్నాడు. దితి ఎప్పుడు వ్రతానుష్ఠాన విషయంలో పొరబడుతుందో? అప్పుడు ప వచ్చునని ఎదురు చూస్తూన్నాడు. నిరంతరం తీవ్ర దృష్టితో పరిశీలిస్తూన్నాడు. కానీ వతానుష్ఠానంలో ఎట్టి లోపమూ కానరావడం లేదు. అయినా మహేంద్రుడు ఆమెను నే ఉన్నాడు. భవిష్యత్ ప్రమాదం నుండి ఎలా బయట పడడమా? అని తీవ్రంగా

స్తూనే ఉన్నాడు. వ్రత పాలన కారణంగా దితి శరీరం క్రమంగా దుర్బలం కాసాగింది. కూడ ఆమెను మోహ సాగరంలో ముంచివేశాడు. ఓనాటి సాయం సమయంలో దితి హస్త, పాదాలు ప్రక్షాళన చేసికోకుండ నిద్రపోయింది. యోగ శక్తి సంపన్నుడైన ంద్రుడు సావకాశాన్ని చూసి ఆనందంగా యోగశక్తితో దితి గర్భంలో ప్రవేశించి హేమ గా ప్రకాశించునట్టి ఆ గర్భాన్ని సప్త భాగాలుగా వజ్రాయుధంతో ఖండించి, మరల ఆ ఖండాలను సప్తధా ఖండించి వేశాడు. అలా ఖండలు ఖండలుగా మహేంద్రుడు ఖండిస్తూ వారంతా అతనికి ప్రణమిల్లి అగ్రజా! మేమంతా నీ సోదరులమైన మరుద్గణంతోని ం. అయినా మమ్మిల్ని ఎందుకు హింసిస్తావు.' – అన్న వారి పలుకుల నాలకించిన శచీ మరుద్గణములారా! భవిష్యత్తులో మీరంతా నాకు పార్షదులై తేజరిల్లి పోతారు.' అని ం చెప్పాడు.

పరీక్షిన్నరపాలా! అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వల్ల నీ కెట్టి అరిష్టం కలుగ శ్రీహరి అనుగ్రహం వల్ల దితి గర్భం ఖండ ఖండాలుగా వజ్రం చేత నరుక బడినా వారు చెందలేదంటే ఆశ్చర్యపడ నవసరం లేదు. ఏకమాత్ర పర్యాయం శ్రీమన్నారాయణ భగవా స్మరించినంత మాత్రాన అట్టి వాడు హరి సముడవుతూండగా కొద్ది రోజులు తక్కువగా ప్పర కాలం దితి శ్రీహరిని ఆరాధించడం వల్ల ఆమె గర్భం అమరత్వాన్ని పొందింది. ఆ తొమ్మండుగురూ మరుద్గణ నామంతో వ్యవహరింపబడుతూ ఇంద్ర సమేతంగా యాభై గా ఖ్యాతి గాంచినారు. మహేంద్రుడును సవతి తల్లి కుమారులయందు వైర భావాన్ని చి మైత్రీ భావంతో చరిస్తూ వారిని కూడ సోమపానార్హత కల వారినిగా స్వీకరించాడు.

దితి కనులు తెరిచింది. అగ్ని వలె ప్రకాశించే నలభై తొమ్మండుగురు కుమారులు ఇంద్ర గా సోమ పానార్హత కలవారిని అగ్ని సమంగా భాసిల్లు నట్టి వారిని చూసి పరమానందం – 'పుత్రా! నేను అదితి తనయులను అంతం చేసే ఏకమాత్ర పుత్రుడు కావాలని కఠిన గాలనచేయ – నలభై తొమ్మండుగురు జన్మించారు. ఇందలి రహస్యం నీకు తెలిస్తే ప్పు' అంది.

'మాతా! నువ్వీ సంకల్పంతో యీ కఠిన వ్రతానుష్ఠానం చేస్తున్నావని నేను ఆదిలోనే

ంచినాను. నాకు ప్రమాదం కలగకుండ ఉండాలని కపట వేషంతో నిన్ను సేవిస్తూ వ్రతా
వేళలో – నీ లోపాలను అన్వేషిస్తూన్నాను. అట్టి అవకాశం లభించగానే నీ గర్భంలో
ంచి యోగశక్తితో వజ్రాయుధంతో నీ గర్భాన్ని 49 ఖండాలుగా క్రమంగా ఖండించాను.
్భ ఖండాల నుండి నలభై తొమ్మిది మంది కుమారులు ప్రభవించారు. అది చూసి నువ్వు
శ్రీహరి ఆరాధనా ఫల ప్రభావమని గ్రహించినాను. నిష్కామ దృష్ట్యా శ్రీమన్నారాయణ
ప్రార్థించే వారికి సాధారణ వస్తువులు లభించడంలో ఆశ్చర్యం లేనే లేదు, వాసుదేవతారాధన
మోక్షమే లభించు చుండగా ఇది ఓ విషయమా ?

జగదీశ్వరుడైన శ్రీహరి సర్వ జీవారాధ్యుడు. సర్వాత్మ స్వరూపుడు కూడ అతడే.
ప్రసన్నుడయితే – భక్తునికి వశుడవుతాడు. ధీశాలి అయిన వాడు హరి చింతనా తత్పరు
తే కానీ విషయ వాంఛలను ఎందులకు కోరుతాడు ? అమ్మా ! సర్వ విధాలా నువ్వు పూజ
ాలవు. విషయ వాంఛ లన్నవి నరకాదులయందు కూడ లభిస్తాయి. మూఢుడనై నేను
్రమే చేశాను నన్ను క్షమించు, నిర్భిన్నమైన నీ గర్భం ఖండ ఖండాలై పునః జీవించడం
ప్రదంగా ఉంది.' అని పలికిన మహేంద్రుని విశుద్ధ భావానికి దితి మహానందం చెందింది.
దగ్గర సెలవు తీసుకుని మహేంద్రుడు అమర ధామానికి వెళ్ళిపోయాడు. రాజా ! మంగళ
ైన మరుద్గణ జనన వృత్తాంతం కళ్యాణ దాయక మయింది.' అని శుకమహర్షి మౌనం
ు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-6 — అధ్యాయం-19

### పుంసవన వ్రతానుష్ఠాన విధానము.

'శుకమునీంద్రా! పుంస వన వ్రతానుష్ఠాన విధానాన్ని సవిస్తరంగా నాకు చెప్పండి.' డిగిన పరీక్షిత్తుకు శుక మహర్షి ప్రసన్నంగా చెబుతూన్నాడు :– 'రాజా! సర్వాభీష్టాలనూ ్చ నట్టి పుంసవన వ్రత విశేషాలు ఆలకించు. సతి తన పతి ఆదేశానుసారం, మార్గశిర ాద్యమినాడు యీ వ్రతారంభం చెయ్యాలి. ఆదిలో మరుద్గణ జన్మ గాథను ఆలకించి ్ఞాదేశానుసారం నిత్యం ప్రాతర్వేళలో లేచి నిత్య కృత్యాలు నిర్వర్తించుకుని స్నానసం వళ వస్త్రధారణా నంతరం అలంకారాలు ధరించి ఏమీ తినకుండ లక్ష్మీ నారాయణు లను ంచాలి. తరువాత యిలా ప్రార్థించాలి. ప్రభూ! పూర్ణ కాముడవైన నువ్వు ఎవరి దగ్గర గ్రహించవలసినది లేదు. సర్వ విభూతులకూ నువ్వే నాథుడవు. సర్వ సిద్ధి స్వరూపుడవైన పదే పదే నమస్కరిస్తూన్నాను. మదీయారాధ్య దేవా! భవదీయ కృప, విభూతి, మహిమ వీర్యాది శక్తి గుణ సంపన్నుడవు కావడం వల్లనే నువ్వు భగవానుడ వని డు తూన్నావు. సర్వ శక్తి సంపన్నా! నీ కివే నా ప్రణామాలు. లక్ష్మీ మాతా! అర్ధాంగివీ, మహా మాయా స్వరూపిణివీ, భగవంతుని సర్వ గుణాశ్రయ భూతవూ జగజ్జననీ! నువ్వు నాకు ప్రసన్నురాల వయ్యేదవు గాక! నీకు నేను

ను.' అంటూ లక్ష్మీ నారాయణులను స్తుతించి తరువాత ఏకాగ్రి భావంతో – 'ఓం భగవతే మహా పురుషాయ, మహాను భావాయ, మహా విభూతి పతయే స్వాహా, మహా భిర్భవిముహరాణి, ఓంకార స్వరూప, మహానుభావ, మహా విభూతి పతి అయిన త్తమునకు, ఆతని విభూతి సత్వస్వానికీ ప్రణమిల్లి నేను పూజోపహారాలను సమర్పి ను. మంత్రాల ద్వారా స్థిర చిత్తంతో శ్రీహరి భగవాని ఆవాహన చేసి అర్ఘ్య, ఆచమనీయ, స్నాన, వస్త్ర, యజ్ఞోపవీత, ఆభరణ, గంధ, పుష్ప, ధూప, దీప

్యదుల ద్వారా అతనిని అర్చించి నైవేద్య శేషంతో 'ఓం నమో భగవతే మహా పురుష మహా విభూతి పతయే స్వాహా!' మహైశ్వర్యాధిపతీ, పరమాత్మా, పురుషోత్తముడూ భగవానునకు ప్రణామాలు. 'అంటూ అట్టి భగవంతునికి హోమం చేస్తూన్నాను,' అని గో ద్వాదశ హోమాలు చెయ్యాలి.

సర్వాభీష్టాలనూ నెరవేర్చే వారు — లక్ష్మీ నారాయణులే కావడం వల్ల — నిత్యం లక్ష్మీ ణులనే అర్చించి భక్తి భావంతో సాష్టాంగ ప్రణామం చేసి తరువాత దశ పర్యాయాలు ్త్రాన్ని జపించి ఆ దేవ దేవులను యిలా స్తుతించాలి — 'ఓ లక్ష్మీ నారాయణులారా! వ్యాపకులైన మీ రుభయులూ విశ్వ కారణులై ఉన్నారు. మీకు కారణమున్నది ఏదీ లేదు. ! లక్ష్మీ దేవియే నీ మహా మాయా శక్తియై తేజరిల్లుతూన్నది. అవ్యక్త ప్రకృతి అని ు పిలువబడుతూన్నది. ఆమెను అధిగమించడం అసాధ్యమే. మహా మాయాధీశ్వరా! పురుషుడవూ, యాగ స్వరూపుడవూ, నీవే. యాగ క్రియలన్నీ నీ స్వరూపాలే. యాగభోక్తవు కియలన్నీ నీ వల్ల నే ప్రభవిస్తూన్నాయి. లక్ష్మీ దేవి త్రిగుణాల అభివ్యక్తం. అభివ్యక్తస్వరూ సేవాడవు నువ్వు. భోక్తవూ నీవే. సర్వ ప్రాణులకూ ఆత్మ రూపుడవూ నువ్వే. లక్ష్మీ దేహ ాలు, ఇంద్రియ, అంతఃకరణాది రూపాలు కూడ లక్ష్మీ రూపాలే. లక్ష్మీ నామ రూపాత్మక వాసుదేవా! నువ్వు నామరూపాలను ప్రకాశింప జేసే వాడవు. వాటికి ఆధార మూర్తివి ువే, ప్రభూ! పవిత్ర కీర్తిమంతా! జగత్రయ వాసులకు వరాలను ప్రసాదించే మీరే నా ష్టాలనూ నెరవేర్చెదరు గాక!" అని పరమ వరదులైన లక్ష్మీ నారాయణులను స్తుతించి ్యదులు అర్పించి ఆచమించి, పూజించి భక్తి భావంతో పరమాత్మను స్తుతించి యాగావశేష ును ఆఘ్రాణించి పునః భగవంతుని సేవించాలి. తరువాత పతినే ప్రత్యక్ష భగవానునిగా ప్రేమ భావంతో అతనికి ప్రియమైన వస్తువులను అర్పించి సేవించాలి. పతి కూడ సతికి వస్తువులను యిస్తూ చిన్న పెద్ద పనులలో సహకరించాలి. భార్యాభర్తలలో ఎవరు ఏ పవి ఫలం యిరువురికీ సమంగా లభిస్తుంది. రజస్వల వేళలో భార్య యీ పూజ చేయ రాని భర్తయే సావధానుడై యీ పూజాదులు చేసి పరమాత్మను స్తుతించాలి. ఇదియే విష్ణు ు. ఈ వ్రతాన్ని ఆరంభించునట్టి వారు నిత్యం పుష్పమాలలూ, చందన భూషణాదులతో ోత్తములను, సువాసినీ స్త్రీలనూ కూడ ఆరాధించాలి. విష్ణు పూజ విధిగా చెయ్యాలి. తరు

ష్ణు ధామంచేరినట్లు భావన చెయ్యాలి. తరువాత నివేదిత ప్రసాదాన్ని సేవించాలి. సాధ్వి
స్త్రీ సంవత్సర కాల పర్యంతం వ్రతానుష్ఠానం చేసి సంవత్సరాంతంలో మార్గశిర అమా
ఉపవాసాది నియమాలతో ఉద్యాపన పూర్తి చెయ్యాలి. నాటి ప్రాతఃకాలంలో నిత్య
నంతరం శ్రీహరిని ఆరాధించి అగ్నిని ప్రతిష్ఠించి పాయసాన్నంతో ద్వాదశ హోమాలూ
ాసురోత్తములూ, సువాసినీ స్త్రీలూ వీరి పూజలను స్వీకరించిన తరువాత బ్రాహ్మణాశీ
న్ని పొంది అప్పుడు భుజించాలి. అందులో ఆదిలో ఆచార్యునకు భోజనం పెట్టాలి. తరు
ఘృత మిశ్రిత పాయసాన్నాన్ని స్వయంగా భర్త భార్యకు పెట్టాలి. ఆ ప్రసాదాన్ని
నంత మాత్రాన స్త్రీకి సత్పుత్రుడుదయించుటయే గాక సౌభాగ్యం కూడ వర్ధిల్లుతుంది.

శ్రీహరి సంబంధమైన యీ పుంసవన వ్రతాన్ని అనుష్ఠించు నాడు అట్టి వారి సర్వాభీ
నెరవేరుతాయి. దీనిని ఆచరించిన నారీమణికి సౌభాగ్య సంపదలూ, సత్కీర్తి, సత్సంతా
గృహాదులూ, దీర్ఘాయుర్దాయం కల భర్తా లభిస్తారు. కన్య యీ వ్రతాన్ని ఆచరించ
సర్వ సద్గుణ సంపన్నుడైన భర్త లభిస్తాడు, విధవలు దీనిని ఆచరిస్తే వైకుంఠం
స్తుంది. కలిగిన సంతానం నశిస్తూంటే అట్టి స్త్రీకి దీర్ఘాయుర్దాయం కల పుత్రులు కలుగు
అభాగ్యులు సౌభాగ్య సంపన్న లవుతారు. దీని వల్ల కురూపి సుందరరూపి అవుతాడు.
ఆరోగ్యం లభించడమే గాక ఇంద్రియ శక్తీ, బలమూ కూడ లభిస్తాయి. మాంగళిక
ల యందు యీ పుంసవన వ్రత విధిని ఉపదేశించే అధ్యాయం పఠిస్తే పితరులు తృప్తి
రు. వారి సంతృప్తి వల్ల యజమాని మనోభీష్టాలు నెరవేరుతాయి. తత్సమయంలోనే
భోక్తలైన లక్ష్మీ నారాయణులు ప్రసన్నులై వ్రత పాలన తత్పరులకు సర్వాభీష్టాలనూ
స్తారు.' అని శుక మహర్షి మౌనం వహించాడు.

షష్ఠ స్కంధం సమాప్తము.

— 0 —

శ్రీకృష్ణ పరమాత్మనే నమః.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-1

### నారద, ధర్మరాజుల సంభాషణ; జయ విజయుల గాథ.

పరీక్షిన్మహారాజు భాగవత కథా శ్రవణ కుతూహల మానసుడై అడుగు తున్నాడు. శుక దా! భేద భావ రహితుడైన భగవానుడు సమదృష్టి కలవాడే కదా! సర్వ ప్రాణి కోటికి ర్కీ, సుహృదుడూ అయిన భగవంతుడు శత్రు మిత్ర భేద రహితంగా ఉండాలి కదా! మహేంద్రునకు మిత్రుడై రాక్షస సంహారం చేసి స్వర్గ రాజ్యాన్ని అతనికి ప్రసా ంలో ఆతని పక్షపాత స్వభావం గోచర మవుతూన్నది. పరిపూర్ణుడూ, కళ్యాణ స్వరూ అయిన ఆ శ్రీహరి అమరులతో యిచ్చి పుచ్చుకోవడం కానీ, నిర్గుణుడే కావడం వల్ల ుకు శత్రువు కావడం కానీ ఆతని కుండకూడదు కదా! సమదృష్టి గల శ్రీహరి దేవుడు లను అంతం చెయ్యడమూ, అనుచరులను అన్ని వేళలా సంరక్షించడమూ తగనిదే కదా! దభావం ఆ దేవ దేవునికి కలగడంలో కారణం ఏమిటి? ఈ విషయంలో నాకు కలిగిన శనికి సముచిత సమాధాన మిచ్చి కరుణించండి.'

పరీక్షిత్తు సందేహానికి శుక మునీంద్రులు బదులు పలుకుతూన్నారు. 'రాజా! నీ సందేహం పనీయమైనదే. అత్యద్భుత పావన లీలలతో లోక కళ్యాణాన్ని చేకూర్చే భగవద్గాథలు ' ఆలకించి మననం చేసుకోవలసినవే. పఠన, శ్రవణ, మననాదుల మాత్రంచే ప్రహ్లా పరమ భాగవతోత్తముల గాథలు నీ సందేహ నివారణకు కారణా లవుతాయి. పరమ పావన గాథలను నారదాదులు గానం చేస్తూ జగత్రయాన్ని పునీతం చేస్తూంటారు. ఆ నేను నీకు వినిపిస్తూన్నాను. ప్రథమంలో నా పూజ్య జనకులైన వ్యాసుల వారికి ప్రణ ప్రహ్లాద చరిత్ర చెబుతాను విను.

'పరీక్షి న్నరపాలా! భగవానుడు జననాది రహితుడూ, నిర్గుణుడూ, అవ్యక్త ప్రకృతి కన్న
మైనవాడూ, అయి కూడ, భగవానుడు మాయా గుణాలను స్వీకరించి చంపేవాడూ, చచ్చేవాడు
ై బాధ్య బాధక భావాన్ని — పరస్పర విరోధ భావాలను సయుతం స్వీకరిస్తూ ఉంటాడు. త్రి
ు ప్రకృతికి సంబంధించినవే కానీ భగవంతునకు సంబంధించినవి మాత్రం కావు. గుణాతీ
వాడు పరమాత్మ. ఒకే కాలంలో యీ గుణాలు క్షీణించడం కానీ, వర్ధిల్లడం కానీ జ
పరమాత్మ ఆయా కాలాలలో ఆయా గుణాలను స్వీకరిస్తూంటాడు. సత్త్వ గుణం వర్ధిల్లి
— దేవతలకూ ఋషులకూ రజోగుణం వర్ధిల్లిన సమయంలో దైత్యులకు తమోగుణ
గిపోయిన వేళలో యక్ష రాక్షసాదులకు జయ పరంపరలు సిద్ధిస్తూంటాయి. భగవల్లీలలో యి
జంగా జరిగిపోతూ ఉంటుంది. సర్వ వ్యాపకాగ్ని కాష్ఠాదులలో ఉండి కూడ ప్రత్యక్ష
. కానీ ఆ కాష్ఠాదులనే మథన చేస్తే అగ్ని గోచరిస్తుంది. అట్టే పరమాత్మ
వర విశ్వ వ్యాపకుడై ఉండీ కూడ ప్రత్యక్షం కాడు. కానీ మనన శీలుడైన
హృదయాన్ని మథించ గలిగితే — భిన్న వస్తు సర్వస్వాన్ని నిషేధించి స్వహృదయ
వే సర్వాంతర్యామియైన భగవంతుని దర్శించ గలుగుతాడు. తనకై పరమాత్మ అనేక
దేహాలను సృజించ సంకల్పించు వేళ నిజ మాయా ప్రభావంతో రజో గుణాన్ని వేరు చేస్తాడు.
ంలలో తాను రమించ దలచు క్షణంలో సత్త్వ గుణాన్ని సృజిస్తాడు. శయనించ సంకల్పిం
న వేళతో తమో గుణానికి ఆశ్రయ మిస్తాడు. సత్య సంకల్పుడైన ఆ సర్వేశ్వరుడే
త్తికి ఆశ్రయ భూతమై, నిమిత్త కారణమైన ప్రకృతి పురుషులకు ఆశ్రయమూ సహకారి
న కాలాన్ని సృజిస్తాడు. భగవంతుడు కాలాధీనుడు కాక కాలాన్ని స్వాధీనంలో ఉంచు
డు. ఆ భగవానుడు సత్త్వ గుణాన్ని వర్ధిల్ల జేయు నాడు అమరుల బలం వర్ధిల్లుతుంది.
డే శ్రీహరి దేవశత్రువు లయిన రాక్షసులను అంతం చేస్తాడు. యదార్థానికి అతడు సర్వ
తే.

ఈ విషయమై మీ పితామహుడైన ధర్మరాజు రాజసూయ యాగ వేళలో ప్రశ్నించగా
దేవర్షి ఆతనికో గాథ చెప్పాడు. దానిని నేను నీకు చెబుతాను సావధానంగా విను. రాజ
యాగ సమయంలో శ్రీ కృష్ణదేవునకు జరిగే అగ్రపూజా సమయంలో వ్యర్థంగా కటువుగా
న శిశుపాలుడు పాప ఫలంగా సుదర్శన చక్రానికి బలి అయి పోయాడు. వాడు వెంటనే
వ పరబ్రహ్మలో లీనమై పోయాడు. తత్సమయంలో నారద దేవర్షి కూడ అక్కడే

ు. ఆ సంఘటనకు ధర్మరాజు మహాశ్చర్యం చెంది మహర్షి జన పరివేష్టితుడై ఉన్న దేవర్షి ని తిలకించి — 'మహాత్మా! వాసుదేవునిలో ఐక్యం కావాలంటే మహత్తర తపస్వు వారికే అసాధ్య మవుతూ ఉంటే శ్రీకృష్ణ ద్వేషియైన యీ శిశుపాలుడు ఆ దేవ గో ఐక్యమవడం చూస్తూ ఉంటే మహాశ్చర్యంగా ఉంది. పురాతన కాలంలో భగవంతుని ది దూషించిన వేన రాజును ఋషులు నరకానికి పంపినారు. ద్వేషంతో శిశుపాలుడు భగ లో ఐక్యం కావడమూ, అదే భావం కల వేనుడు నరకం చేరడమూ పరస్పర విరుద్ధంగా ఇందలి రహస్యాన్ని తెలుసుకోవాలని మే మందరం కాంక్షిస్తూన్నాము. జన్మించినది పాపాత్ములైన శిశుపాల దంత వక్త్రులు కృష్ణ నిందలోనే లగ్నమై పోయారు. అట్టి హ్వలలో కృష్ణా, అధరాలలో బొల్లి బయలు దేరాలి, శిశుపాల, దంత వక్త్రులు విధిగా చేరాలి. కానీ చూస్తూండగా వారు పరమాత్మతో లీనం కావడానికి కారణాన్ని వివ . వాయు ప్రహారిత కోమల లతా సదృశంగా నా మనస్సు సందేహంతో కొట్టు మిట్టు న్నది, సర్వజ్ఞులైన మీరే నా యీ సందేహాన్ని తీర్చాలి. నా యందు కరుణించి నా న్ని దూరం చెయ్యండి.' అని అర్థించగా నారద దేవర్షి సభాసదు లందరూ వినగలిగే ంభీరంగా భాషించ సాగాడు :—

పాండవాగ్రజా! ధర్మరాజా! సత్కార, తిరస్కార, నిందాస్తుతు లన్నవి దేహ సంబంధ కానీ ఆత్మకు సంబంధించినవి మాత్రం కావు. ప్రకృతి పురుష వివేక జ్ఞానం లేకపోవడం ేర కల్పన జరిగింది. శరీరమే 'తాను' అన్న భ్రాంతి కలిగిన నాడు — సుఖ దుఃఖ షాదులకు కారణ మవుతుంది. ఏ దేహాభిమానంతో మానవు డుంటాడో అది వధింప గో తానే వధింపబడినట్లు మానవుడు భావిస్తాడు. అద్వితీయుడూ, సర్వాత్ముడూ అయిన ునియందు సామాన్యులవలె శరీరాభి మానం ఉండదు, అతడు జీవులను శిక్షించడం వారి కోసమే కానీ క్రోధ, ద్వేషాదుల వల్ల మాత్రం కాదు, అట్టి దశలో అతనిలో హింసా ఎలా సిద్ధిస్తుంది? భేద భావ రహితుడైన ఆ దేవ దేవునియందు వైర, స్నేహ, కామ ులలో ఏ భావంతో నైనా మనస్సును లగ్నం చేయ గలితే ఆతడు విధిగా అనుగ్ర . భ్రమరం కీటకాన్ని తెచ్చి రంధ్రంలో ఉంచి దాని ముఖం దగ్గర 'ఝుం ఝుం' అని మంగా నాదం చేస్తూ ఉంటే అది భ్రమర రూపాన్ని పొందుతుంది. అట్లే శ్రీహరి దేవుడు

గృహీత దేహుడై మానవ వేషంలో సంచరిస్తున్నా సర్వ శక్తి సంపన్నుడైన వాసుదేవుడే కృష్ణుడు కావడం వల్ల వైర భక్తితో శిశుపాలుడు అహోరాత్రులు అతనినే చింతిస్తూ పాప రహితుడై — పరమాత్మలో లీనమైన వాడు శిశుపాలుడే కాదు అనేకమంది ఉన్నారు. కామంతో, ద్వేషంతో, భయంతో, స్నేహం వల్ల మనస్సును కృష్ణ దేవాయత్తం చేసుకుని పాప దూరులై పరమాత్మను పొందారు. అనన్య భక్తి భావంతో ప్రేమ వల్ల గోపికలూ, భీతిచేత కంసుడూ, వైర భావంతో శిశుపాల దంత వక్త్రాదులూ, బాంధవ్యంతో యదువంశీయులూ, స్నేహంతో మీవారూ, భక్తిచే మహర్షులమైన మేమూ పరమాత్మ యందు మనస్సును లగ్నం చేశాము. వేనుని విడనాడితే పై అయిదు తరగతుల వారూ భగవంతునియందు లగ్నమై చిత్తాలు కలవారు. ఈ అయిదు తరగతులకు చెందిన వారిలో వేనుడు లేడు. ఏ విధంగానూ వాని మనస్సు లగ్నం కాలేదు. ఏ మార్గంలో నైనా మనస్సు భగవంతునిలో లగ్నం కావడమే దీని సారాంశము. ధర్మ నందనా! విప్ర శాపం వల్ల విష్ణు పార్షదులైన జయ విజయులే, శిశుపాల దంత వక్త్రులుగా జన్మించినారు.

'దేవర్షీ! విష్ణు పార్షదులను సయితం పదవీచ్యుతులను చేయగల సమర్థు లెవరు? వారిని శపించడానికి గల కారణ మేమిటి? విష్ణు పార్షదులు సయితం జనన మరణ జంజాటంలో చిక్కారంటే నమ్మడం కష్టంగానే ఉంది. వైకుంఠ వాసులైనవారు ప్రాకృత శరీరేంద్రియాలు లేనివారై దివ్యంగా ఉంటారని విన్నాను. అట్టి దివ్యులకు యీ ప్రాకృత దేహాదులు ప్రాప్తమయ్యాయి. ఆ యీ విషయాలను విశదీకరించండి.' అని కోరిన పాండవాగ్రజునకు నారద మహర్షి బదులు పలుకుతున్నాడు :—

'ధర్మరాజా! ఓ రోజున — సనక, సనందన సనత్సుజాత నామధేయు లయిన బ్రహ్మ మానస పుత్రులు నలుగురూ స్వేచ్ఛగా జగత్త్రయంలో సంచరిస్తూ వైకుంఠ ధామం చేరారు. విశ్వ సృష్టి కందరిలోనూ వారు పెద్దవారైనా కూడ వారు సర్వదా ఐదేళ్ళ వయస్సులో వారి వలెనే కనిపిస్తూ ఉంటారు. పైగా దిగంబరంగా వస్తూన్న వారిని తిలకించి జయ విజయులనే ద్వార పాలకులు వారిని శ్రీహరి సన్నిధానానికి పోనీయకుండ వారించడం వల్ల కుపితులై వారు — 'మూఢులారా! శ్రీమన్నారాయణ దేవుని సాన్నిధ్యంలో మీ వంటి దురహంకారులకు స్థానం ఉండ కూడదు కనుక మీరు స్వస్థాన పతనులై రాక్షసులై పోయెదరు గాక!' అని శపించగా వారు

ఠం నుండి పతను లవుతూంటే – ఆ కరుణా మూర్తులు దయతో మూడు జన్మలలో పునః వైకుంఠ ధామాన్ని పొంద గల్గెదరు గాక! అని వరాన్ని కూడ ప్రసాదించారు. వారే ్భం నుండి హిరణ్యాక్ష, హిరణ్య కశిపులుగా ప్రభవించినారు. ఈ మహా పరాక్రమ ్రు లిద్దరూ దైత్య, దానవ సంఘాలలో సర్వ శ్రేష్ఠులుగా విశేష ఖ్యాతి గాంచినారు. నాటా భగవానుడు వరాహ రూపంలో హిరణ్యాక్షునీ నృసింహ రూపంలో హిరణ్యకశిపునీ అంతం . తన పుత్రుడైన ప్రహ్లాదుని – హరినామ సంకీర్తనం చేయవద్దని శాసిస్తాడు హిరణ్య ం ఆ ద్వేషంతో క్రోధం వల్ల విష్ణుభక్తుడైన తన బిడ్డనే అంతం చెయ్యాలని అతణ్ణి అనేక హింసిస్తాడు. పరమ భాగవతోత్తముడూ, సమ దర్శనుడూ, శాంత చిత్తుడూ అయిన ని ముందు హిరణ్యకశిపుని హింసా సంబంధమైన ప్రయత్నా లన్నీ వ్యర్థమై పోతాయి క్షితుడైన ప్రహ్లాద కుమారుడు సురక్షితంగానే ఉండిపోతాడు.

అనంతర జన్మలో విప్ర శాపగ్రస్తులైన జయ విజయులే విశ్రవసునకు – కైకసీ రావణ కుంభకర్ణులై జన్మించి లోక సర్వస్వాన్నీ వేధిస్తూంటే శ్రీహరి పురుషోత్తము శ్రీరాముడుగా అవతరించి వారిని సంహరించి వేశాడు. ఆ జయ విజయులే, యిప్పుడు శిశు ంత వక్త్రులై ప్రభవించి శ్రీకృష్ణ చక్ర స్పర్శచే అంతమై పాప దూరులు కాగలిగారు. ావంతో వారు సదా సర్వదా శ్రీకృష్ణదేవునే స్మరిస్తూండడం వల్ల – వారికి తీవ్రతర న్మయత్వం వచ్చి హరిని పొంది నిజ రూపాలు ధరించి యథాస్థానమైన వైకుంఠ ధామం ' అని నారద మహర్షి చెప్పగా విని ధర్మరాజు – 'దేవర్షీ! అత్యంత ప్రేమ పాత్రు ్రుని హిరణ్యకశిపుడు ఎందులకు ద్వేషించాడు? ప్రహ్లాద భక్తుడు ఎట్టి సాధనల ద్వారా భక్తి తత్పరుడై తన్మయుడయ్యాడు? వివరించండి.' అని అర్థించాడు.

— 0 —

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-2

## సోదరుని మరణానంతరం హిరణ్యకశ్యపుడు బంధు బాంధవ సమేత అయిన మాతృమూర్తికి ధైర్యం చెప్పి ఓదార్చుట.

ధర్మరాజు ప్రశ్నకు నారద దేవర్షి బదులు చెబుతూన్నాడు – 'ధర్మ నందనా! వరాహ
గాన శ్రీహరి హిరణ్యాక్షుణ్ణి సంహారించిన తరువాత హిరణ్యకశ్యపుడు క్రోధ శోక దందహ్య
ుడై పళ్ళు పట పట లాడిస్తూ అరుణ నేత్రాల నుండి అగ్ని కణాలను వెడలగక్కుతూ
ర వీధి వైపు దృష్టిని పోనిచ్చి – 'తత్సమయంలో వాని కరాళ వదనం భూత భయం
గా ఉంది. వాని ముఖం చూడ భయావహంగా ఉంది. ఆ మహా సహలో త్రిశూలాన్ని
ని లేచి నిలబడి – ద్వి మూర్ధ, త్ర్యక్ష, శంబర, శతబాహు, హయగ్రీవ, సముచి, పాక,
ల, విప్రజిత్తి పులోమ, శకునాది దైత్య పతులను సంబోధించి – దైత్య దానవులారా!
ా నా మాటలు విని నేను చెప్పినట్లే చేయండి. మన శత్రువైన మహేంద్రుడు నా
ాధిక ప్రియసోదరుడైన హిరణ్యాక్షుని విష్ణువు ద్వారా సంహరింప జేశాడు. శ్రీహరి సురా
కు సముడె అయినా అతణ్ణి సేవించి అమరులు స్వాధీనం చేసుకున్నారు. ఆదిలో పక్ష
రహితుడూ, పరిశుద్ధుడూ అయిన శ్రీహరి యిప్పుడు మాయ నాశ్రయించి వరాహాది వివిధ
లు ధరించి సహజ స్వభావ పతనుడై పోయాడు. తనను సేవించిన వారి పక్షాన్ని బాలకు
వహించ నారంభించాడు. అతని చిత్తం స్వస్థంగా ఉండడం లేదు. నేనిప్పుడే నా శూలా
ంతో హరి మస్తకాన్ని ఖండించి వేస్తాను. అతని రుధిర ధారలతో నా సోదరుని తర్పణా
్తాను. అప్పుడు కానీ నాకు శాంతి సిద్ధించదు. మొదలు తెగిన వృక్ష శాఖలవలె – హరి
ుపోతే అతణ్ణి ఆశ్రయించిన అమరులు సునాయాసంగా అంతమై పోతారు. మీరు
ుగా భూమండలంలో వర్ధిల్లుతూన్న తపోయాగస్వాధ్యాయ వ్రత దానాది శుభ కర్మలు

ం నట్టి శ్రేష్ఠ భూసుర, క్షత్రియాదులను అంతం చెయ్యండి. ద్విజాతి వర్గం ద్వారా
ే ధర్మ కార్యాలే శ్రీహరికి మూలాలు, యజ్ఞాలే విషు స్వరూపాలు. ఋషి, పితర,
ర్వ ప్రాణుల ధర్మావనికి ఆశ్రయాలు. గో బ్రాహ్మణ, ధర్మ కర్మాదులు వర్ధిల్లే
లో వసించే వారందరినీ అంతం చెయ్యండి. పల్లె పట్టణాం అన్న భేదం లేకుండ అట్టి
లన్నిటినీ దగ్ధం చేసివేయండి.' అని ఆదేశించాడు.

పరులను హింసించి ఆనందించడం దైత్యులకు సహజాత లక్షణమే కదా! వారికి హిరణ్యా
ఆదేశాలు మహానందాన్ని కలుగజేశాయి. ఆ దైత్య దానవాదు లందరి కందరూ తమ
నికి నమస్కారాలు చేసి నేల నాలుగు చెరగులా పరిభ్రమిస్తూ వీరవిహారంతో హింసా
ఆరంభించారు. పల్లె పట్టణాలలో, గోశాల ఆరామాదులలో హింసించి వికటాట్టహాసాలు
సాగారు. పంటలను నాశనం చేశారు. ఋషాశ్రమాలను దగ్ధం చేస్తూన్నారు. కోశాగార,
ార, కృషీవలులు నివసించే గృహాదులను వ్యాపార కేంద్రాలను పదిమందికి పనికివచ్చే,
ం మిచ్చే స్థానాలను తగుల బెట్టేస్తున్నారు. మరికొందరు క్రూర రాక్షసులు వంతెనలనూ,
లనూ కూల్చివేస్తూన్నారు. గోపుర ప్రాకారాలను నేలమట్టం చేస్తూన్నారు. గంద్ర గొడ్డ
ధరించిన దానవులు కొందరు ఫల పుష్ప భరితాలైన తరువులను నరికి పారవేస్తూన్నారు.
రహితంగా దానవులు కొందరు కాగడాలనూ మండే కర్రలనూ పట్టుకుని మానవులనూ,
స్తూన్నారు. అలా దైత్య దానవాది క్రూర చిత్తులు ప్రజలను పీడించే కాలంలో యిళ్ళనూ
లు స్వర్గలోకాన్ని పరిత్యజించి మారువేషాలతో వృథ్వి మీదనే పరిభ్రమించ సాగారు.

సోదరుని మరణం వల్ల తీవ్ర దుఃఖాన్ని పొందిన హిరణ్యకశిపుడు అతనికి అంత్య
ఒ పూర్తిచేసి సోదర పుత్రులైన శకుని, శంబర, ధృష్ట భూతసంతాపన, వృక, కాలనాభ,
ాభ, హరి శ్మశ్రులనూ, మరదలైన రుషభానునూ, మాతృమూర్తి అయిన దితినీ ఉద్దేశించి
కాలానుసారం పలక సాగాడు :—

'ఆత్మ బంధువులారా! అమ్మా! వీర శూర పరాక్రమ సంపన్నుడైన హిరణ్యాక్షుని
మీరిలా దుఃఖించ కూడదు. శూరుడు యుద్ధరంగంలో వైరి వీరులకు ఎదురు నిలచి యుద్ధం
చనిపోతే ఆచంద్ర తారార్కమైన కీర్తిని పొందుతాడు. ధర్మ సత్రంలో నలుగురు ఒక

చేరి క్షణం కలిసి ఉండి తిరిగి ఎవరి దారిని వారు వెళ్ళిపోతారు. అట్లే మానవులు స్వకర్మ
లై విధివశులై కలుస్తూ విడిపోతూ ఉంటారు. యదార్థానికి ఆత్మ సత్యమై, నిత్యమై, అవి
మైనదై, విశుద్ధమై, సర్వ గతమై, సర్వజ్ఞత్వాది లక్షణాలతో కూడినదై దేహేంద్రియా
పనదైనదని తెలుసుకోండి. అయ్యాత్మ అవిద్య వల్ల దేహాదులను సృజించి భోగ సాధన
మైన సూక్ష్మ దేహాన్ని స్వీకరిస్తూ వుంటుంది. చలించు నట్టి స్వచ్ఛ జలాల్లో ప్రతిబింబించు
తరు లతాదులు కూడ సంచలిస్తూన్నట్లే, తిరుగుడు కనులకు విశ్వమంతా తిరుగుతూన్నట్లూ
చ్చునట్లూ స్థూల, సూక్ష్మ దేహ సంబంధం లేని ఆత్మకు వాటి సంబంధం ఉన్నట్లే గోచర
తుంది. శరీరంతో ఎట్టి సంబంధం లేని ఆత్మకు – శరీరమే తానన్న భావం కలగడం
ం అజ్ఞానమే కదా! ప్రియా ప్రియ వస్తువుల సంయోగ వియోగాదులు దేహాత్మ భావం
ఏర్పడడం వల్ల మానవుడు సంసార చక్రంలో పడి నలిగిపోతూ, నానా దుఃఖాలూ,
స్మృతి, అదిగా గల ద్వంద్వాలతో నవ్వుతూ ఏడుస్తూంటాడు. ఈ సర్వానికీ అజ్ఞానమే
కారణము. ఈ విషయమై – యమధర్మరాజుకూ, ప్రేత బంధువులకూ మధ్య జరిగిన
చెబుతాను ఆలకించండి.

ఉశీనర దేశాధిపతియైన సుయజ్ఞుడు విశేష ఖ్యాతి గాంచినాడు. అతడు యుద్ధంలో శత్రు
హస్తాలలో సంహరింప బడ్డాడు. చచ్చిపడియున్న ఆ రాజు శవం చుట్టూ బంధు బాంధవులు
ని ఉన్నారు. అతని కవచం ఛేదింపబడి విచ్ఛిన్నమై ఉంది. ఆభరణాదులు ఛిన్నాభిన్నమై
యాయి. శరాఘాతాలతో దేహం ఖండ ఖండలై ఉంది. శరీరమంతా రక్తసిక్త మయి
ంది. కనులు మూతలు పడిపోయాయి. క్రోధ వశుడైన ఆ రాజు తన పళ్లతో తన పెదవు
కొరుక్కున్నాడు. పద్మ సమసుందరమైన వాని వదనం ధూళి ధూసరితమై వికారంగా ఉంది.
గంలో అతని చేతులు రెండూ నరకబడి పడి ఉన్నాయి. అలా దైన్య హైన్య స్థితిలో
తమ భర్తను తిలకించి అతని రాణు లందరూ భోరున విలపించ సాగారు దుఃఖాతురలై
– 'హా! మా ప్రాణనాథా! ప్రియా! నువ్వు లేని మేము అభాగినులమే కదా! జీవించినా
కలిగే ప్రయోజన మేముంది? ఇక మేము బ్రతికీ చచ్చిన వారితో సమానులమే.' అని
బాదుకుంటూ హృదయ విదారకంగా విచారించ సాగారు. అంతతో ఆగక పొంగి పొరలి
దుఃఖంతో భర్త చరణాలపై పడి బిగ్గరగా ఏడుస్తూన్నారు. వారి కన్నీటి ధారలు వాటి

ంకుమలతో అరుణారుణాలై మృతుడైన భర్త పాదాలను ప్రక్షాళితం చెయ్యసాగాయి.
శాలు విడిపోయి చెల్లాచెదరై పోయాయి. వారు కరుణాక్రందనలు చెయ్యగా విని అక్కడ
వారు కూడ శోక సముద్రంలో మునిగి పోయారు. విధి ఎంత బలీయమైనది? విధాత ఎంతటి
కో కదా? మా నుండి మిమ్మల్ని దూరం చేసి వేశాడు. దేశ వాసు లందరకూ రక్షకులైన
ల్నే అంతం చేసి విధి మాకు తీవ్రతర దుఃఖాన్ని కలుగ జేశాడు. నాథా! మీరు మమ్మల్ని
నురాగంతో సాకుతూ, అల్పమైన మేము చేసిన సేవలను ఘనంగా ప్రశంసించే వారు.
డోలికలలో మమ్ములను ఓల లాడించే వారు. మీరు లేకుండ మేము జీవించే దెలా? మీ
వాసీలమైన మేమిప్పుడు ఏమి చేసేది? ఎక్కడకు పోయేది? మీ మార్గాన్ని అనుసరించే
లకు మాకు అనుమతిని ప్రసాదించండి." అంటూ ఆ శవాన్ని పట్టుకుని విలపిస్తూండగా
 భాగవానుడు అస్తాద్రికి ప్రస్థానించే సమయం కావచ్చింది. దహన కర్మకు శవాన్ని
సుకు వెళ్ళ నివ్వడం లేదు. వారి ఆక్రందనలను ఆలకించి స్వయంగా యమ ధర్మరాజు ఓ
రూపంలో అక్కడకు వచ్చి—"పెద్దలారా! ఎందుకిలా మీరు తీవ్రంగా దుఃఖిస్తూన్నారు. నా
మరు చాలా పెద్దలై కూడ అజ్ఞానుల వలె వ్యవహరించడం మూర్ఖత్వమే అనిపిస్తూన్నది.
బాటే అసంఖ్యాకులు జన్మించి మరణిస్తూంటారు. ఎన్నో సంఘటనలు చూస్తూ కూడ మీ
విచారించడం వింతగానే ఉంది. వచ్చిన స్థానానికే జీవుడు మరలి పోతాడన్న విషయం
లియనిది కాదు, మనం కూడ ఏదో ఓనాడు అక్కడకు పోవలసిన వారమే. అట్టి దశలో
శోకించ నేల? మీ కన్న నేను ఎన్నో రెట్లు ధన్యుడను. అయినా చిన్న నాడే నా జననీ
నన్ను విడనాడి పోయారు. అధిక శక్తి లేకపోయినా నాకు చింత మాత్రం లేదు. హైగా
ఘాతుక మృగాలు నన్నే మీ చేయ జాలకున్నాయి. గర్భంలో ఉండగా మనలను కాపాడిన
వన కాలంలో కూడ సంరక్షిస్తూ ఉంటాడు." అని పలికి జ్ఞాన బోధ చేసే ఆ బాలుడు
నుద్దేశించి — "రాణులారా! నా వచనాలను శ్రద్ధగా వినండి. ఈ సృష్టి స్థితి లయాలను
వాడు అవినాశనుడైన పరమేశ్వరుడే. ఆతనికీ విశ్వమంతా ఓ బొమ్మరిల్లు. జీవులందరూ
స్తువులే. సృష్టి స్థితి లయాలు ఆ దేవ దేవుని అమోఘ లీలలే. ఈ విశ్వ స్థిత ప్రాణి
సంరక్షించడానికీ, శిక్షించడానికీ ఆ జగత్ ప్రభువు సర్వ సమర్థుడే. కాలం అనుకూలంగా
పోయినవి పునః లభిస్తాయి. ప్రతికూలంగా ఉంటే గృహంలో భద్రంగా ఉంచినవే నాశ

ోతాయి. దైవానుగ్రహం కలవాడు అరణ్యంలో ఏకాకిగా ఉన్నా సజీవంగా ఉండగలుగు
త్లే స్వగృహంలో సురక్షితంగా ఉన్నా ననుకున్న వాడు మరణించనూ వచ్చును.

పెద్దలారా! ఈ జీవ జాలానికి జన్మ జన్మాంతర సంబ ధిత కర్మల ద్వారా జనన మర
ర్పడు తూంటాయి. కాని దేహాతీతమైన ఆత్మకు మాత్రం జనన మరణ రూప సంబంధం
మానవ మాత్రుడు తన నివాస గృహాన్ని తనకన్న భిన్నంగా చూస్తాడు. శరీరం కూడ
న్నత్వం కలదే అని గ్రహించి కూడ మోహ వశుడైన మానవుడు దానిని తనదిగా భావి
ాడు. జల వికారాలైన నీటి బుడగలు, మృణ్మయ వికారాలైన ఘటాదులూ, స్వర్ణ వికారా
భరణాలూ గోచర మవుతాయే కానీ రూపాంతరాన్ని పొందగానే బుద్బుద, ఘట, భూషణా
మయానుకూలంగా జల, మృణ్మయ, సువర్ణాదుల యందే లీనమై పోతూన్నాయి. ఆదే
పార్థివ, తైజస, ఉదకాది వికార రూపంలో పరిణమించే దేహం కూడ సమయాంతరాన
మై కాలాంతరంలో నాశనమై పోతుంది. కాష్ఠ మంతా వ్యాపించి యున్న అగ్ని యదార్థానికి
కన్న భిన్నమైన రీతిగా శరీర వ్యాప్తమై యున్న వాయువు శరీరం కన్న భిన్నంగా ఉండీ
ంబంధమూ కలిగి ఉండదు. సర్వ వ్యాప్తమై యున్న ఆకాశం—వస్తువుల గుణ దోషాలకు
గా ఉన్నట్లే సర్వ శరీరేంద్రియాదుల యందూ వ్యాపించి ఉన్న శరీరేంద్రియాదుల కన్న
పై ఉండీ నిర్లిప్తంగా ఉండి పోతుంది.

రాణులారా! మూఢులై మీరు సుయజ్ఞ నామక శరీరాన్ని గురించి యిలా విషాదగ్రస్తులు
ప్రయోజన శూన్యమే. హేతువేమంటారా? అది మీ సమక్షంలోనే పడిఉన్నది. దానిని
లకిస్తూన్నారు కూడ. దాని ద్వారా మీరు వినేదీ, చూసేదీ, పలికేదీ, అయిన ఆత్మ గతి
లేదు, ఇప్పుడది కాన రాదు. ప్రయోజన రహితంగా ఎందుకు విచారిస్తారు? వినేదీ, పలి
పాణ వాయువే అంటారా? అది పోనే పోయింది. సుషువ్యవస్థలో ప్రాణం వుండి కూడ అది
లేదు, చూడ లేదు. శరీరంలో ఇంద్రియా లన్నింటి చేష్టలకూ హేతుభూతమైన జడం
వల్ల దాని వల్ల వినడం, భాషించడం కూడ అసంభవమే. దేహేంద్రియా
ద్వారా సర్వాన్నీ చూడ గల ద్రష్ట యగు ఆత్మ సయితం దేహేంద్రియ ప్రాణాదుల
భిన్నమైనదే అని గ్రహించాలి. కానీ ఆత్మ అపరిచ్ఛిన్నమూ, సర్వ వ్యాపకమూ అయి

భూత పంచకమూ, ఇంద్రియాలూ మనస్సూ అనే వానితో కూడి సుర, నర, పశు, పక్ష్యాది
ను గ్రహిస్తూ ఉంటుంది. తన యందున్న వివేక బలం ద్వారా విముక్తిని కూడ పొందుతూ
ది. యదార్థానికి — దేహేంద్రియ ప్రాణాదుల కన్న ఆత్మ భిన్నమైనదే అయినా పంచ
పంచ కర్మేంద్రియ, పంచ జ్ఞానేంద్రియ, బుద్ధీ, మనస్సూ యీ సప్తదశ తత్త్వ
మైన లింగ దేహంతోనూ కూడి జీవు డున్నంత వరకూ కర్మ బంధితుడై ఉంటాడు. దీని
మాయా మోహితుడై పోతాడు. తద్ద్వారా అగణిత క్లేశాలు ఎదురవుతాయి. ప్రకృతి సంబం
త్రిగుణాలూ తద్గుణ త్రయ కల్పిత వస్తు సంతతీ కూడ సత్యమని భావించడమే అజ్ఞానం
ంతకు మించి ఏమీ లేదు. వాంఛల ననుసరించి స్వప్న లబ్ధ పదార్థాల వలెనే ఇంద్రియ
లైన పదార్థాలు కూడ మిథ్యా భూతాలే, కానీ సత్యాలు కావు. సత్యా సత్య వస్తు వివేకం
డు అనిత్య దేహార్థమే విచారిస్తూంటాడు కానీ ఆత్మ కోసం మాత్రం విచారించడు. అజ్ఞాని
స్తాంటాడు. అట్టి వాని స్వభావం మారడం అత్యంత కఠినమే.

ఓ అడవిలో ఓ కిరాతుడు ఉండే వాడు. పక్షుల విషయంతో విధాతయే ఆ కిరాతుని కాల
గా సృష్టించాడు. అతడు వల పన్నిన చోటులో పక్షులు అనేకంగా చిక్కుకు పోతూం
ఓ నాడు కుళింగ పక్షుల జంట విహరించే చోట ఆ కిరాతుడు వల పన్నే శాడు. అందులో
క్షి ఆ జాలంలో చిక్కుకు పోయింది. అది చూసి మగ పక్షి విచారించినదే కానీ పాపం అ
ండి ఆడ పక్షిని రక్షించ లేక పోయింది. విలపించి విలపించి అది — "అహా! విధి బలీయ
గాడు కదా! ఏమి చెయ్యాలన్నా చేసి వెయ్య గలడు. అయినా అతడు దయా రహితుడే.
ందు విశేషానురాగం గల నా సహచరి నా కోసం విచారిస్తూ కొట్టుకుంటూ ఉంటే నేనిలా
ఊరుకోవలసినదేనా ? ఇట్టి దైన్య స్థితిలో విధాత నన్ను ఉంచడం కంటె నన్నే తీసుకు
? తల్లి లేక, రెక్కలు రాక తల్లి రాకకై ఎదురు చూసే పిల్లల గురించి పదే పదే విలా
కుళింగ పక్షిని కిరాతుడు చాటు నుండి గురి చూసి కొట్టి వేశాడు. రాణులారా! మీ దశ
యింతే. మీరు కాలుని గుర్తించడం లేదు. అందుకే యిలా నెత్తీ నోరూ బాదుకుని ఏడు
రు. నూరేళ్ళు యిలా మీరు ఏడ్చినా మీ నాథుడు మీకు లభించడు." అంటూ పలికిన ఆ
జ్ఞానోపదేశ వచనాలను ఆలకించిన వారందరూ మహాశ్చర్యం పోయారు. దానితో ఉశీర నరే
ంధు బాంధవు లంతా — చరా చర విశ్వమంతా మిథ్యా రూపమనీ, అనిత్యమనీ గ్రహించ

౦. తద్రూపాన వచ్చిన సమవర్తి ఆ గాథను వినిపించి శీఘ్రమే అదృశ్యమై పోయాడు.
ని అంత్య క్రియలు నిర్వర్తించి బంధు బాంధవులు వెళ్ళిపోయారు. కనుక మీరు విచా
డి. ఈ విశ్వమందు ఎవరు ఆత్మ? తన కతీతంగా భిన్నమైన వారెవరు? తన వాడెవడు?
వాడెవడు? అజ్ఞాన కారణంగా యీ విభేదాలు కలగడంతో స్వ-పర భేద బుద్ధి సిద్ధిస్తుందే
ంత కన్న వేరే కారణ మేమీ లేదు."

దేవర్షి పలుకుతూన్నాడు — "ధర్మనందనా! పుత్రుడైన హిరణ్య కశిపుని వచనాలను అల
దితి పుత్ర వధువుతో సహా దుఃఖ నివృత్తి కలదై పుత్ర శోకాన్ని విడనాడి మనస్సును
తుని యందు లగ్నం చేసి ధ్యాన మగ్న అయిపోయింది.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-3

## హిరణ్య కశిపుడు తపస్సు చేయుట-వరాలు పొందుట.

**నారదుడు :—** ధర్మనందనా! సోదరుని మరణానంతరం అతడిలా యోచిస్తూ — 'సర్వ
కూ నేను అజేయుడనై, అమరుడనై, అజరుడ నయిన నాడు యావద్విశ్వానికీ నేనే
ప్ను అయిననాడు అమరులు కూడ నా సమక్షంలో నిలువజాలరు.' అని నిశ్చయించుకుని
గిరి సమీపానికి పోయి అక్కడ ఘోరమైన తపస్సు చెయ్యసాగాడు. ఊర్ధ్వ బాహువై
దృష్టితో పాదాంగుష్ఠ మాత్ర సహకారంలో నిలబడి అతడు తపస్సు కొనసాగిస్తూ వుంటే
జటలు భాస్కర కిరణ సమంగా భాసించ సాగాయి. హిరణ్యకశిపుడు అలా తపస్సు చేస్తూ
అమరులు పునః స్వస్థానాలను ఆక్రమించేశారు. దీర్ఘకాలం అతడలా ఘోర తపస్సు
ుంటే తపస్సంబంధమైన అగ్ని ధూమంతో బయల్వెడలి దశదిశలా వ్యాపించి ఊర్ధ్వ
లలో వ్యాపించి విశ్వాన్నే దగ్ధం చేయ సాగింది. దానికి నదులు క్షోభించగా గిరులు

ర సాగాయి. తారాగణ సహితంగా గ్రహాలు అల్లల్లాడిపోతూ గతులు తప్పుతూన్నాయి. వేడిమి దశదిశా వ్యాప్తమై పోయింది. దానికి స్వర్గవాసులు కూడ తపించ సాగారు. రించలేక వారు బ్రహ్మదేవుని సమీపించి — 'భగవన్! హిరణ్య కశిపుని తపో వేడి మేము అల్లల్లాడి పోతూన్నాము. మేమిప్పుడు స్వస్థానాలలో నిలువ లేకున్నాము. మీ యీ తాపసాగ్నికి దగ్ధం కాకముందే యీ ప్రచండ జ్వాలలను చల్లార చెయ్యి. కశిపుని మనోభీష్టం నెరవేరితే సజ్జనులు ప్రాణాలతో బయట పడలేరు.' అన్నారు.

అమరుల వచనాలను ఆలకించిన బ్రహ్మదేవుడు శీఘ్రంగా భృగు, దక్షాది ప్రజా ం వెంటబెట్టుకుని హిరణ్యకశిపుని ఆశ్రమానికి వచ్చాడు. వానిపై పుట్టలు మొలిచి, పొదలు పెరిగి ఉండడం చేత వాడు బ్రహ్మాదులకు కానరాలేదు. ఆ ప్రదేశాన్ని చూడగా క్త మాంసాదులను క్రిమి కీటకాలు భక్షించి వేశాయి, అస్థి పంజరం మాత్రమే మిగిలి మేఘాచ్ఛాదిత మార్తాండ సమ ప్రభలతో అతడు భాసిస్తూన్నాడు. వాని తపో తేజః లి యాన్ని తపింపచేయ సాగింది, అట్టి అతణ్ణి తిలకించి బ్రహ్మదేవుడు మందస్మితం చేస్తూ— ! హిరణ్యకశిపా! లే, నీకు మంగళాలు చేకూరుతాయి. నీ తపస్సు సిద్ధించింది. కనుక నే రాలు ప్రసాదించ వచ్చాను. నీ అభీష్టాలను తెలియ జెయ్యి. సంశయించకు; నీ హృదయ ంహాద్భుత శక్తిని నేను గ్రహించినాను. రక్త మాంసాలు తిని వేసినా తపోబలం వల్ల నీ లు అస్థులను ఆశ్రయించి ఉన్నాయి. ఇట్టి ఘోర తపస్సును యిదివరలో ఎవ్వరూ చెయ్య భవిష్యత్తులో కూడ యిట్టి ఘోరమైన తపస్సు ఎవ్వరూ చెయ్యజాలరు. దేవమానాను ఉలాలు కూడ పానం చెయ్యకుండ నూరు సంవత్సరాలు తపస్సు చేశావు. ఈ న్ని ధైర్యశాలురు కూడ సాధించ జాలరు. నీ మహా తపస్సుకు నేను వశుడనయ్యాను. న్నడనై నీ మనోభీష్టాన్ని నెరవేర్చడానికి సంసిద్ధంగా ఉన్నాను. మరణ ధర్మం కల నీకు న్శనం వృథా కాదు. అభీష్ట వరాన్ని కోరుకో ప్రసాదిస్తాను.' అంటూనే అతని అస్థిపంజరం కమండల భవ్యోదకాన్ని చల్లాడు. ఆ జల స్పర్శ మాత్రంచే పుట్టలో నుండి హిరణ్య ం లేచి నిలచాడు. అతని దేహం తత్సమయంలో దివ్య శక్తి బల తేజస్సులతో దృఢంగా ది, ఇంద్రియాలు శక్తివంతాలయ్యాయి, మనస్సుకు చైతన్యం కలిగింది. అవయవాలన్నీ సమంగా మారాయి. పుటం పెట్టిన సువర్ణంలా, నవయౌవ్వనాంగునిలా, అతడు లేచి నిల

కసంలో విరాజిల్లే హంస వాహనారూఢుడైన బ్రహ్మదేవుని దర్శించి మహానంద పర్శ సాష్టాంగ వందనం చేసి చేతులు జోడించి నమ్ర భావంతో, ప్రేమపూర్ణ హృదయంతో కంఠుడై, ఆనంద బాష్పాలు కనుల నుండి జల జల రాల పులకిత దేహుడై బ్రహ్మ స్తుతించ సాగాడు :-

'దేవా ! కల్పాంత వేళతో యావత్ సృష్టి కాల ప్రేరితమై, లయం కాగా ఘోరాంధ దశదిశలా వ్యాపించి ఉంటుంది. తత్సమయంలో ప్రకాశ స్వరూపుడవైన నువ్వే యీ పునః ప్రకటిస్తావు. త్రిగుణ స్వరూపమైన యీ విశ్వ సృష్టిస్థితి లయాలు నువ్వే కొన గొంటావు. నిన్నే త్రిగుణాలు ఆశ్రయించి ఉంటాయి. పరాత్పరుడవు నువ్వే. జగత్తునకు కారణుడవైన నీ స్వరూపాలే జ్ఞాన, విజ్ఞానాలు. అట్టి నీకు వందనాలు. ప్రాణేంద్రియ బుద్ధ్యాది వికారాల ద్వారా నిన్ను నీవే ప్రకటించుకున్నావు. ముఖ్యప్రాణ సూత్రాత్మ లో చరాచర విశ్వాన్ని నీ నియంత్రణలో ఉంచుకుంటున్నావు. చిత్త, చైతన్య మన దియాలకు స్వామివైన నువ్వే ప్రజా రక్షకుడవు, స్వామీ ! పంచ మహా భూతాల్నూ విషయాల్నూ, వాటి సంస్కారాల్నూ, మహత్తత్త్వ స్వరూపాలలోనూ నువ్వే సృష్టిస్తావు. ర్యు, హోతృ, బ్రహ్మ, ఉద్గాతృ రూపమైన ఋత్విజుల ద్వారా జరుపబడే యాగాలన్ను దించే వేదమే నీ స్వరూపం కాగా సర్వప్రాణులకూ ఆత్మ స్వరూపుడవైన నీకు అద్వ్యం లేవు. అపార, అనంత, అనాది సర్వజ్ఞత్వాది లక్షణాలు కలవాడవైన నువ్వే చరాచర ములో అంతర్యామి రూపంలో ఉంటావు. క్షణ, లవాది కాల విభాగం ద్వారా జీవుల ఆయు ర్ని క్షయింపజేస్తూ — నువ్వు సావధానుడవై కాల స్వరూపంలో ఉంటూ నిర్వికారుడవై టూ వుంటావు. జ్ఞాన స్వరూపుడవై, పరమేశ్వరుడవై, జనన రహితుడవై సర్వేశకూ తవై అంతరాత్మ స్వరూపంలో సర్వ వ్యాపకుడవైన నువ్వే స్వామీ ! కార్య కారణ గాది పదార్థాలన్నీ నీ స్వరూపాలే. నీకన్న భిన్నమైన పదార్థమన్నది లేదు. సమస్త కళలూ విద్యలూ కూడ నీ స్వరూపాలే. మాయాతీత బ్రహ్మవు నువ్వు. నీ గర్భంలోనే య బ్రహ్మాండం యిమిడి ఉంది. నీలోనే నువ్వు ఈ బ్రహ్మాండాన్ని వ్యక్తం చేస్తూ అభివ్యక్తమైన యీ బ్రహ్మాండం నీ స్థూల శరీరము. దీని ద్వారానే ప్రాణేంద్రియ యాలకు సంబంధించిన విషయ భోగాలను అనుభవిస్తూ వుంటావు. ఆ స్థితిలో కూడా

శ్వర్య స్వరూపమందే వుంటావు. వాస్తవానికి పరమ పురుషుడవైన నువ్వు స్థూల, ...తీత బ్రహ్మ రూపుడవు. భవదీయ అవ్యక్త రూపంతో సర్వ వ్యాపకుడవై భాసిల్లే నీ చేతనా చేతనాలు. అట్టి నీకు వందనాలు.

వరప్రదాతలలో శ్రేష్ఠుడవైన దేవా! నీ సృష్టిలో దేనివల్లా నాకు మరణం లేకుండా ...య్యి. బాహ్యాభ్యంతరాలలో, అహోరాత్రులలో, భూమ్యాకాశాలలో, ఏ శస్త్రాస్త్రాల చేత నాకు మరణం లేకుండ చెయ్యి. రణరంగంలో నా కెవరూ ఎదురు నిలువ జాలకుండా ... చరాచర జగత్తుకు నేనే ఏకచ్ఛత్రాధిపతి నగుదును గాక! లోకపాలు లందరియందూ నీ మహిమ నాలో ప్రవేశించును గాక! యోగులకు, తపోధనులకు ప్రసాదించిన అక్షయ, ...శ్వర్యాన్ని నువ్వు నాకు ప్రసాదించెదవు గాక!' అంటూ అర్థించి మౌనం దాల్చి అతను ... లోచను డయ్యాడు.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-4

### హిరణ్య కశిపుని దురాగతాలు – ప్రహ్లాదుని సద్గుణ వర్ణన :

నారద మహర్షి ధర్మరాజుకు అనంతర వృత్తాంతాన్ని అభివర్ణిస్తున్నాడు :– పాండ...! హిరణ్య కశిపుడు కోరిన వరం అసాధ్యమైనదే అయినా అతని అమోఘ తపస్సుకు ...డై బ్రహ్మ దేవుడు అతనికా వరాన్ని ప్రసాదిస్తూ – వత్సా! అన్య లందరికీ అత్యంత ...మైనవే అయినా నువ్వు కోరిన వరాలన్నీ ప్రసాదిస్తాను.' అన్నాడు. ఆ దేవ దేవుని అసత్య మవుతాయా? వరాలను పొందిన అతడు హిరణ్య గర్భుని స్తుతించి పూజించాడు. తర్వాత బ్రహ్మదేవుడు వెంట వచ్చిన ప్రజా పతులతో కలసి స్వస్థానానికి వెళ్ళి పోయాడు. బ్రహ్మ వల్ల వరాలు పొందిన హిరణ్య కశిపుని దేహం సువర్ణచ్ఛటలతో బలిష్ఠాంగాలతో భాసిల్లి

.. తపస్సు చేసినవాడే అయినా, బ్రహ్మదేవుని సందర్శించ గలవాడే అయినా సహ
రాక్షస భావావేశితుడు కావడం వల్ల తన సోదరుని సంహరించిన శ్రీహరి యందు
ం కలిగి సంచరిస్తూన్నాడు. ఆ మహా దైత్యుడు జగత్త్రయాన్ని జయించి వేశాడు.
మైె లోక పాలుర స్థానాలను ఆక్రమించి వారిని శాసిస్తూ నందన వనాది దివ్య
ర్యయుతమైన స్వర్గంలో చింతామణీ పీఠాన్ని అధిష్ఠించి విశ్వకర్మ వినిర్మిత మహేంద్ర
లో నివసించ సాగాడు. అక్కడి సర్వ సంపదలకూ అధీశ్వరుడై భాసిల్ల సాగాడు. ఆ
ంద్ర భవనం విద్రుమ సోపానాలతో మరకత మణులతో అలంకరించిన భూభాగంలో
మణులు అలంకరించిన ద్వారాలలో, వైడూర్య స్తంభాలతో, పద్మ రాగాసనాలతో పాల
నురుగ వలె తేజరిల్లే శయ్యలతో, ముత్యాల జాలరులతో అత్యంత శోభాయమానంగా ఉంది.
త్య రాసులైన అప్సర కాంతలు నూపుర ధ్వనులతో అటూ యిటూ తిరుగుతూ అక్కడి
మయ ప్రదేశంలో స్వేచ్ఛగా సంచరిస్తూ పూర్ణ చంద్ర బింబ సదృశ వదనార విందాలను
ర విశాల దర్పణాలతో చూసుకుంటూన్నారు. శూర వీర పరాక్రమ సంపన్నుడైన హిరణ్య
ు సర్వ లోకాలకూ ఏకచ్ఛత్రాధిపతియై సర్వ తంత్ర స్వతంత్రుడై విహరించ సాగాడు.
నవాదు లందరూ ఆతని పాదాలకు ప్రణమిల్లుతూ చేతులు కట్టుకుని నిలబడి ఉంటూన్నారు.
నవ వీరుడు సుగంధ భరితమైన సురను పానం చేస్తూ మదోన్మత్తుడై సంచరిస్తూన్నాడు.
రంజితాలై వాని కనులు సర్వదా జేవురించి వుంటున్నాయి. తత్సమయంలో అతనిలో
ి. మానసిక శక్తులు పరిపూర్ణంగా ఉండడం వల్ల — వాటి కతడు సిద్ధిగా గోచరమవు
డు. త్రిమూర్తులే గాక ఇంద్రాది దేవత లందరి కందరూ హిరణ్య కశిపుని ఆదేశానుసారం
న్నారు. స్వశక్తితో అతడు అమరాధిపత్యాన్ని కైవసం చేసుకోగానే నారదుడనైన నేనూ,
ను, తుంబురులతో కలసి వాని సమక్షంలో గానం చేసే వారము. అతణ్ణే గంధర్వ, ఋషి,
ద్యాధర, అప్సర సమూహాలు కూడ స్తుతించేవి. ధర్మరాజా! వర్ణాశ్రమ ధర్మపాలనతో
దక్షిణలతో కొనసాగే మహా యాగాలు చేసే తపో ధనుల ద్వారా యాయాడదే హవిర్భాగా
తానే స్వీకరిస్తూ అతడు అమరులకు అందకుండా చేస్తూన్నాడు. పృథ్వీ మండల మంతా
ధీనంలోనే ఉంది. బీజాలు చల్లకయే, దున్నకనే భూమి ఫలించ సాగింది. కోరిన వస్నీ
అంతరిక్షం నుండి లభిస్తూనాయి. ఆశ్చర్యకరమైన వస్తు జాలాన్ని అనేకంగా చూపుతూ

ం వానికి ఆనందాన్ని ప్రసాదిస్తున్నవి. అలాగే సప్త సముద్రాలూ తమ భార్యలైన నదు
లసి తమ తరంగ రూప హస్తాలతో రత్నాలను రాసులుగా అందిస్తున్నాయి. మహా
తమ సుందర సురమ్య స్థానాలను వానికి విహార భూములుగా సమర్పిస్తున్నాయి. లోక
ంందరి గుణాలూ హిరణ్య కశిపు డొక్కడే కలిగి స్వేచ్ఛగా సంచరిస్తున్నాడు. అలా
ను అన్నింటినీ జయించి అతడు ఏకచ్ఛత్రాధిపతియై సర్వ సుఖ భోగాలూ అనుభవిస్తూ
వాసనా లోలుడు కావడం వల్ల తృప్తి అన్నది లేకుండ వ్యవహరిస్తున్నాడు.

"ధర్మరాజా! అలా వ్యవహరిస్తున్నా అతడు విష్ణు పార్షదుడే. సనకాదుల కారణంగానే
ఆ దానవ రూపం ఏర్పడింది. ఐశ్వర్య మదోన్మత్తుడై అతడు వేద మర్యాదలను ఉల్లం
ంచరిస్తూండగానే ఆయుర్దాయం నశించ సాగింది. వాని ఘోర కఠోర శాసనాలకు సంత
దేవతలూ, సర్వ లోక పాలురూ కూడ భయభ్రాంతులై సర్వాశ్రయుడైన శ్రీమన్నారా
ంగవానుని శరణు వేడి మనసా అనుకో సాగారు—"జగదీశ్వరుడూ, సర్వాత్ముడూ అయిన
న్నారాయణ దేవుడు తేజరిల్లే స్థానంలోనే సర్వసంగ పరిత్యాగులు పునరావృత్తి రహితమైన
మ ధామాన్ని పొందుతూన్నారో? అట్టి మహోత్తమ ధామానికి ప్రణామాలు" అన్న
వారు నిద్రాహారాలు విస్మరించి జితేంద్రియులై ఏకాగ్ర భావంతో శ్రీమన్నారాయణ
ఆరాధించారు. ఓనాడు మేఘ గంభీర గర్జనలతో ఆకాశవాణి వినిపించింది. ఆ వాణితో
కంపించాయి. దేవతలకు అది యిలా వినిపించింది. — 'అమరులారా! భీతి చెందకండి.
భం చేకూరుతుంది. క్రూర కృత్యాలు కొనసాగిస్తున్న యీ నీచ రాక్షసునికి కాలం
స్తాన్నది. కొన్నాళ్ళు నిరీక్షించండి మీకు మేలు చేయడానికై వీణ్ణి అచిరకాలంలోనే
చేస్తాను. హిరణ్య కశిపుడు — తన కుమారుడు, నా భక్త శిఖామణి, శత్రుహీనుడూ,
స్వభావుడూ అయిన ప్రహ్లాదుని ద్వేషించి దారుణంగా హింసిస్తాడు. తత్సమయంలో
భక్తుని రక్షణార్థం దుష్టుడైన హిరణ్య కశిపుని నేను సంహరించి వేస్తాను. అమోఘ
పొందినా హిరణ్య కశిపుడు భక్తాపరాధం కారణంగా నా చేత అంతమవుతాడు.'
శ్రీహరి వరాన్ని ప్రసాదించాడు.

పాండవాగ్రజా! సత్వుల హృదయాలలో జ్ఞానాన్ని సంచరింపజేసే శ్రీహరి అమరు
రీతిగా ఆదేశించగానే వారు ఆ దేవ దేవునికి ప్రణమిల్లి తమ శత్రువు హిరణ్య

శిపుడు అంతమైనట్లే భావించారు; మహానందం చెందారు.

హిరణ్య కశిపుని కుమారులు నలుగురూ అద్భుత లక్షణ లక్షితులు. అందులో చిన్న
'డైన ప్రహ్లాదుడు సద్గుణ సంపన్నులలో మాత్రం అందరికన్న మిన్నయై సంచరిస్తూన్నాడు.
ాహ్మణ భక్తితో, సౌమ్య భావంలో, సత్య ప్రతిజ్ఞతలో సర్వుల యందూ సమదృష్టి కలిగి
ర్వ జీవ హితైషిగా వ్యవహరించడంలో అతనికి అతడే సాటియై ఖ్యాతి గాంచాడు. పెద్దలకు
ణమిల్లుతూ, సమవయస్కులను సాదరంగా సోదర భావంతో చూస్తూ, గురు, వృద్ధులను
వ భావంతో సేవిస్తూ, పేదలను పితృ సమంగా సేవిస్తూ, ప్రేమిస్తూ విద్యా ధనకుల సంపదలు
ావాడై కూడ ఈషణ్మాత్ర గర్వ రహితంగా వ్యవహరిస్తూన్నాడు, ఎట్టి దుఃఖ స్థితిలోనూ ధైర్యాన్ని
బహిక ఐహిక, పారలౌకిక విషయాలను గురించి ఆలకించి వాటిని సారహీనంగా భావించి
పరాలు రెండూ కల్పితాలే, మిథ్యా భూతాలే అని నిశ్చయించుకుని ఆ ప్రహ్లాద కుమారుడు
చరిస్తూన్నాడు. అందులకే అతనికి దేనియందూ కోరిక లేదు. దేహేంద్రియ మనో ప్రాణా
ను స్వాధీనంలో ఉంచుకునే అతనికి ఎన్నడూ ఎట్టి కోరికా కలుగదు. జన్మతః దానవుడే
ునా అతనిలో ఈషణ్మాత్రంగా కూడ రాక్షస భావం లేదు. భగవంతునిలో అనంత కళ్యాణ
ా ఉన్నట్లే ప్రహ్లాదునిలో కూడ అగణిత సద్గుణా లున్నాయి. అతణ్ణి మహాత్ములైనవారు సర్వదా
మిస్తూ, కీర్తిస్తూనే ఉన్నా అతనిలో భక్తి నిరంతరం వర్ధిల్లుతూనే ఉంది. రాక్షస శత్రువులైన
రులు సయితం తమ సభలలో భక్తుల గుణగానం చేసే వేళలో ప్రహ్లాదుని ఆదర్శంగా తీసు
అతణ్ణే భక్త శిఖామణిగా భావన చేయ సాగారు. అట్టి స్థితిలో ధర్మరాజా! అజాత శత్రుడ
నీవంటి వాడు ఆ భక్తుని భక్తికి సంతసించడంలో విశేష ముంటుందా? ఆ బాల భక్తుని
మ వినడానికీ, అభివర్ణించడానికి అధిక వచనాలు అవసరం లేదు. జన్మతః భగవదాయత్త
కు విశేషంగా కావడం వల్లనే అతని మహత్తు అభివ్యక్త మవుతూన్నది.

ధర్మరాజా! బాల్యంలోనే తోటి బాలురతో క్రీడలు మాని ప్రహ్లాదుడు భగవద్ధ్యాన తత్ప
జడునిలా ఉండిపోతూన్నాడు. అతని హృదయాన్ని ఆవేశించిన దైవానుగ్రహం అతనికి
ోరిక దృష్టి లేకుండా చేసివేసింది. అతడు నిరంతరం భగవంతుని అంకలో ఉన్నట్లే భావన
ఆ దేవ దేవుడు తనను గాఢాలింగనం చేసుకున్నట్లు ఆనందించడం వల్ల జాగ్రత్స్వప్న
ైవస్థలలో, స్నాన, పాన, ఆహార స్వీకరణ వేళ, భాషిస్తూ, కూర్చుంటూ, ఈ ఆవేశ

ల సర్వకాల సర్వావస్థలలోనూ అతని దృష్టి దైవం మీదనే కానీ ప్రపంచం మీద ఉండడం భగవానుడు తనను విడనాడి వెళ్ళాడని తలచి గట్టిగా ఏడుస్తాడు. మరోసారి తన ఇష్ట సాక్షాత్కరించాడని తలచి బిగ్గరగా నవ్వుతాడు. ఇంకోసారి హరి ధ్యానంలో ఏర్పడిన మధురానుభూతి వల్ల కలిగిన ఆనంద పారవశ్యాన గానం చేస్తాడు. మరో వేళలో భక్తు తో లజ్జా రహితంగా బిగ్గరగా అరవడం, నాట్యం చెయ్యడం, ఆ దేవ దేవుని లీలాస్మరణ తన్మయుడై తననుతాను మరచి — తల్లీలలను అనుకరిస్తూ అన్ని విధాలా దైవ సేవా దై సంచరించే వాడు. అప్పు డప్పుడు బాహ్య ప్రపంచంలో భగవంతుని సందర్శించి టనే ఆ దేవ దేవుని దివ్య స్పర్శను పొందినట్లు భావించి ఆనంద సాగరంలో మునిగిపోయే తత్సమయంలో అతనికి రోమాంచ మయ్యేది. ఆనందాతిరేకంతో అతడు కనుల ఏదు నిమీలిత లోచను డయ్యేవాడు. శ్రీమన్నారాయణ దేవుని యందు అట్టి భక్తి వర్ధిల్లాలంటే ష్మల సాంగత్యం వల్లనే సాధ్య మవుతుంది. తత్సాధన ద్వారా సాధకుడు పరమానంద దై పోతాడు. దీనులైన దుస్సాంగత్య పీడితులు కూడ సజ్జన సాంగత్యం ద్వారా శాంతిని కో గలుగుతారు. పరమ భక్తుడు, మహాత్ముడు, భాగ్యవంతుడు ఉన్నత కోటికి చెందిన అయిన ప్రహ్లాదుని — తండ్రి అయిన హిరణ్య కశిపుడు ఘోరాపరాధిగా భావించి అనేక కష్టాలు కలిగించాడు.' అన్న నారద దేవర్షి ని ధర్మరాజు ప్రశ్నిస్తూన్నాడు.

'దేవర్షీ! అఖండ మహోత్తమ వ్రతసంపన్నా! మీకు తెలియనిది లేదు. తండ్రి అయి హిరణ్య కశిపుడు మహాత్ముడూ, విశుద్ధాంతరంగుడూ అయిన ప్రహ్లాద కుమారుని బాధించ గల కారణ మేమిటో వివరించండి. విశేషంగా తండ్రు లందరూ తమ పుత్రులయందు దర భావాలతో ఉంటూ బిడ్డ తప్పు చేస్తే శిక్షిస్తారే కానీ—వాపైరి విరోధ భావాలు పెంపు ని వారిని వేధించరు. అట్టి దశలో గురు వృద్ధులను దైవంగా భావించి సేవించేవాడూ, తుడూ, సదాచార సంపత్తి కలవాడూ అయిన ఉత్తమ కుమార్ణి సంహరించడానికి ప్రయ న హిరణ్య కశిపుని గురించి వింటూంటే చాలా ఆశ్చర్యం కలుగుతూన్నది. దయచేసి భక్తుని గాథను విశదీకరించి చెప్పండి.' అని అర్థించాడు పాండవాగ్రజుడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-5

### ప్రహ్లాదుని అంతం చేయ హిరణ్యకశిపుడు ప్రయత్నించుట.

ధర్మరాజు ప్రశ్నలకు నారద మహర్షి బదులు చెబుతూన్నాడు. – 'ధర్మరాజా! మహ తేజస్సంపన్నుడైన ఆచార్య శుక్రుని రాక్షసులు పురోహితునిగా స్వీకరించారు. చండ – ర్కులు ఆయన పుత్రులే. వారిద్దరూ రాజభవనంలోనే ఉంటూ రాక్షసరాజు ద్వారా వచ్చే ర్థులకు పాఠాలు చెబుతూన్నారు. అందరితో బాటు వారు ప్రహ్లాదునకు కూడ–అర్థ నీతి, రాజ ఆదిగా గల విద్యలు బోధిస్తూన్నారు. గురువులు ఉపదేశించిన రీతిగా వారి ఆదేశానుసారం ్లాదుడు పాఠాలు వల్లె వేసి వారికి వప్పగిస్తూన్నాడే కానీ, ఆ విద్యలన్నీ అజ్ఞాన బోధకాలే గ్రహించి మననం మాత్రం చేయడం లేదు. కారణమేమన అవన్నీ మిథ్యా వస్తువులను వస్తువులన్న భ్రాంతిని కలుగజేస్తూ ప్రపంచానికి అనర్థాన్ని చేకూర్చేవే కానీ పరమార్థదాయ మాత్రం కావు. అని తెలుసుకున్నాడు.

కాలం గడుస్తూన్నది. ఓ నాడు తండ్రి ప్రహ్లాదుని ఒడిలో కూర్చో బెట్టుకుని–"నాయనా! సర్వాధిక ప్రియమైనది ఏది?" అని ప్రశ్నించాడు. బదులుగా ప్రహ్లాదుడు – "తండ్రీ! లూ 'నేను–నాది' అన్న భావాలు కలవారై ఉద్విగ్నులయి పోతూన్నారు. వారి విషయమై ఏక మాత్రాభిప్రాయానికి వచ్చాను. ఆకులతముచే కప్పబడిన దిగుడు బావి వంటి గృహాన్ని కి అడవులకు పోయి శ్రీమన్నారాయణ దేవుని శరణు వేడుటయే సుఖ సాధనమనీ •రియే సర్వ జగద్రక్షకుడనీ సిద్ధాంతం చేసుకున్నాను." అంటూ మౌనం డు. కుమారుని పలుకులలో తనకు పరమ శత్రువైన శ్రీహరి ప్రశంసం ఉండడం ుచి హిరణ్యకశిపుడు వికటాట్టహాసం చేసి పర ప్రబోధం వల్లనే పిల్లల మనస్సులు పాడై ని గ్రహించి – గురు గృహంలో – శ్రీహరి పక్షీయులయిన విప్రులు కొందరు కపట

ంతో ఉండి తన బిడ్డకు హరి భక్తి వర్ధకమైన దుర్బోధలు చేస్తున్నారని తలచి బాలుని వైరి అయిన హరి యందు లగ్న మవకుండ జాగ్రత్తగా చూడుడని గురు గృహానికి ంచి వేశాడు.

ప్రహ్లాద కుమారుని దానవులు గురు మందిరం చేర్చిన తరువాత - చండామర్కులు అతణ్ణి ఏ — వత్సా! ప్రహ్లాదా! నువ్వు సత్యమే చెప్పు. అసత్య మాడకు. నీ బుద్ధి యిలా ఎందుకు ంచిందీ. నీ తోటి వారలలో ఎవరి బుద్ధీ యీ రీతిగా భ్రమించ లేదే? నువ్విలా మారడానికి ారణాన్ని గురు జనులు తెలుసుకోవాలనుకుంటున్నారు. నువ్వే యిలా మారావా? ఎవరైనా ా మార్చారా? నిజం చెప్పు." అన విని ప్రహ్లాదు డంటూన్నాడు — భగవన్మాయా మోహిత ం — దురాగ్రహులై యిది నాది యిది పరులది — అని భ్రమ వశులవుతూంటారు. ాధి నాథుడైన పరమేశ్వరునకు ప్రణామాలు. భగవదనుగ్రహం కలిగిన నాడే మానవుల పవృత్తి నాశన మవుతుంది. పశు బుద్ధి వల్లనే స్వపర భేద భావాలు కలుగుతూంటాయి. జ్ఞాన రహితులైన మూఢులు స్వపర భేద భావాలు కారణంగా బాధలకు గురి అవుతూం అత్మ వస్తువును తెలిసికోవడం అసాధ్య విషయమే. ఈ విషయమై బ్రహ్మాది దేవతలే తు లవుతూంటారు. మీ శబ్దాలలో చెప్పాలంటే ఆ భగవానుడే నా బుద్ధి చెడినట్లు పలికిస్తూ . ఇనుమును అయస్కాంతం ఆకర్షించిన విధంగా శ్రీమన్నారాయణ దేవుని ఇచ్ఛా శక్తి నస్సును ప్రపంచం నుండి వేరు చేసి పరంధాముని వైపు ఆకర్షిస్తూన్నది." అని అతడు వహించగా — ఆ గురువులు పర తంత్రులూ రాజ సేవకులూ అవడం వల్ల భయంతో కుపి ప్రహ్లాదుని దండిస్తూ — "ఒరేయ్! ఆ వేత్ర దండాన్ని యిలా తీసుకురా. మా కీర్తి సర్వ మట్టిపాలు చేసిన యీ దుర్బుద్ధిని దారిలో పెట్టాలంటే దండోపాయాన్ని ఆశ్రయించక ి. దైత్య వంశ రూప చందన వనంలో కంటక భరితమైన యీ ముళ్ళ మొక్క మొలిచింది. రూప చందన వనానికి శ్రీహరి పరశువు వంటి వాడు. అట్టి హరికి యితడు సహాయకుడై న్నాడని గురువులు ప్రహ్లాద కుమారుని దండిస్తూ ధర్మార్థ కామ సంబంధ విద్యలనే ప సాగారు. కొంత కాలానికి ప్రహ్లాదుడు సామ, దాన, భేద దండోపాయాలకును శాస్త్రీ నేర్చుకున్నాడు. అది చూసిన గురువు అతణ్ణి మాతృమూర్తి దగ్గరకు తీసువెళ్ళారు. ని తల్లి అనేక విధాల లాలించి ఆదరించి అతణ్ణి తండ్రి దగ్గరకు తీసుకు వెళ్ళింది. అంత

కు సాష్టాంగ ప్రణామం చేసిన కుమారుని లేవనెత్తగా ఆలింగనం చేసుకుని మహానందం
ంది అంకంతో అతణ్ణి కూర్చుండ బెట్టుకుని వాని మూర్ధమాఘ్రాణించి నయనాల నుండి జల
రాలే ప్రేమాశ్రు ధారలతో వాని శరీరాన్ని సిక్తం చేస్తూ అన్నాడు. 'నాయనా! ప్రహ్లాదా!
త కాలంగా నువ్వు గురువుల ద్వారా నేర్చుకున్న విద్యలలో ఉత్తమమై ప్రియాన్ని చేకూర్చే
లో కొన్ని వాక్యాలు వినిపించు.' అన్నాడు.

'తండ్రీ! భగవద్గుణ లీల, నామాదుల శ్రవణం, కీర్తనం, స్మరణం, ఆ దేవ దేవుని
సేవ, పూజ, నమస్కార దాస్య, మైత్రి, ఆత్మ నివేదన రూప నవవిధ భక్తి మార్గాలలో
ఒక్క మార్గాన్ని అనుసరించి భగవద్బుద్ధ్యా అతనిని సేవించు మని బోధించు నట్టి విద్యయే
మ విద్య యని నా అభిప్రాయము.' అన్న ప్రహ్లాదుని పలుకులు విన్న హిరణ్య కశిపుని
లు జేవురించాయి. క్రోధంతో అధరాలు కంపించ సాగాయి. గురుపుత్రు అయిన చండా
ులను చూస్తూ — 'నీచ బ్రాహ్మణులారా! నా శత్రు సంబంధమై సార శూన్యమై నీచాతి
మైన యీ మతాన్ని నా బిడ్డకు మీరే బోధించారు. నన్నే లెక్క చెయ్యక మీరు కపట వేష
లై శత్రు పక్షం చేరి, స్వామిద్రోహులై పోయారు. కృతఘ్నులు రోగాల వల్ల కృశించిన
మీరూ అచిరకాలంలో నాశనమై పోతారు. అనగా వేదన పడుతూ గురు పుత్రు లంటూ
రు — ప్రభూ! నీ పుత్రుడు పలికిన పలుకులు మేము కానీ, యితరులు కానీ బోధించినవి
. ఈతనికి హరిభక్తి జన్మ సిద్ధమైనది కావడం వల్ల మాపై మీరు కోపగించుట న్యాయ
తం కాదు.' అన విని హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని వైపు తిరిగి — 'ఏరా! డింభకా!
వులు చెప్పని యీ అహిత మార్గం నీకు ఎలా వచ్చిందో చెప్పు.' అన్నాడు.

ప్రహ్లాదు డందుకున్నాడు — 'జనకా! సంసారాసక్తులైన వారు తిన్నదే తింటూ, అనుభ
దే అనుభవిస్తూ ఘోర సంసార నరకంతో పడి వేదన చెందుతూంటారు. అట్టి వారికి
త కానీ, పరులు చెప్పడం వల్ల కానీ, తమతో సములైన వారి స్నేహం వల్ల కానీ హరి
లభించదు. ఇంద్రియాలకు వశులై విషయ భోగాలే సత్యమని నమ్మి వారు — అంధుని
వాని నాధారంగా గొని మరికొందరు అంధులు దిగుడుబావిలో పడినట్లు వేద వాగ్రూపమైన
లతో బంధించబడి కామ్య కర్మలకు వశులై — స్వార్ధ పరమార్ధ సిద్ధికి శ్రీహరి దేవుడు
మే గతియని గ్రహించ లేరు. భగవచ్చరణార విందార్చన యందు లగ్నమైన చిత్తం

రి — జనన మరణ రూప సంసార బంధం నశించి పోతుంది. భగవద్భక్తుల పాదార
లను సేవించ నట్టి వాడు - కామ్య కర్మలు ఎన్ని చేసినా అట్టి వాని బుద్ధి హరి చరణార
లను స్పర్శించ లేదు.' కుమారుడు అలా పలికి మౌనం దాల్చడంతో హిరణ్య కశిపుడు
భుజంగంలా బుసలు కొడుతూ ఒడిలో ఉన్న ప్రహ్లాదుని క్రిందకు విసిరి వేశాడు. వాని
పూర్ణ మధుర వచనాలను ఆలకించ జాలక — హిరణ్య కశిపుడు — సేవక రాక్షసులను
- 'భృత్యులారా! వీణ్ణి బయటకు తీసుకుపోయి సంహరించండి. వీడు తన పినతండ్రిని
ం చేసిన మాకు బద్ధ శత్రువైన హరిని ప్రేమించి స్వకుల ధర్మాన్నీ, స్వజనులనూ ధిక్క
హరి చరణాలనే ఆరాధిస్తూన్నాడు. జాగ్రత్తగా ఆలోచించగా రాక్షస కులాంతకుడైన
యీ రూపంలో ప్రాదుర్భవించినట్లు తోస్తూన్నది. వీడు విశ్వసనీయుడు కాదు. పంచ
ప్రాయంలోనే మాతా పితరులను స్మరించని వాడు వాసుదేవుని మాత్రం ఏమి చేస్తాడు?
కృతఘ్నుడు. ఔషధ సమంగా ఉపకారం చేసేవాడు పరుడే అయినా పుత్ర సముడే
డు. దేహంలో ఓ అంగానికి రోగం పుడితే దానిని ఖండించి మిగిలిన శరీరాంగాలను
ంకోవాలి. అట్లే కుల ఘాతకుడైన కుమారుని సంహరించి అయినా కులాన్ని కాపాడు.
. పుత్ర రూపంలో నా బద్ధ శత్రువే యిలా ప్రవేశించాడు. భోగాసక్తేంద్రియాలు
లకు అనర్థాలను కలిగించునట్లు పుత్రుడై కూడ వీడే నాకు క్లేశాలను కలిగిస్తూన్నాడు.
సన భోజన వేళల్లోనే కాదు ఏ వేళలోనైనా వీనిని అంతం చెయ్యండి.' అన్నాడు.

తమ ప్రభువు తమకు అలా ఆదేశించగానే ఆ క్రూర రాక్షసులు 'వీణ్ణి నరికి చంపండి.'
అరవ సాగారు. వాడికోరలతో, భయంకర వదనాలతో, ఎర్రటి గడ్డమూ, మీసాలూ,
లూ కల ఆ దుష్టులు శూలాలు ధరించి వికటాట్టహాసాలు చేస్తూ ఉంటే ప్రహ్లాద కుమారుడు
ంగా శ్రీహరి ధ్యానంలో ఉండిపోయాడు. ఆ భక్తుని సమస్త మర్మ స్థానాలలో వారు
తో వేధించి గాయపరుస్తూన్నారు. తత్సమయంలో ఆ బాలుని చిత్తం భగవదాయత్తమై
మనోవాగతీతుడూ, అగోచరుడూ సర్వ శక్తి సంపన్నుడూ, సర్వాత్ముడు, సర్వాధారుడూ
ఆ పరబ్రహ్మ—రాక్షసుల ద్వారా చేయబడిన సర్వ ప్రహారాలనూ—భాగ్యహీనుని క్రియ
వలె వ్యర్థం చేసి వేశాడు. తమ నిశిత శూల ప్రహారాల వల్ల శరీరం గాయపడకుండ ప్రహ్లా
నిశ్చలంగా కూర్చోవడం చూసి హిరణ్య కశిపుడు అతణ్ణి వధించ అనేకానేక ప్రయత్నాలు

ాడు. ఐదేళ్ళ వాణ్ణి మదించిన ఏనుగులచే త్రొక్కించాడు. కాలకూట విషాన్ని కక్కే భయంకర
ాలచే కరిపించాడు. క్షుద్రోపాసకుల ద్వారా అభిచారిక హోమాలు చేయించాడు. కృత్యలను
యోగింప జేశాడు. మహోన్నత గిరులపై నుండి పాషాణాల మీదకు తలక్రిందులుగా తోయిం
ు, శంబరాసురుని ద్వారా అనేక మాయా ప్రయోగాలు చేయించాడు. అంధకార బంధురాలైన
్లలో బంధించి ఉంచాడు. విషం త్రాగించాడు. తిండి పెట్టకుండ వేధించాడు. అగ్నిలో, హిమ
శైలాలలో సముద్రంలో పడద్రోయించి మీద పాషాణలను పడవేయించాడు, భూమిలో పాతి
ించాడు. ఇలా ప్రహ్లాదుని అంతం చేయించాలని అతడు చేయని ప్రయత్నం లేదు. అయినా
ర రహితుడైన ప్రహ్లాద పుత్రుడు అంతం కాక పోవడంతో హిరణ్య కశిపుడు మనసా –
్ని సంహరించాలని నేను చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయి పోయాయే. పర సహకార
ంతంగానే వీడు స్వప్రభావ సురక్షితుడై ఉన్నాడు. పిన్నవాడై కూడ నిర్భయంగా సంచరించ
గుతూన్నాడు. అనంత శక్తి సంపన్నమైన వీనితో విరోధించడం వల్ల నాకు మరణం తప్ప
నా?' అని అనుకుంటూ అతడు తల వాల్చాడు. సమక్షంలో నిలచి అతని స్థితిని తిలకిస్తూన్న
ామర్కులు – 'ప్రభూ! జగత్రయాలను జయించిన వారు మీరు మాత్రమే. మీ భృకుటి
వడితే, కనులెఱ్ఱ జేస్తే లోకపాలురు సయితం కంపించి పోతారు. మీ విచారానికి హేతువును
ు గ్రహించజాల కున్నాము. బాలుర క్రీడలతో ఉచితానుచిత విచార మేల? మా పితృదేవు
న ఆచార్య శుక్రులవారు విజయం చేసే వరకూ వీణ్ణి వరుణ పాశ బంధితుని చేసి పారి
ండ ఉంచుదాము. గురు, వృద్ధ జనులను సేవించడం ద్వారా జ్ఞాన, ఆయుర్దాయాలు వర్ధిల్లు
ు. తద్రీత్యా ప్రహ్లాదుడు మారవచ్చునని ఆశిస్తూన్నాము.' అన్నారు.

చండామర్కుల వచనాలకు హిరణ్య కశిపుడు వినిఅంగీకారాన్ని తెలియజేశాడు. వీనికి గృహ
ి ధర్మాలను బోధించు డని ఆదేశించాడు. రాజాదేశానుసారం వారు ప్రహ్లాదుని పాఠశాలకు
వెళ్ళి, ధర్మార్థ కామ సంబంధమైన పురుషార్థ త్రయాన్ని గూర్చి ఉపదేశించ సాగారు.
ుల వారి దగ్గర ప్రహ్లాదుడు వినయంగా సంచరిస్తాడు. కానీ వారి ఉపదేశాలు అతనికి ఎంత
ం నచ్చడం లేదు. అజ్ఞానులకే కానీ భక్తులకు అట్టి బోధలు రుచిస్తాయా? కాలం గడుస్తూ
ఓనాడు గురువులు స్వకార్య సిద్ధికై ఎక్కడికో వెళ్ళారు. తోటి స్నేహితులు ప్రహ్లాదుని
పిలచారు. పరమ జ్ఞానీ, భక్తుడూ అయిన అతడు మిత్రు లందరినీ చేరబిలచి జనన

రహస్య జ్ఞాత కావడం వల్ల వారిపై దయ దలచి జ్ఞానోపదేశం చెయ్యసాగాడు. పిన్నలు వల్ల — వారి మనస్సులు ద్వంద్వ భావోపదేశాల వల్ల చెడిపోలేదు. వారందరి కంటకూ వస్తువులను విడిచి ప్రహ్లాదుని పరివేష్టించి శ్రద్ధాసక్తులతో కూర్చున్నారు. అతని మహోప యందే మనస్సులను లగ్నం చేసి రెప్పలు సయితం వేయకుండా ప్రేమగా అతని దివ్య ంను ఆలకించ సాగారు. మైత్రి కరుణలు రాసీభూతమై తేజరిల్లుతూన్న ప్రహ్లాదుడు స్నేహి కల ప్రేమ భావంతో బోధించ సాగాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–7 — అధ్యాయం-5

### మిత్ర బృందానికి ప్రహ్లాదుడు జ్ఞానోపదేశం చేయుట.

'స్నేహితులారా! అత్యంత దుర్లభమైన మానవజన్మను పొందినప్పుడే అవినాశనమైన త్మను పొందగలిగే భాగ్యాన్ని యీ లోకంలోని వారు పొంద కలుగుతారు. ఎప్పుడీ అంతమై పోతుందో ఎవరికీ తెలియదు. అందులకే — యౌవ్వన దశలో, లేదా వార్ధక్య భక్తి సాధన చెయ్యవచ్చు ననుకోక బాల్యం నుండి సాధన ద్వారా పరమాత్మను పొంద ్పంచాలి. సర్వులకూ స్వామీ, ప్రియతముడూ, కళ్యాణ కారకుడూ, అయిన పరమాత్మను న్మలోనే ఆశ్రయించి ఆ దేవదేవుని శరణు పొందడమే లక్ష్యమని తెలుసుకోండి. మిత్రు ప్రారబ్ధానుసారం ఇంద్రియ సంబంధమైన సుఖాలు జీవులకు ఆయా జన్మలలో లభిస్తానే ుు. అట్లే ప్రయత్న రహితంగా దుఃఖాలూ కలుగుతూ ఉంటాయి. కనుక సాంసారిక ోగానువార్ధం ప్రయత్నించ బనిలేదు. ప్రారబ్ధం వల్ల సహజంగా లభించే వస్తు జాలం ప్రయత్నించి ఆయుర్దాయాన్నీ, శక్తినీ వ్యర్థం చేసుకోవడమే అవుతుంది. విషయ

లోలునికి ఆయువు క్షీణించి పోవడమే కానీ శ్రీమన్నారాయణ పాదారవిందానురక్తి, క్తికి కారణ భూతమైన భక్తి లభించదు. మన మీదకు అసంఖ్యాకమైన భయ కారణాలు డుతూ ఉంటాయి. రోగ శోకాదులు మీదకు రాకముందే, మృత్యు దేవత తన భయంకర తెరచి మ్రింగక ముందే ధీశాలి ఆత్మ కళ్యాణార్థం హరి సేవా పరాయణుడై సంచ . మానవుని పూర్ణాయుర్దాయం నూరేళ్ళు, జితేంద్రియుడు కాని అజ్ఞాని ఆయుర్దాయంలో గం రాత్రి నిద్రావస్థలో వ్యర్థమై పోతుంది. హితా హితాలను తెలిసికోలేని స్థితిలో దశ గడచిపోతుంది. ఆటపాటలతో కౌమార దశ వ్యర్థంగానే గడుస్తుంది. అలా యిరవై వృథాగా కామినీ లోలుడై యౌవనాన్ని వ్యర్థం చేసికోగానే వార్ధక్యం ప్రవేశిస్తుంది. తదవ ఇంద్రియ పటుత్వం సడలిపోతుంది. కంపాదులు ఏర్పడుతాయి. ధారణా శక్తి లుప్తమై ది. శక్తులన్నీ నాశనమై పోవడంతో హరిని సేవించే శక్తి లేనివాడై పోతాడు. శేషించిన యుర్దాయ కాలంలో నెరవేర్చ జాలని కోర్కెలు పుట్టి — బలవంతంగా గృహం వైపు ంచే జనించిన మోహంతో అంధుడై కర్తవ్యా కర్తవ్య జ్ఞాన శూన్యుడై ఉండడంతో అట్టి కాలం పూర్తిగా చెల్లి పోతుంది.

'స్నేహితులా! ఇంద్రియ దాసుడై, ధన, దార, గృహ పుత్రాసక్త చిత్తుడై తాపత్ర చిక్కుకుని మమకార జాలంలో చిక్కుకున్నవాడు — తనంత తానుగా బంధన విము కావాలని ఎన్నడైనా ప్రయత్నిస్తాడా? తమ ప్రాణాలను లెక్క పెట్టక దొంగలైన కులు, వ్యాపారులూ ధనాన్ని ఆర్జిస్తూ — అతృష్ణను విడనాడి త్మను ఎలా ప్రార్థించ గలడు? అత్యంత ప్రియురాలైన భార్యతో ఏకాంత వాసానికి టు పడినవాడు, మధురాతి మధురాలుగా కనిపించే ఆమె ప్రేమ పూర్ణ వచనాలు వినడానికి టు పడినవాడు సోదర బంధు బాంధవ స్నేహ పాశాలలో చిక్కుకు పోయిన వాడు, పిల్లల పలుకులకు పొంగి మోహావేశితులైన వారు యీ కుటుంబాదులను ఎలా విడనాడ కలరు? ౖకు పోయిన కుమార్తెలూ, కుమారులూ, సోదర, సోదరీమణులూ—వారందరి దైన్యావస్థను వ మాతా పితరులూ బహు మూల్య సుందర వస్తు సామగ్రులతో కూడిన గృహాదులనూ రాగతమైన ఆస్తిపాస్తులనూ, ఎట్లా త్యజించ గలరు? సేవకులు, పశువులూ జ్ఞప్తికి చే—అట్టి వాడు యీ సాంసారిక వ్యక్తుల తోటి సంబంధాలనూ, వస్తు జాలన్నీ ఎలా విడ

ుడు ? జననేంద్రియ, రసనేంద్రియాలకు పూర్తిగా లొంగి వాటి ద్వారా లభించే సుఖమే
్యమని విశ్వసించి, భోగవాసనల వల్ల తృప్తి చెందనివాడు కర్మ తరువాత కర్మలు చేస్తూ
పురుగు తాను మాత్రం లోపలే ఉంటూ చుట్టూ గూడు అల్లుకుని లోపలే పడిపోయిన
సంసార సక్తచిత్తుడైనవాడు తత్సుఖాల నుండి ఎలా విరక్తిని పొంద కలడు ? ఇది
ుంబం అనుకున్నవాడు — దాని పాలన పోషణలలో చిక్కుకుని అదియే తన సర్వస్వ
ావించి తన అమూల్యమైన ఆయుర్దాయాన్ని వ్యయం చేసే వాడు — నిజ జీవిత వాస్తవో
నాశనమై పోతూన్నదని గ్రహించజాలక చరించే వాని ప్రమాదానికి అంతు అనేది
? సుఖ లేశమైనా యిందులో లభిస్తుందంటే — అదీ మంచిదే — కానీ అదీ ఉండదు.
్రలో ప్రవేశిస్తే ఆ కర్మలో, ఎక్కడికి వెడితే అక్కడ దైవిక, భౌతిక, కాయికాది
వచ్చి హృదయాన్ని దగ్ధం చేస్తూ వుంటాయి. అయినా మానవునిలో వైరాగ్యం ఉద
ం లేదు. కుటుంబ మమకారం కారణంగా ఇహ పరాలలో ప్రమాదాలే కలుగుతా యని
ండి. కామనలకు వశుడై, భోగ లాలసుడై పరుల ద్రవ్యాన్ని అపహరిస్తూ వుంటాడు!
ారా ! ఈ రీతిగా కాలాన్ని వ్యర్థం చేసుకుంటూ కుటుంబ పోషణలోనే ఉండేవాడు.
సుడే అయినా పరమాత్మను పొందలేడు. స్వపర భేదభావం ఉన్నంతవరకూ పండితుడు
అజ్ఞానితో సముడే కావడం వల్ల తమో గుణాన్ని ఆశ్రయించడం వల్ల నీచ గతులే
తాడు. ఎట్టి దశలోనూ అట్టి వాడు ఉత్తమ గతిని పొందజాలడు. మత్త కామినులకు —
ంజకమైన క్రీడా మృగంగా ఉంటూ, సంతాన రూపమైన సంకెళ్ళలో బంధింపబడి
ట్టివాడు దరిద్రుడైనా, ధనవంతుడైనా, వనంలో ఉన్నా, స్వగృహంలోనే ఉన్నా ఎట్టిదశ
స్వయంగా ఉద్ధరించుకో జాలడు. కనుక మిత్రులారా ! మీరు విషయాసక్తులైన రాక్షసుల
్యాన్ని విడనాడండి. శ్రీమన్నారాయణ భగవానుని శరణు వేడండి. సంసారాసక్తిని
ి సర్వసంగ పరిత్యాగు లగునట్టి వారికి ప్రియతముడైన భగవ తుడే పరమగతి — అని
చండి. ప్రాణి సర్వస్వానికీ పరమాత్మయే ఆత్మ స్వరూపుడై భాసిల్లుతూ వుంటాడు.
ా సత్తా మాత్రుడూ, స్వయం సిద్ధుడూ కావడం వల్ల భగవంతుణ్ణి ప్రసన్నుని చేసుకోవ
విశేష పరిశ్రమ అవసరం లేదు. బ్రహ్మాది పిపీలికా పర్యంతం తృణాది స్తంబ పర్యంతం

నల్ప వస్తు జాలంలో, పాంచ భౌతిక పదార్ధ సర్వస్వంలో, పంచభూత, పంచ తన్మాత్ర,
త్తత్వ, గుణత్రయ సామాన్యావస్థ అయిన ప్రకృతిలో సయితం ఏకమాత్ర, అవినాశన
త్మ మాత్రమే భాసిల్లుతూ వున్నాడు. సమస్త సౌందర్య, మాధుర్య ఐశ్వర్యాలకూ
పరమ నిధి అని తెలుసుకోండి. దృశ్య ప్రపంచ రూపం లోనూ, ద్రష్టగా, అంతర్యామి
లోనూ ఉన్నవాడతడొక్కడే. అనిర్వచనీయుడై, వికల్ప శూన్యుడై కూడ అతడే
దృశ్య వ్యాప్య వ్యాపక రూపాలలో ఆ పరాత్పరుడే అభివర్ణింపబడుతూ వున్నాడు. ఆ
డు కేవలం అనుభవానందైక రస స్వరూపుడై, ఏకమాత్రుడై తేజరిల్లు తూన్నాడు. గుణ
ు, సృష్టికి హేతుభూతమైన మాయ వల్లనే ఆ దేవ దేవుని మహైశ్వర్యం గుప్తమై
. మాయ దూరమయితే దైవ దర్శన మవుతుంది. కనుక మీ రందరూ అసురీ భావ
్యజించి, రాక్షస ప్రకృతిని విడనాడి ఘోరకృత్యాలు మాని సర్వ జీవులనూ కరుణతో
ప్రేమగా సర్వులకూ శక్తివంచన లేకుండ సహకరిస్తూన్న నాడే పరమాత్మ ప్రసన్ను
ు. శ్రీమన్నారాయణ భగవానుడు ప్రసన్నుడైతే మానవ మాత్రుడు పొందజాలనిది
ు, ఇహపరాలలో ధర్మార్ధ కామాదులకు సంబంధించిన సర్వ వస్తువులూ గుణ పరిణామం
తమంత తామై లభిస్తాయి. భగవద్భక్తులమై ఆ దేవదేవుని గుణ నామ సంకీర్తనలు
చేయగలిగితే మోక్షంతో పని ఉండదు. ధర్మార్ధ కామరూప పురుషార్ధత్రయ వర్ణన, ఆత్మ
కర్మకాండ, తర్కశాస్త్ర, దండనీతి యింకా జీవనానికి అవసరమైన అనేకానేక సాధనలన్నీ
పతిపాదితాలే, ఇవన్నీ భగవంతునికి ఆత్మార్పణ చెయ్యడంలో సహాయకాలే. కనుక
లవుతా యని విశ్వసించ వచ్చును. నేను మీకు బోధించిన యీ జ్ఞానం విశుద్ధమైనది,
ుదిలో నర నారాయణ ఋషులు నారద దేవర్షికి బోధించారు. భగవంతుని అనన్యాయత్త
తో ఆరాధించునట్టి సర్వసంగ పరిత్యాగుల చరణ ధూళిని శిరస్సుపై ధరించి సేవించ గలుగు
రికి యీ జ్ఞానం లభిస్తుంది. విశుద్ధమై, జ్ఞాన విజ్ఞాన సహితమగు దీనినే భాగవత ధర్మ
ు. దీనిని ఆదిలో నేను నారద దేవర్షి వల్ల ఆలకించాను.'

ప్రహ్లాదుని ప్రసంగాన్ని శ్రద్ధాసక్తులతో ఆలకించిన దైత్య బాలకులు ప్రశ్నిస్తూ —
నా ! మేమూ నువ్వూ కూడ చండామర్కుల దగ్గరనే విద్య నభ్యసిస్తూన్నాము కదా !
అన్య గురువుల నెవరినీ ఎరుగము కదా ! బాల్యం నుండి రాజభవనంలో తల్లితోనే ఉన్న

ారదమహర్షి సాంగత్యం లభించినదంటే ఆశ్చర్యంగా ఉంది. ఇందలి రహస్యాన్ని వివ
మా సందేహాన్ని దూరం చెయ్యి.' అన్నారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-7

## నారదోపదేశాన్ని ప్రహ్లాదుడు మాతృ గర్భంలో ఉండి ఆలకించుట :

ధర్మరాజుకు నారద దేవర్షి ప్రహ్లాద చరిత్రను కొనసాగిస్తున్నాడు. 'ధర్మరాజా! తోటి
లు అలా ప్రశ్నించగానే ప్రహ్లాదునికి నా పలుకులు జ్ఞప్తికి వచ్చాయి. ఆ పరమ భక్తుడు
్వ నవ్వి వారికి యిలా చెప్ప సాగాడు — 'మిత్రులారా! తపస్సు చెయ్యాలని నా తండ్రి
ద్రికి వెళ్ళాడు. తత్సమయంలో మహేంద్రాది బృందారకులు రాక్షసులతో యుద్ధం చేయ
ప్రయత్నం చేస్తున్నారు. వారు పరస్పరం భాషించుకుంటూన్నారు. 'బలవంతమైన సర్పాన్ని
మలు నాశనం చేసివేసినట్లు ప్రాణి హింసకుడైన హిరణ్య కశిపుని వాని పాపాలే నాశనం
స్తాయి.'

అమరులు తమపై దండెత్తు మన్నారని రాక్షస సేనాధిపతులకు తేలిసింది. అవ్వేళతో
లు అమరులను జయించజాలక దార, పుత్ర, మిత్ర, గృహ పశు ధనాదులను ఎక్కడి
అక్కడే విడనాడి ప్రాణాలతో పారిపోయారు. రాక్షస రాజ భవనంలో ప్రవేశించి ఇంద్రా
ర్వాన్నీ స్వాధీనం చేసుకున్నారు, చివరకు మహేంద్రుడు నా మాతృమూర్తి అయిన
సను కూడ నిర్బంధించి తీసుకు పోతూంటే ఆమె దీనయై భోరున విలపిస్తున్నా ఆతడు
చేయక పురోగమించి పోతూంటే — మా భాగ్యవశాన నారద దేవర్షి అక్కడకు వచ్చి
లో ఉన్న నా జననిని చూసి దేవేంద్రునితో — మహేంద్రా! ఈ కయాధూ నిరపరాధి.

ఈమెను నిర్బంధించి నువ్వు తీసుకుపోవడం నీవంటి వానికి ఉచితం కాదు. పతివ్రత, పరస్త్రీ, సాధ్వీ అయిన యీమెను వెంటనే విడిలిపెట్టు.' అన్నాడు. అది విని దేవేంద్రుడు – 'నారద మునీంద్రా! ఈమె గర్భంలో లోక కంటకుడైన హిరణ్యకశిపుని మహా ప్రభావ సంపన్నమైన )ర్యం పెరుగుతూన్నది. ఈమెను నా దగ్గరే ఉంచుకుని ప్రసవానంతరం యీమెకు కలిగిన ంతానాన్ని అంతం చేసి అప్పుడు విడిచి పెడతాను.' అన్నాడు.

'అసురేంద్రా! నువ్వనుకున్నట్లు యీమె గర్భమందు దేవ శత్రువు కాదు ఉంట, హరి క్తుడు, పరమ ప్రేమ పాత్రుడు, మహా బలశాలీ, పరమ పవిత్రుడూ, అయిన మహా భక్తు న్నాడు. ఆతణ్ణి నువ్వు సంహరించ జాలవు.' అన్న దేవర్షి వచనాలను ఆలకించిన దేవేంద్రుడు తల్లిని సగౌరవంగా విడిచిపెట్టాడు. ఆమె గర్భంలో భగవద్భక్తుడున్నాడన్న దేవర్షి సత్య చనాలయందు విశ్వాస ముంచి మహేంద్రుడు ఆమె గర్భంలో భగవద్భక్తుడున్నాడన్న వంతో నా తల్లికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి స్వస్థానానికి వెళ్ళిపోయాడు.

తరువాత నారద దేవర్షి నా జననిని నిజాశ్రమానికి తీసుకు వెళ్ళి ఓదార్చి – 'పుత్రీ! నీ పడు తపస్సు చేసి మరలి వచ్చే వరకూ నా ఆశ్రమంలోనే ఉండు.' అన్న ఆ దివ్యర్షి శానుసారం – నా జనకుడు తపస్సు నుండి మరలి వచ్చే వరకూ అక్కడే ఉండిపోయింది. క్షేమాన్ని కాంక్షించి నా తండ్రి తపో భూమి నుండి మరలి వచ్చే వరకూ నన్ను గర్భ దే ధరించి నారద దేవర్షి శుశ్రూషలో ఉండి పోయింది. ఆ దేవర్షి పరమ దయాసముద్రుడు శక్తి సంపన్నుడూ కావడం వల్ల నా జననికి విశుద్ధ జ్ఞాన యుక్తమైన భాగవత ధర్మోప చేశాడు. తత్సమయంలో ఆ మహాత్ముని దృష్టి నామీద కూడ ఉంది. చిరకాలం గతించి పోవ వల్లా, అబల కావడం వల్లా నా జనని నారదోపదిష్టమైన జ్ఞానాన్ని మరచిపోయింది. ఆ మహా దివ్యానుగ్రహం వల్ల అజ్ఞానంలో స్థిరంగా ఉండిపోయింది. శ్రద్ధాసక్తులతో గ్రహించ స్తే, నా వచనాలపై మీకు దృఢ విశ్వాస ముంటే ఆ జ్ఞానం మీకు లభిస్తుంది. శ్రద్ధ ఉంటే గాలుర బుద్ధి కూడ నా బుద్ధిలా విశుద్ధమై భాసిల్లుతుంది. భగవచ్ఛక్తి అయిన కాల ప్రేరణ తరువులు పుష్పించి ఫలించి వర్ధిల్లి క్షీణించి నాశనమైనట్లే జన్మ, అస్థిత్వ, వృద్ధి, పరి క్షయ, నాశనాలనే షడ్భావ యుక్తమైన వికారాలు దేహంలో గోచరమవుతూన్నాయి. ఈ బు ఆత్మలో లేవు. నిత్యమై, నిర్వికారమై, నాశనరహితమై, శుద్ధమై, అద్వితీయమై,

క్షి, ఆశ్రయ, స్వప్రకాశ, సర్వ కారణ, వ్యాపక అసంగ, ఆవరణ రహితాది లక్షణయుత
ఆత్మ అని గ్రహించాలి. ఈ ద్వాదశ లక్షణాలు దానికి ఉత్కృష్టమైన లక్షణాలు.
్వారా ఆత్మను గ్రహించగోరువాడు. 'అహం — మమేతి భావాలను త్యజించాలి. బంగారు
ండి గ్రహించిన రాళ్ళ నుండి — విధి తెలిసిన స్వర్ణకారుడు బంగారాన్ని తీయగలుగునట్లే
క్మ తత్త్వజ్ఞుడు — ఆత్మ ప్రాప్తి హేతుభూతాలైన ఉపాయాల ద్వారా దేహరూప
ందే భగవత్ సాక్షాత్కారాన్ని పొందగలుగుతాడు. మూల ప్రకృతి, మహత్తత్త్వం,
కార, పంచతన్మాత్రలను — అష్ట ప్రకృతులనీ, సత్త్వ, రజస్తమస్సులు మూడూ
కారాలు పదునారు. దశేంద్రియాలు, మనస్సూ, పంచ భూతాలూ, వీటన్నింటియందూ ఓ
తత్త్వం ఓతప్రోతమై ఉంటుంది. ఈ పంచ వింశతి తత్త్వాత్మక మైనదే యీ శరీరము
జంగమాత్మకాలని యివి రెండు తరగతులుగా ఉన్నాయి. ఈ శరీరంలో అంతఃకరణ,
మూదు లయిన అనాత్మ వస్తువులయందు — ఇది ఆత్మ కాదాను భావనను దృఢం చేసి
ఆత్మ వస్తువును అన్వేషించాలి. యావద్విశ్వ వ్యాప్తమైన ఆత్మ సర్వాతీతంగా
అంటదని గ్రహించి విశుద్ధ బుద్ధితో క్రమ క్రమంగా సృష్టి స్థితి లయాల విషయమై
చెయ్యాలి. తొందర పనికిరాదు. బుద్ధి వృత్తులైన జాగ్రత్ స్వప్న సుషుప్త్యానుభవం
కలుగుతుందో ? అది సర్వాతీతమై, సర్వ సాక్షియైన పరబ్రహ్మయై తేజరిల్లుతూన్నది.
ద్వారా గంధాశ్రయమైన వాయు జ్ఞాన కలుగుతూన్నట్లే బుద్ధికి సంబంధించిన కర్మ జన్య
ం చెందే అవస్థాత్రయం ద్వారా సాక్షీ భూతానుగతమైన ఆత్మను గ్రహించాలి, గుణ
సారంగా ఏర్పడుతూన్న జనన మరణ రూప కాల చక్రంలో పడి పరిభ్రమించే శరీర
ల కంటె అతీతమైన ఆత్మను గ్రహించలేకపోవడం వల్ల మిథ్యా ప్రపంచం యథార్థ
్తా వుంటుంది. స్వప్న సమంగా — యీ జీవుడికి దేహేంద్రియాదుల ద్వారా అనుభ
ట్టి సాంసారిక విషయ భోగాలే యదార్థంగా గోచర మవుతాయి.

'స్నేహితులారా ! త్రిగుణానుసారంగా లభించే కర్మ బీజాన్ని మీరు ఆదిలో నాశనం
. తద్వారా ప్రవాహ రూపమైన బుద్ధి వృత్తులు నాశన మవుతాయి. ఇంకా మీకు తెలి
చెప్పాలంటే దీనినే యోగమనీ, జీవులు బ్రహ్మైక్యాను సంధానమనీ చెప్పాలి. త్రిగుణా
ర్మ బీజాలను సమూలంగా నిర్మూలించాలంటే బుద్ధి వృత్తుల ప్రవాహాన్ని అరికట్టడానికి

ధనాలు అనేకంగా ఉన్నాయి. సర్వాధిక ఏకైక సాధనం అపార, అనంత శక్తి సంపన్నుడైన రమాత్మయందు నిష్కామ ప్రేమను వర్ధిల్లజేసే హరి భక్తి రూప సాధనయే సర్వ శ్రేష్ఠ నదని ఆ దేవ దేవుడే శ్రీముఖతః చెప్పియున్నాడు.

ఆచార్యుని శ్రద్ధ, భక్తి ప్రేమలతో సేవించడం తనకు ప్రాప్తమైన దానిని భగవదర్పణం చడమూ మహాత్ముల సాంగత్యమూ, దైవారాధన, భగవద్గాథలయందు శ్రద్ధాసక్తులు కలిగి చరించడం, శ్రీహరి గుణ లీలా కీర్తన, ఆ దేవ దేవుని పాదారవింద ధ్యానము, ఆలయ, వద్విగ్రహాలను సందర్శించి ప్రణమిల్లడం — అదిగా గల సాధనలవల్ల సహజమైన భగవ ము కలుగుతుంది. శ్రీహరి సర్వ శక్తి సంపన్నుడై, సర్వ భూతముల యందూ తేజరిల్లుతూ వాడన్న నిశ్చయ జ్ఞానంతో, సద్వులనూ సమ్మానిస్తూ వుంటే ఆ దేవ దేవుని అనుగ్రహానికి కుడు పాత్రు డవుతాడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలనే — అరుగురు రంగ శత్రువులనూ జయించి భగవద్భక్తి కలిగి సాధన కొనసాగించే వాడు శ్రీకృష్ణ ని పాదారవిందాలయందు అనన్య ప్రేమ భక్తులు కలవాడై మహోత్తమ పదాన్ని తాడు, భగవంతుని అత్యద్భుత పరాక్రమ, అనుపమ లీలా గుణాదులనూ తత్సంబంధిత నూ ఆలకించినప్పుడే అత్యంతానందోద్రేకంలో శరీరం రోమాంచితం కాగా ఆనంద పులు జల జల రాలుతాయి. గళం రుద్ధమవుతుంది. సంకోచ రహితంగా అట్టి భక్తుడు గొంతెత్తి తాడు. నాట్యం చేస్తాడు. గ్రహం పట్టిన వానిలా పిచ్చివానిలా, ఒకచో నవ్వుతాడు, వేరొకచో స్తాడు. మరొకవేళ ధ్యాన మగ్నుడై పోతాడు, కాలాంతరంలో దైవ భావంతో అన్యులకు కరిస్తాడు. భగవద్భావ తన్మయ వేళలో దీర్ఘ శ్వాసను పొంది 'హరీ! జగత్పతే! ణా!' అంటూ ఉచ్చైస్స్వరంతో నామాలను ఉచ్చరిస్తాడు. ఆ దశలో భక్తియోగం సిద్ధిం కత్ ప్రభావం వల్ల బంధాలన్నీ తెగిపోయి, భగవద్భావం వల్ల తాదాత్మ్యం సిద్ధించి సాధ భగవన్మయు డవుతాడు. అట్టివాడు జనన మరణ రూప బీజం నాశనం కాగా పరమాత్మను గలుగుతాడు. దుఃఖాలకు ఆలవాలమై అమంగళమైన యీ సంసారంలో తపించబడుతూన్న భగవత్ ప్రాప్తి మాత్రంచే బంధ విముక్తి ఏర్పడి సుఖ శాంతులను ప్రసాదిస్తుంది. సులు దీనినే నిర్వాణ సుఖమనీ బ్రహ్మ ప్రాప్తి అనీ అంటారు.

కనుక మిత్రులారా! మీరు కూడ పరమాత్మను స్మరించి సేవించి తరించండి. ఆకాశ

తేజరిల్లే పరమాత్మను భజించడంలో మీకు కలిగే కష్ట మేముంది? సర్వులకూ అత్యంత పాత్రుడైన హితుడూ, ఆత్మా, అయిన పరమాత్మను విడనాడి భోగ సామగ్రిని సేక రించుట ఎంతటి అజ్ఞానం? భార్య, పుత్ర, ధనాదులూ, గజ, తురగ, గో మహిషా పుత్ర పౌత్రాదులూ ఆదిగా గల సంపదలన్నీ క్షణ భంగురాలే, అయిననాడు వాటి వల్ల ఋ పొందే సుఖశాంతు లేమున్నాయి? ఐహిక సంపదలన్నీ నాశనమై పోయేవే. ం నీ చొచ్చ లక్షణాలు కలవే. ఇందులో దోష రహితాలైనవి ఏవీ లేవు. ఏకమాత్ర క్మయే దోష రహితుడు. పరమాత్మలో యింతవరకూ దోషం చూసినవాడు కానీ, విన్న సీ లేడు. అందులకై ఆ దేవ దేవుని పొందడానికై అనన్యాయత్త చిత్తంతో ఆ పరమా ధ్యానించాలి. సేవించాలి. దీనికి భిన్నంగా తాను మహా పండితుడ నన్న భావంతో ఏ ంతో ఎన్ని కర్మ లాచరించినా అట్టి వానికి ఆ కర్మ ఫలం సిద్ధించడం లేదు కదా! ఫలాలు కలగడం వల్ల దుఃఖమే లభిస్తూన్న దనడంలో సందేహం లేదు. రెండు కారణాల ానవుడు కర్మ ప్రవృత్తు డవుతూన్నాడు. సుఖాన్ని పొందడం కోసమూ, దుఃఖాలను చేసికోవడం కోసమూను, కోరికలు లేకపోవడం వల్ల అదిలో సుఖంగా శాంతితో ఉన్నాడు. వర్ధిల్లడంతో, కర్మలు కొనసాగించడంతో, పరంపరగా దుఃఖాలే ఎదురవుతూన్నాయి. డు సుఖార్థియై ఏ దేహం కోసమై పరంపరగా కర్మ లాచరిస్తూ వుంటాడో ఆ దేహం దుకదా! శునక, శృగాలాలకు ఆహారమైపోయేదీ, నాశనమే లక్షణంగా కలదీ, యీ , దీనికే యీ దశ ఉండగా దీనికి భిన్నంగా ఉండే భార్య, పుత్ర, ధన, గృహ, గజ, రాజ్య, కోశ, మంత్రి, గురు సేవకాదులను గురించి చెప్పే దేమున్నది? ఈ ధనలన్నీ దేహంతో బాటు నాశనమై పోతాయి. త్రివర్గ రూపమైన అర్థాదు లన్నీ అనర్థ కే అని గ్రహించాలి. అనంతానంద సాగరమైన ఆత్మకు యీ వస్తువుల అవసర ది? మిత్రులారా! ఈషణ్మాత్రం విచారించండి, కర్మాధీనుడై జీవుడు గర్భాదానాది పర్యంతం క్లేశాలే పొందుతూన్ననాడు అట్టి జీవికి స్వార్థ, స్వాతంత్ర్యా లన్నవి ఏమి ు? సూక్ష్మ శరీరాన్నే నిజాత్మగా భావించి తద్వారా అనేక కర్మలు చేస్తూ కర్మ కారణా దేహాన్ని పునః ధరిస్తూ వుంటాడు. అలాగే అజ్ఞానం వల్ల కర్మ కారణంగా శరీరమూ, కారణంగా కర్మ సిద్ధిస్తూనే ఉంటాయి. అందువల్ల నిష్కామ భావంతో ఆత్మ స్వరూపు

పరమాత్మనే ధ్యానించాలి. ఆ వాసుదేవునే ధర్మార్థ కామాదులు అన్నీ ఆశ్రయించి
యి. ఆ పరమాత్మ కృపా రహితంగా మానవ మాత్రునికీ ఏమీ లభించదు. సర్వ జీవు
ఆత్మయై పరమ ప్రియుడై భగవంతుడు వున్నాడు. అతడే స్వనిర్మిత పంచభూత, సూక్ష్మ
దుల ద్వారా ఏర్పడిన శరీరంలో జీవ రూపాన వ్యవహరింపబడుతూ వుంటాడు. సురా సుర
యక్ష గంధర్వ కిన్నరాదులలో ఎవరైనా — హరి చరణారవిందాలను సేవించ గలిగితే
ం కళ్యాణ భాజను లవుతారు. ఆ దేవ దేవుని ప్రసన్నుని చేసికోవడానికి సుర, భూసుర,
— అన్న భేదం కానీ, సదాచార జ్ఞాన సంపన్నత, తపో దాన యాగాదులు, శారీరిక
క శౌచ విధులూ, వ్రతానుష్ఠానాలూ — ఆదిగా గల వేవీ సహకరించవు. నిష్కామ భక్తి
లకు మాత్రమే ఆ దేవ దేవుడు వశు డవుతాడు, శేషించినవన్నీ విడంబనలు మాత్రమే.
మిత్రులారా ! మీరు మీతో సమంగా సర్వులనూ ప్రేమిస్తూ చరించండి, సర్వే సర్వత్రా
ి నట్టి పరమాత్మను సర్వ శక్తి సంపన్నుని భజించండి. దైవ భక్తి వల్ల యక్ష రాక్షస
ద్ర, గోపాలక, పక్షి, మృగాదులూ — యింకా అనేకానేక పాపులూ కూడ భగవద్భా
పొందాయి. ఈ విశ్వంలో మానవ మాత్రులు సాధించవలసిన ఏకమాత్ర పరమార్థ
• శ్రీకృష్ణ భగవానునియందు అనన్యమైన భక్తి కలిగి యుండుటయే, సర్వదా, సర్వత్రా,
స్తువులయందూ ఆ శ్రీకృష్ణ పరమాత్మను సందర్శించుటయే అనన్య భక్తి అనబడు
అని అతడు మౌనం దాల్చాడు.

—0—

# మద్భాగవత మహాపురాణము

## స్కంధం–7 అధ్యాయం-8

### నృసింహావతార ప్రాదుర్భావము - హిరణ్య కశిప సంహారము: బ్రహ్మాదులు నృసింహ భగవానుని స్తుతించుట.

నారద మహర్షి ప్రహ్లాద చరిత్రను కొనసాగిస్తూన్నాడు – 'ధర్మనందనా! ప్రహ్లాదుని
ాలను ఆలకించిన దైత్య బాలురు నిర్దోషులు కావడం వల్ల నాటినుండీ – హరి భక్తి రూప
ను మననం చేసుకో సాగారు. గురువులు బోధించే దోష భూయిష్టమైన విద్యలపై
లేక శ్రీహరి యందే మనస్సులను నిలిపి సంచరించడం చూచి గురువు లయిన చండా
లు ఆశ్చర్యపోయారు. వారు భీతిచెంది శీఘ్రంగా హిరణ్య కశిపుని చేరి ప్రహ్లాదుడు తోటి
ందరికీ విష్ణు భక్తిని బోధించి మార్చి వేశాడని చెప్పారు. అందుకు హిరణ్య కశిపుడు
ద్రిక్తుడై శరీరం కంపించగా ప్రహ్లాదుని స్వహస్తాలతోనే అంతం చెయ్యాలని నిశ్చయించు
ు. మనసేంద్రియాదులను స్వాధీనమందుంచుకున్న ప్రహ్లాదుడు వినయంగా చేతులు జోడించి
డు. యదార్థంగా ఆ భక్త శిఖామణి తిరస్కరింప దగిన వాడు కాదు. అయినా క్రూరాత్మ
ారణ్య కశిపుడు కాలనాగులా బుసలు కొడుతూ వేడి నిట్టూర్పులు విడుస్తూ క్రూర భయం
ష్టితో కుమారుని వైపు చూస్తూ కర్కశంగా – 'ఒరే మూర్ఖుడా! నువ్వు ఉద్దండుడవై
వే, స్వయంగా నువ్వు అధముడవై పతనం కావడమే కాకుండ – రాక్షస బాలురను కూడ
ందిని దుర్బోధలు చేసి పాడుచేస్తూన్నావు. నేడే నిన్ను సంహరించి యమ సదనానికి
ను. నా సాధారణ కోపానికి ఇంద్రాదులే భీతి చెందుచుండ ఎవని బలంతో నువ్వు యింత
గా నా సమక్షంలో నిలబడ గలుగుతూన్నావు? ఇదేమీ నాకు అర్థం అవడం లేదు.' అనగా
దుడు బదులు పలుకుతూన్నాడు :–

తండ్రీ! పిపీలికాది బ్రహ్మ పర్యంతం తృణాది స్తంబ పర్యంతం అల్పానల్ప భేద
ంగా చరాచర జీవరాసిని అంతా పరమాత్మ స్వాధీనంలో ఉంచుకున్నాడు. మీ నా బలాలే

ు యావద్విశ్వవ్యాప్తమైన బలాలన్నీ పరమాత్మ ప్రసాదించినవే. కాల స్వరూపుడూ అపార
క్తి సంపన్నుడూ, సర్వ నియంతా అయిన ఆది నారాయణ భగవానుదే ప్రాణుల మనో బుద్ధి,
ా బల ధైర్య, స్థైర్య ఇంద్రియాదులన్నీ అతడే అయి ఉన్నాడు. ఈ ప్రపంచ సృష్టి స్థితి
హారాలు చేసేవాడూ అతడే. ఆ శ్రీహరియే సత్త్వ రజ స్తమో గుణాతీతుడై తేజర్ల్లు
ంటాడు. రాక్షస భావాన్ని త్యజించి మీకు సమస్త జీవులయందు సమభావం కలిగి వ్యవహ
ండి. స్వాధీనం కాక దుష్ట మార్గంలో చరించే మనసు కన్న మిన్నయైన శత్రువులు ఎవ
్వరు? సర్వ జీవరాశిలోనూ, మనస్సునందూ కూడ సమభావం కలిగి వ్యవహరించాలి. ఇంత
మిన్న అయిన భగవదారాధన మాత్రం ఏమున్నది? తన జ్ఞానాన్ని అంతటినీ దోంగి
కు పోయే అగర్భ పరమ శత్రువు లయిన అరుగురు శత్రువులనూ జయించకుండ దిశా
్వాన్నీ జయించినామనుకున్న వారి కన్న మూర్ఖు లుంటారా? జితేంద్రియులైన జ్ఞానులు
జీవులయందూ సమభావం కలిగి ఉండడం వల్ల వారి అరిషడ్వర్గం సహజంగానే నాశనమై
ంది. అట్టి దశలో వారికి బాహ్య శత్రువు అన్న వారుంటారా?' అన్నాడు.

ప్రహ్లాదుని ప్రసంగానికి హిరణ్య కశిపుడు క్రోధ తామ్రాక్షుడై — 'మూఢుడా! నీ
ాన్ని నువ్వే కోరుకుంటున్నావురా, అంతం కావాలనుకున్నవాడే నా ఆజ్ఞలను ధిక్కరిస్తాడు.
ృష్టడా వంతు! చరాచర జగత్తుకు నాకన్న మిన్నయైన ప్రభువు ఎవడున్నాడురా! జగత్ప్రభు
ాన్నావే! వాణ్ణి నువ్వెనడైనా చూశావా? చూస్తే చెప్పు ఎక్కడుంటాడు? ఎలా ఉంటాడు?
సర్వత్రా నిండి నిబిడీకృతుడై ఉన్నాడంటున్నావే? సర్వ వ్యాపకుడంటున్నావు
అంతటా ఉన్నవాడీ స్తంభంలో ఎందుకుండడు. ఈ స్తంభంలో నీ దేవుణ్ణి చూపి
? ఎంత ధైర్యం? నిన్నిప్పుడే అంతం చేస్తాను. ఆ శ్రీహరి నిన్నెలా సంరక్షిస్తాడో
ను.' అంటూ అపార బల శక్తి సంపన్నుడైన రాక్షసరాజు హిరణ్య కశిపుడు పదే పదే
దుని హింసిస్తూ తర్జన భర్జనల ద్వారా వేధిస్తూ క్రోధాన్ని ఆపుకోలేక ఒర నుండి కరవా
లాగి సింహాసనం మీది నుండి ఉరికి ఆ వేగంలో ఆ స్తంభాన్ని పొడవడంతో ఆ స్తంభం
మహా భయంకర శబ్దం బహిర్గతం కాగా తచ్ఛబ్దం వల్ల బ్రహ్మాండం పగిలి పడిపో
దా అన్నట్లుంది. దానిని విన్న లోకపాలురు సయితం ప్రళయ వేళ ఆసన్నమయినదను
ు. హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని సంహరించ వాని మీదకు శీఘ్రంగా ఉరికాడు. కాని

బలం గుండె బలం ఉన్న మహా ధైర్యశాలురైన దైత్య సేనాధిపతులు సయితం భీతిచెందే
లో వచ్చిన ఆ భయంకర ధ్వని ఎవరి వల్ల ఎక్కడ నుండి వస్తున్నదో ఎవరికీ అంతు
లేదు.

అదే సమయంలో తన భక్తుడైన ప్రహ్లాదునీ బ్రహ్మదేవునీ వచనాలను సత్యం చెయ్యా
భావంతో సర్వ వ్యాపకత్వాన్ని తెలియజేసే దివ్య సంకల్పంతో శ్రీమన్నారాయణ భగవా
అతి విచిత్ర రూపాన్ని ధరించి ప్రాదుర్భవించాడు. పూర్తిగా సింహ రూపమూ కాదు,
రమూ కాదు, నరసింహ రూపంలో అవతరించి, హిరణ్య కశిపుని ఎదురుగా నిలబడ్డాడు.
దేవుని భీకర రూపం మహా భయావహంగా ఉంది. తప్త కాంచన ప్రభలతో నేత్రాలు
స్తున్నాయి. ఆవులించినంత మాత్రాన గళమందలి కేసరాలు యిటు అటూ అల్లల్లాడు
యి. కరవాల సమమైన జిహ్వ, భయంకర దంష్ట్రలూ చప్పరిస్తూట్లున్నాయి. భృకుటి
మాత్రంచే వదనం భయప్రదంగా ఉంది. నిక్కబడి యున్న కర్ణాలు నిశ్చలంగా ఉన్నాయి.
డియున్న ముఖ, నాసికలు మందరగిరిలా ఉన్నాయి. చూచినంత మాత్రానికే భయాన్ని
కేస్తూన్నాయి, విచ్ఛిన్నమైన దవుడలు యితోధిక భయంకరంగా ఉన్నాయి. ఆ దేవ దేవుని
దేహం స్వర్గ పర్యంతం వ్యాపించింది. మెడ బలంగా బాగా మోటుగా ఉంది. వక్షఃస్థలం
గా ఉండ నడుము సన్నగా ఉంది. రోమజాలం చంద్రకిరణ సమంగా నల్లిశలా
చ అనంత భుజాలు దీర్ఘంగా ఉండ — ఆ దేవ దేవుని నఖాలు చూడ జగదేక వీరులమని
వారు కూడ అతనివి సమీపించలేక భయపడి ఉండిపోతూన్నారు. చక్రాది అయన
యుధాలూ, వజ్రాది అన్యాయుధాలూ కూడ — ఆ రాక్షసులను పలాయనం చిత్తగింప
. అదంతా చూస్తూన్న ఆ రాక్షసరాజు మాయా విశారదుడైన శ్రీహరియే ఆ రూపాన్ని
తనను అంతం చేయడానికి వచ్చాడనీ, ఆ మాయా వేషాలు తననేమి చేయగలవనీ
న్నాడు. అంతే వెంటనే ఆతడు సింహనాదం చేస్తూ గదాపాణియై నృసింహమూర్తిపై
కు పడ్డాడు. అగ్నిలో పడిన కీటకం అదృశ్య మైపోయినట్లు నృసింహ భగవానుని తేజ
ఆవరింపబడిన హిరణ్య కశిపుడు ఎవరికీ కనపడడం లేదు. సర్వ శక్తి సంపన్నుడై తేజో
డైన దైవ సన్నిధిలో యిట్టి సంఘటన జరగడం ఆశ్చర్యం కాదు సృష్ట్యాదిలో ప్రళయ
ధాంధకారాన్ని స్వతేజస్సుతో నాశనం చేయగల అనంత శక్తి సంపన్నునికి యిదొక

క్రియా ? తత్సమయంలో నృసింహ దేవునిపై హిరణ్య కశిపుడు గదను గిర గిర త్రిప్పుతూ
యోగించాడు. వాడు గదా ప్రయోగం చేస్తూండగానే — గరుడుడు సర్పాన్ని పట్టినట్లు నర
హ రూపంలో భాసిల్లుతూన్న నారాయణుడు ఆ రాక్షసుని గదా సమేతంగా పట్టుకుని క్రీడిస్తూ
తే గరుత్మంతుని నోటి నుండి జారిన సర్పంలా హిరణ్య కశిపుడు పట్టు తప్పించుకున్నాడు.
రాజా! తత్సమయంలో దేవత లందరూ మేఘాల మాటు నుండి తద్యుద్ధాన్ని తిలకిస్తూ
రు. అమరలోకం ఏనాడో ఆ మహా దైత్యుని స్వాధీనమైపోయింది. నృసింహుని పట్టు నుండి
రాక్షసుడు తప్పించుకోవడం చూసి అమరులు భయభీతు లై పోయారు. తన బల పరా
మాలకు భీతిల్లి నృసింహుడు తనను విడిచిపెట్టేశాడని హిరణ్య కశిపుడు భావించాడు. దానితో
ంచిన ధైర్యోత్సాహాలతో వాడు డాల్కత్తులు ధరించి నృసింహుని మీదకు ఉరికాడు. తత్సమ
లో డేగలా వాడు అంబరంలోకి లంఘిస్తూ డాల్కత్తులు త్రిప్పుతూ — నృసింహుడు తన
దెబ్బ కొట్టడానికి అవకాశం లేకుండా చరిస్తూంటే నరసింహుడు తత్సమయంలో చేసిన
గర్జనలకు హిరణ్య కశిపుని కనులు మూసుకుపోయి వానికి విశ్వమంతా అంధకార బంధు
పోయింది. శీఘ్రమే ఆ దేవ దేవుడు పాము — ఎలుకను పట్టుకున్నట్లు హిరణ్య కశిపుని
కున్నాడు. బ్రహ్మదత్త వర ప్రభావం వల్ల ఆ దైత్యుని దేహం వజ్ర సమంగా ఉంది.
వజ్ర ప్రయోగం వల్ల కూడ ఛిన్నాభిన్నం కాదు. ఆ దైత్యుడు నృసింహుని బంధన్నానుండి
ంచుకోవాలని ఎంతగా ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. అనంతుడైన నృసింహ
నుడు హిరణ్య కశిపుని ద్వారం దగ్గరకు తీసుకు వచ్చి విశాలమైన తొడల మీదకు లాగి గరు
డుడు సర్పాన్ని చీల్చివేసినట్లు విలాసంగా హిరణ్య కశిపుని వక్షఃస్థలాన్ని తీక్షణ నఖాలతో
శాడు. తత్సమయాన నృసింహ భగవానుని కరాళ వదనం దారుణ భయంకరమై దర్శించ
లేకుండ ఉంది. భీకరమైన దవడలు చప్పరిస్తూ వుంటే జిహ్వా వ్యాప్తమైన దవడలు రక్త
ఎర్రగా ఉన్నాయి. హిరణ్య కశిపుని వేడి నెత్తురుతో తడిసిన ముఖము, మెడయందుండే
సహితంగా మెడయు ఎర్రగా అయిపోయాయి, ఆ నృసింహ మూర్తి మత్తేభాన్ని సంహ
ల్చి చెండాడి దాని ప్రేవులను మెడలో వేసుకున్న మృగరాజులా శోభిల్లు తూన్నాడు.
నఖాలతో ఆతడు హిరణ్య కశిపుని వక్షః స్థలాన్ని విదీర్ణం ఒసి భూమిపై విసరివేశాడు.
యంలో భయంకరాకారులైన దైత్య దానవులు నృసింహమూర్తిని పరివేష్టించి శస్త్రాస్త్ర

ప్రయోగిస్తూ వుంటే అనంతుడైన నరహరి నిజ బాహు రూప సైన్యంతో నఖ రూప శస్త్రలతో దానవ సేనాధి పతులను అంతం చేసి దైత్య సమూహాన్ని రూపుమాపాడు. వీర ం చేస్తూ వికటాట్ట హాసాలతో దైత్య దానవ సేనలను రూపుమాపుతూ భయంకరంగా న్న నృసింహ దేవుని యొక్క గళ, మస్తకాలలో ఉండే రోమ జాలం యొక్క స్పర్శకు సమూహాలు విచ్ఛిన్నం కాసాగాయి. ఆ నృసింహ దేవుని కనుల నుండి బహిర్గతమయ్యే సూర్యాది గ్రహాలు ప్రకాశ హీనమై పోయాయి. ఆతని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలకు రాలు సంక్షుభితమై పోతూన్నాయి. నరహరి భీకర సింహనాదాలకు భయ భీతాలై అష్ట గా ఘీంకారాలు చేస్తూ కంపించి పోతూన్నాయి. నరహరి గళసీమలోని కేశపాశా ఘాతం వ విమానాలు అస్తవ్యస్త మవుతూన్నాయి. స్వర్గం అల్లల్లాడ సాగింది. ఆతని పాద మాత్రంచే పృథ్వి కంపించ సాగింది. ఆతని వేగానికి గిరులు లేచి పోసాగాయి. ఆ దేవ తేజస్సుచే వ్యాపించిన అంబరమూ, దిశలూ చూడ వీలు కాకుండ ఉన్నాయి. ఆ సమ ఆ నరహరిని సమీపించడానికి ఎవ్వరికీ ధైర్యం చాలడం లేదు. ఆయన క్రోధం క్షణ వర్ధిల్లుతూనే ఉంది. క్రోధ వశీభూతుడైన నరహరి - హిరణ్యకశిపుని సంహరించి భీకరా ఆ సభలో రాజిల్లుతూన్న హిరణ్య కశిపుని సింహాసనం మీద కూర్చున్నాడు. తత్సమ ఆ దారుణ భయంకర రూపాన్ని దర్శించి ఆ మూర్తిని సమీపించి సేవించే సాహసాన్ని వారెవరూ చెయ్యలేక పోతూన్నారు.

నృసింహ భగవానుడు లోక కంటకుడైన హిరణ్య కశిపుని అంతం చేసిన శుభవార్తను ంన అమర భామలు పరమానందంతో ఆ దేవ దేవునిపై పదే పదే పూలను వర్షింపజేయ . ఆ పరమాత్మను సందర్శించే దివ్య భావంతో అమరులు గుంపులు గుంపులుగా రు. దేవ దుందుభులు మ్రోగ, గంధర్వులు గానం చేస్తూండగా అప్సరలు నాట్యం శంకర, బ్రహ్మేంద్రాది దేవతలూ, మహర్షులూ, అగ్నిష్వాత్తాది పితరులూ, సిద్ధ, చారణ రులూ, నాగమను ప్రజాపతులూ, గంధర్వ, యక్ష, కింపురుషూ, అప్సరసలూ, సునందాది ార్షదాదులూ సింహాసనాసీనుడై భాసిల్లుతూన్న నృసింహ భగవానుని దూరాన నిలచి త హస్తులై నతమస్తకులై వేర్వేరుగా స్తుతించ సాగారు.

ప్రప్రథమంగా బ్రహ్మదేవుడు స్తుతిస్తూన్నాడు :— నృసింహ దేవా ! అనంతుడవైన నీ

క్తి అపారమైనది. మాయా గుణా లయిన త్రిగుణాలతో నువ్వు సృష్టిస్థితి లయాలు చేస్తూన్నా
తో నీ కెట్టి సంబంధం లేదు. నిర్వికారా! నీ కివే నా ప్రణామాలు.' అంత రుద్ర భగ
పడు :— 'దేవా! కల్పాంతమందు కానీ నువ్వు క్రోధమూర్తి వయ్యేది యిప్పుడు మాత్రం
ఏ. తుచ్ఛుడైన యీ దానవుని సంహారార్థం నువ్వు క్రోధాన్ని ధరించడం వల్ల వీడు హతమై
నాడు. వీని కుమారుడైన భక్త ప్రహ్లాదుడు నిన్ను శరణు వేడుతూన్నాడు. ప్రభో! భక్త
లా! ఈ భక్తుణ్ణి కాపాడు.' అన్నాడు.

అంత మహేంద్రుడు : పురుషోత్తమా! నువ్వు మమ్మల్ని రక్షించావు. మా యాగ
లు పునః మాకు లభించాయి. యదార్థానికి అవన్నీ సర్వాంతర్యామివైన నీవే దైత్య దాన
ల భీతి వల్ల సంకుచితాలైన మా హృదయాలు పునః భవదీయానుగ్రహం వల్ల విక
ాయి. మా యీ హృదయాలన్నీ నీకు నివాస స్థానాలే కదా! పునః మాకు లభించిన స్వర్గ
్యం కూడ కాలగ్రస్థ మయ్యేదే, నీ సేవకు లయిన వారికిది ఏమంత పెద్ద విషయం కాదు.
! నిన్ను సేవించే భక్తులకు మోక్షమే కోరదగినది కానప్పుడు ఇహపరలోక భోగాదులు
కోరదగినది అవుతాయి? నిరతిశయానందాన్ని ప్రసాదించే నీ కివే నా ప్రణామాలు.'
తరం మహర్షులు ప్రసన్నంగా — 'నృసింహ దేవా! పరమ పురుషా! నీలో లీనమైన
న్ని పునః నువ్వు తపస్సు ద్వారా సృష్టిస్తావు. దయా సాగరుడవైన నువ్వు మాయందు
దలచి తత్త్వోమార్గాన్ని కూడ మాకు ఉపదేశించినావు ఈ రాక్షసులు మా తపస్సులను
చేశారు. శరణాగత వత్సలా! మమ్ములనూ, మా తపస్సులనూ రక్షించడానికే నవ్వ
పర్భవించి సర్వ రాక్షసులనూ అంతం చేసి మమ్మల్ని అనుగ్రహించావు.' అన్నారు.
'త పితరులు — 'ప్రభూ! మా బిడ్డలు మాకై చేసే పిండాదులను యీ రాక్షసులు బలా
ంగా లాగుకుని భక్షించే వారు పవిత్ర తీర్థాలలో, పర్వ దినాలలో నైమిత్తికాలైన తిల
ాలు వారు సాగిస్తూ వుంటే తమదకాలు కూడ మాకు దక్కకుండ యీ రాక్షసులే బలా
ంగా దౌర్జన్యంగా పానం చేసివేసే వారు. నేడు నీ నిశిత నఖాలతో వారందరినీ అంతం చేసి
మా భాగాలను మాకు ప్రసాదించావు ఏకైక ధర్మ సంరక్షకా! నరసింహ దేవా! మేము
ంగా ప్రణమిల్లుతూన్నాము.' తరువాత సిద్ధులు పలుకుతూన్నారు — 'దేవాధి దేవా!
రాత్ముడు నిజ తపశ్శక్తి ద్వారా యోగ సిద్ధి సంబంధమైన మా గతులను హరించాడు.

మా శత్రువును నీ నఖాయుధాలతో చీల్చి అంతం చేశావు. మహత్తర శక్తి సంపన్నా !
పాదారవిందాలకు సాష్టాంగ ప్రణామం చేస్తూన్నాము.

అనంతరం విద్యాధరులు — 'దేవా ! లోక కంటకుడైన యీ హిరణ్యకశిపుడు స్వశక్తితో
ధారణాల ద్వారా మేము సంపాదించిన విద్యలను వ్యర్థం చేశాడు. ప్రభూ ! యాగంలో
పశువును సంహరించిన రీతిగా నువ్వు వీణ్ణి సంహరించి వీర విహారం చేశావు అట్టి భవదీయ
గృహీత నృసింహ దివ్య రూపానికి మేము నిరంతరం వందనం చేస్తూంటాము.' అనగా
అందుకుని—'దేవా ! ఈ దుర్మార్గుడు మా మస్తకన్యస్తాలయిన మణులనూ మా పత్ను
కూడ అపహరించాడు. నేడు నువ్వు యీ దురాత్ముని అంతం చేసి సతీ సమేతులమైన మాకు
ందాన్ని ప్రసాదించావు. నీ కివే మా ప్రణామాలు.' ఆ పైన మనువులు — 'దేవ దేవా !
దేశానుసారం సంచరించే మనువులమైన మా ధర్మ మర్యాదలను యీ రాక్షసుడు
చేశాడు. వీణ్ణి సంహరించి నువ్వు మాకు మహోపకారం చేశావు. స్వామీ ! మేము నీ
లము. ఆజ్ఞాపిస్తే నీ వచనాను సారం చేస్తాము.' అన్నారు. వెంటనే ప్రజాపతులు అందు
ప. — 'నృసింహ దేవా ! మమ్ములను ప్రజాపతులనుగా సృజించినది నీవే. ఈ రాక్షసుడు
విరోధాలవల్ల మేము సృష్టి చెయ్య జాలకున్నాము. ఈ లోక కంటకుని అంతం చేసిన
మయ మూర్తీ ! నీ ప్రాదుర్భావం జగత్కల్యాణ సంధాయకమైనదే అవుతుంది.'

తరువాత గంధర్వులు స్తుతిస్తూ — 'అనంత శక్తి సంపన్నా ! నరహరి దేవా ! మీకై
నట్టి, అభినయించునట్టి, కీర్తించునట్టి గాయకులమైన మమ్ములను యీ హిరణ్యకశిపుడు
కంగా తన సేవకులనుగా చేసుకున్నాడు. ఆ దుష్టునికి తగినట్లు శిక్ష వేశావు. ఈ విశ్వంలో
ష్టులకు ఎన్నడూ శుభాలు కలుగవు.' అన్న తరువాత చారణులు—'జగన్నాథా ! సజ్జనులను
ంచే యీ దురాత్ముని సంహరించావు. కనుక మేము జనన మరణ రూప సంసార చక్రా
విముక్తులమై, మోక్షపథ గాములము కావడానికి యోగ్యమైన నీ చరణ కమలాలను
వేడుతూ వున్నాము.' అన్న తరువాత యక్షులు — 'పరమాత్మా ! జన్మ జన్మార్జితమైన
విశేషం వల్ల మేము నీ సేవకులలో ప్రధానులముగా పరిగణింప బడుతూన్నాము. దుష్టు
యీ రాక్షసుడు మాచే తన పల్లకీని మోయించే వాడు. ప్రకృతి నియంతా ! పరబ్రహ్మ

...స్త్రీ। నీచాతమైన మా కష్టాలను చూసి సహించజాలక నువ్వు వీనిని సంహరించేశావు.'
...న్నారు.

కింపురుషులు పలుకుతూన్నారు – 'దేవ దేవా! అత్యంత తుచ్ఛులమైన మేము కింపురుష...
. సర్వ శక్తిమంతా! మహా పురుషా! ఈ దురాత్ముని సత్పురుషులు తిరస్కరించి, ధిక్క...
...రంతోనే నువ్వు వీణ్ణి సంహరించి వేశావు.' అన్నారు. అప్పుడు వైతాళికులు పలికారు.
...ంత నాథా! మహా మహా సభలలో, యాగాదులలో కూడ భవదీయ నిర్మల యశస్సును
చేసి గౌరవ పురస్కారాలను అందుకుంటూన్నాము. ఈ దైత్యుడు మా వృత్తిని నాశనం
...ఇబ్బందులు కలుగజేశాడు. అసాధ్య రోగాన్ని సమూలంగా నాశనం చేసిన విధంగా వీణ్ణి
...ంచేసి మమ్మల్ని అనుగ్రహించావు.'

కిన్నరులు – 'ప్రభూ! కరుణా సాగరా! మేము నీ సేవకులము. మాయందు దయ
నువ్వు దుష్టాత్ముడైన హిరణ్యకశిపుని సంహరించి మాకు అభ్యుదయాన్ని ప్రసా...
...వు.' అనగా విష్ణు పార్షదులు అందుకుని – 'శరణాగత వత్సలా! నృసింహ దేవా!
...విశ్వానికి శాంతి సౌఖ్యాలను ప్రసాదించగల నీ దివ్యమంగళ నరహరి రూపాన్ని మేము
...ందర్శించాము. మా తోటి వారైన జయ విజయులే సనక సనందనాదుల శాపం వల్ల
...లై జన్మించ వారిని ఉద్ధరించడానికే నువ్విలా ప్రాదుర్భవించి దుష్ట రాక్షస సంహారం
మేము నమ్ముతూన్నాము.' అన్నారు.

—0—

## స్కంధం-7 — అధ్యాయం-9

### నృసింహదేవుని ప్రహ్లాదుడు స్తుతించుట.

నారద దేవర్షి పలుకుతూన్నాడు. – 'ధర్మరాజా! అలా శంకర బ్రహ్మేంద్రాదులూ, కాదులూ అనేక విధాల స్తుతించి కూడ ఆ నృసింహ దేవుని శాంతపరచ లేకపోయారు. దగ్గరగా కూడ పోలేక పోయారు. తదుగ్ర రూప సందర్శన శక్తి కూడ వారికి లేదు. అందరూ యోచించి లక్ష్మీదేవిని పంపారు. ఆమె ఆ భీకర నృసింహ రూపాన్ని తిల భయభీతయై – 'యిట్టి భీకర రూపాన్ని నేను గతంలో ఎన్నడూ చూడనూ లేదు. లేదు.' అంటూ ఆమె దూరంగానే నిలబడి పోయింది. అప్పుడు బ్రహ్మభగవానుడు భక్తుని పిలిచి – 'వత్సా! నీ జనకుడు కారణంగానే శ్రీహరి యిట్టి భయానక రూపాన్ని ు. కనుక నువ్వే వెళ్ళి భీకర నృసింహ రూపాన్ని శాంతింప జెయ్యి.' అన్న – గుని ఆదేశానుసారం ప్రహ్లాదుడు నృసింహ భగవానుని సమీపించి సాష్టాంగ ప్రణామం అంత భక్తవరదుడైన నృసింహదేవుడు అతణ్ణి లేవనెత్తి తన కర కమలాన్ని ఆ బాల శిరస్సుపై ఉంచాడు. ఆ దేవ దేవుని దివ్య కరార వింద సంస్పర్శ మాత్రంచే ప్రహ్లా ంచిన అశుభ సంస్కారాలన్నీ నాశనమై పోయాయి, ఆ క్షణంలోనే అతనికి పరమాత్మ సాక్షాత్కారం సిద్ధించింది. వెంటనే ఆ భక్త శిఖామణి ఆనంద పరవశుడై హరి చరణా హృదయంలో ధారణ చేశాడు. అప్పుడు వాని శరీరమంతా పులకరించి పోయింది. నుండి ఆనందాశ్రువులు జల జల రాలసాగాయి. భావ పూర్ణ హృదయంతో నిర్నిమేష ప్రహ్లాదుడు భగవానుని కేసి చూస్తూ ఏకాగ్ర భావంతో ఆ దేవ దేవునే ధ్యానిస్తూ భావ తో అతని లీలా గణాదులనే చింతనచేస్తూ ప్రేమ పూర్ణ గద్గద వాణితో నృశింహ దేవుని ంచ సాగాడు.

'దేవా! బ్రహ్మాది దేవతల, ఋషి, ముని, సిద్ధ పురుషుల బుద్ధి సత్త్వ గుణ ప్రధానం

ఉంటుంది. నీ అనంత కళ్యాణ గుణాలను ధ్యానిస్తూ నిన్ను స్తుతిస్తూ కూడ వారు నిన్ను తృప్తుని చేయజాలకున్నారు. అట్టి దశలో అసుర వంశంలో జన్మించిన నేను నిన్ను తుష్టుని చేయగలనా? ధన, కుల, రూప, తపో, విద్యా ఓజస్తేజో ప్రభావ, బల, పౌరుష, యోగాదులేవీ నిన్ను ప్రసన్నుని చేసికోవడానికి సమర్థమైనవి కావు. నిరతిశయమైన నీ వల్లనే గజేంద్రునికి కూడ నీ అనుగ్రహం లభించింది. ఉపర్యుక్త ద్వాదశ లక్షణాలూ కలిగి డే అయినా నీ భక్తి లేనివాడయితే వాని జీవితం వ్యర్థమే అవుతుంది. నీ భక్తి కలిగి ధన, మనో వచన, కర్మ, ప్రాణాదులు నీ చరణారవిందాలయందు సమర్పణ చేసిన లుడే అయినా మేలనడం నిర్వివాదాంశమే. నేను ఉన్నత వంశంలో పుట్టానని గర్వించే డు ఏనాటికీ పవిత్రుడవలేడు. సర్వశక్తి సంపన్నా! స్వస్వరూప సాక్షాత్కారం వల్లనే . పరిపూర్ణుడవు అవుతావు. క్షుద్రుల ద్వారా కొనసాగే పూజాదులతో నీకు పని లేదు. నా కరుణా సముద్రుడైన పరమాత్మ భక్తులకు హితాన్ని చేకూరాలన్న సంకల్పంతో వారి చేయబడే పూజాదులను అందుకుంటాడు. అద్దంలో ప్రతిబింబించే వదనాన్ని తిలకాదుల సింగారించుకుని ఆనందించునట్లు భక్తుడైనవాడు భగవత్ ప్రీత్యర్థం చేసే పూజా సమ్మా ఆతనికే ప్రాప్తిస్తాయి. అందులకే సర్వదా అయోగ్యుడనై కూడ నేను - అనధికారినై సందేహం లేకుండ సర్వవిధాలా శక్త్యానుసారం నీ మహిమను వర్ణిస్తున్నాను. నీ లీలా వర్ణనాదులవల్ల అవిద్యా జనితమైన సంసార బంధనం నశించి మానవుడు పవిత్రు డు. సత్త్వగుణాశ్రయా! బ్రహ్మాది దేవత లందరూ నీ ఆజ్ఞానువర్తులైన భక్తులే, లమైన మావారి వలె అమరులు మిమ్ము ఎన్నడూ ద్వేషించరు కదా! ప్రభూ! నువ్వు క సౌందర్యం కల అవతారాదులను ధరించి యీ జగత్తుకు కళ్యాణాన్నీ, అభ్యుదయాన్నీ గహించడానికే లీలలు అనేకంగా ప్రసాదిస్తూ వుంటావు. నువ్వు క్రోధాన్ని ధరించిన అంతమై పోయాడు. సర్ప, వృశ్చికాది విష జంతువులను అంతం చేసినంత మాత్రానికే మాత్రుడు సంతసిస్తాడు. అట్టి దశలో లోక కంటకుడైన దుష్ట దైత్యుని నువ్వు చెయ్యడం వల్ల సర్వులకూ సుఖశాంతులు కలిగాయి. నీ శాంత దివ్యమంగళ సుందర న్ని సందర్శించాలని అందరి కందరూ అభిలషిస్తూ వున్నారు. నృసింహ దేవా! వారణార్థం భక్తులు నీ యీ అభయప్రద రూపాన్ని ధ్యానించెదరు గాక! పరంధామా!

నం అత్యంత భయావహమై చూడ వీలు కాకుండ వుంది. నీ జిహ్వ వజ్రసమానంగా వుంది,
ర సమ ప్రభలతో నీ నయనాలు భాసిల్లు తూన్నాయి. నీ భృకుటీ విలాసమూ, నిశితమైన
లూ, ప్రేవుల మాలికలూ, రక్త సిక్తమైన మెడలోని రోమ జాలమూ శంకు వలె నిలచిన
', అష్ట దిగ్గజాలను సయితం భయ కంపితం చేయునట్టి నీ సింహ నాదమూ, వైరి వీరు
ల్చి చెండాడు నట్టి నీ నిశిత నఖాలూ, చరాచర విశ్వానికి భయం కలిగిస్తూన్నా నాకు
ం భయం కలగడం లేదు. కానీ యీ సంసార చక్రంలో పడి నలగడంలో భయపడు
ను. దీనజన వత్సలా! స్వకర్మ పాశ బద్ధుడనై భయంకర ప్రాణుల మధ్య పడి
ను. స్వామీ! దయదలచి జీవు లన్నింటి ఏకమాత్ర శరణ్యమూ, మోక్ష ప్రదమూ,
నీ పాదారవిందాల సన్నిధానానికి ఎన్నడు పిలచెదవో కదా! అప్రమేయా! నేను జన్మిం
మస్త యోనులలోనూ కూడ ప్రియ వియోగ, అప్రియ సంయోగాలు కారణంగా శోక
దగ్ధుడనై తపింపబడు తూన్నాను. తద్దుఃఖ నివారణకు చికిత్సలు కూడ మరో దుఃఖానికి
మవుతూన్నవి. అజ్ఞాన వశుడనై నాకన్న భిన్నమైన వస్తువులలో ఆత్మ
కలవాడనై అటూ యిటూ తిరుగులాడు తూన్నాను. నీపై సంపూర్ణ,
కలిగి ఉండే ఉపాయం చెప్పు ప్రభో! నువ్వు నాకు పరమాప్తుడవు.
రహితమైన హితైషివీ సుహృదుడవూ కూడ, నిజానికి నువ్వే. సర్వారాధ్యుడవు. బ్రహ్మ
గానం చేయబడిన నీ లీలలను గానం చేస్తూ సుగమంగా రాగాది ప్రాకృత గుణాల నుండి
ుడనై కఠినమైన యీ సంసార సాగరం నుండి తరించెదను గాక! సర్వదా నీ చరణ
ధ్యానాసక్తు లయిన పరమ హంసల సాంగత్యం నాకు లభించును గాక! నృసింహ దేవా!
పంచంలో జీవుల దుఃఖాలు రూపుమాపడానికి ఉపాయాలు ఎన్ని అయితే చెప్పబడ్డాయో?
ఉపాయాలూ కూడ నీ అనుగ్రహ రహితంగా ఫలించవు. నీ కరుణ లేకపోతే బాలురను
పితరులు రక్షించ జాలరు, రోగాలను మహౌషధాలు నివారించ లేవు. సముద్రంలో పడి
పోయే వానికి నౌక లభించదు. సత్త్వ రజస్తమో గుణాలు కారణంగా విభిన్న భావాలు
శ్రేష్ఠు లయిన బ్రహ్మాదులూ కాలాది కనిష్ఠ కర్తలూ - అయిన వారందరి కందరినీ ఆయా
ముందు నువ్వే ప్రేరేపిస్తూంటావు. నీ ప్రేరణ వల్లనే ఏ యాధారంలో ఉండి, ఏ నిమి
', ఏ మృణ్మయాది ఉపకరణాల ద్వారా ఏ సమయంలో ఏ సాధనాలతో ఏ అదృష్టాదుల

కారం వల్ల ఏ ప్రయోజనోద్దేశ్యంతో ఏవిధం వల్ల వేటిని పుట్టిస్తూన్నారో? అంటే రూపాంత క్రింద పరిణమింప జేస్తూన్నారో ఆ రూపాలూ, ఆ నిర్మాతలూ సర్వమూ నీవే. నీ కన్న మైనది యీ చరాచర జగత్తులో ఏదీ లేదు.

పురుషానుమతిపై కాలం ద్వారా గుణాలయందు సంక్షోభం కలిగిన నాడు మాయ ప్రధానమైన యీ లింగ శరీర నిర్మాణం చేస్తుంది. అనేక నామ రూపాలయం దాసక్తమై లింగ శరీరం కర్మ మయమై ఛందోమయమై ఉంటుంది. అవిద్యా కల్పితమైన మనస్సు యే. అవిద్యా కల్పితమైన మనస్సు దశేంద్రియాలూ, పంచ తన్మాత్రలూ, యీ షోడశ గాలైన అరులతో కూడిన యీ సంసార చక్రంలో పడినవాడు - నీకన్న భిన్నుడై ఉండి ఎవడ కలడు? సర్వ శక్తి సంపన్నా! జగన్నాథా! ఈ సంసార చక్రంలో పడిన నన్ను చెరకు రసాన్ని పీల్చి పిప్పిచేసే రీతిగా చేస్తూన్నది. స్వచైతన్య శక్తి ద్వారా బుద్ధి సంబంధ గుణా లన్నింటినీ నువ్వు సర్వదా జయిస్తూ వుంటావు. సర్వ సాధనలనూ కాల స్వరూపంతో స్వాధీనంలో ఉంచుకుంటావు నిన్ను నేను శరణు వేడుతూన్నాను. శ్రీహరీ! నువ్వు కరుణించి యీ సంసార చక్రాన్నుండి తప్పించి నీ సన్నిధానానికి చేర్చుకొనెదవు గాక! మణా! సంసారులు అత్యంతాసక్తి కలిగి ఉంటే సర్వలోక పాలుర అయుర్దాయాన్నీ, శ్వర్యాదులనూ నేను చూశాను. నా జనకుడు కళ్ళు ఎర్రజేసిననాడు మహేంద్రాదులకు ఆ శ్వర్యాదులవల్ల ప్రయోజనం లేకపోయింది. సర్వులనూ జయించిన నా తండ్రిని నువ్వు మాసంగా అంతం చేశావు ఇవన్నీ చూస్తూ వుంటే బ్రహ్మ పర్యంతం ఉండే ఆయుర్దాయ శ్వర్య. ఇంద్రియ భోగాదులన్నీ యీ ప్రాపంచికు లందరూ సర్వదా వాంఛిస్తూనే రు. వాటిని నేను మాత్రం కోరడం లేదు. హేతు వేమంటే — వీటన్నింటినీ మహత్తర సంపన్నమైన కాల స్వరూపంలో నువ్వు వీటి నన్నిటినీ ఆరగిస్తావు. కనుక నువ్వు నన్ను ఘల సన్నిధిలో ఉంచు, వినడానికి విషయ భోగ సంబంధమైన పలుకులు యింపుగానే యి. కానీ యదార్థానికి అవి మృగతృష్ణ జల సమంగా అసత్యాలే. ఆ భోగాలను అనుభ యీ దేహం కూడ రోగాలకు నిలయమైనది అసత్యరూపాలైన విషయ భోగా లెక్కడ? లకు ఆలవాలమైన యీ శరీర మెక్కడ? క్షణ భంగురాలూ, సారహీనాలూ అని తెలిసి యీ మానవుడు విషయ వాసనలలో విరక్తుడు కావడం లేదు. కఠిన ప్రాపాలైన భోగ

ధిత అత్యల్ప మధు బిందువులతో కామాగ్నిని ప్రజ్వరిల్ల చేస్తూనే ఉన్నాడు. స్వామీ!
పణ ప్రధాన రాక్షస వంశంలో రజో గుణం వల్ల జన్మించిన నేనెక్కడ? లక్ష్మీ,
ల మస్తకాలపై కూడ ఎన్నడూ ఉంచని అనంత కరుణా కటాక్ష యుక్తమైన నీ దివ్య
విందాన్ని నా శిరస్సుపై ఉంచుట ఎక్కడ? సామాన్య ప్రాపంచికుల వలె నీ దృష్టిలో
ం తారతమ్యం లేదు, సర్వాత్మ స్వరూపుడవే అయినా నువ్వు కల్పవృక్ష సముడవు. నీ
సంకీర్తన మాత్రం చేతనే నీ దయ లభిస్తుంది కానీ యితరేతర సాధనల ద్వారా మాత్రం
సేవానా గుణం గానే నీ కరుణ మానవులపై ప్రసరిస్తుంది. అందు జాతి గతమైన చిన్న
న్న భావా లుండవు. దేవాధి దేవా! అంధకారమయ కూప సమమైన యీ ప్రపంచంలో
రిని కాటు వేయ కాల సర్పం సర్వదా సన్నద్ధంగా ఉంటుంది. భోగ లాలసులు యీ మహా
ందే పడుతూ వుంటారు. వారిలా నేను కూడ సంసార ఘోరాంధకార కూపంలో పడే
- కరుణా వశుడై నారద దేవర్షి నన్ననుగ్రహించి నీ తత్త్వాన్ని బోధించాడు. నేను భక్తి
న్ని గ్రహించిన నేను భక్తులను సేవించకుండ ఎలా ఉండగలను? అనంతా! సర్వ వ్యాపకు
భగవంతుడవైన నిన్ను చూపుమని ఒరనుండి కరవాలాన్ని లాగి నా తండ్రి నన్ను
చేయ గర్జిస్తూ నా మీదకు ఉరికే సమయాన నువ్వీ రూపంలో ప్రాదుర్భవించి నన్ను
నా తండ్రిని అంతం చేశావు. నీ భక్తులూ, తపోధనులూ అయిన సనక సనందాదుల
ను సత్యం చేయడానికే నువ్వు ప్రాదుర్భవించినావని నేను తెలుసు కున్నాను.

'స్వామీ! ఈ విశ్వమంతా అద్వితీయుడవైన నీ స్వరూపమే. కారణ మేమన విశ్వాది
రూపంలో నువ్వే ఉన్నావు. అంతంలో కూడ నువ్వే విరాజిల్లుతూ మధ్యలో కూడ నువ్వే
మవుతూంటావు. నువ్వు నిజ మాయ గుణ పరిణామ రూపమైన సృష్టి చేసి అది నుండి
వ్యాపకుడవుగా వుంటూ కూడ నవ్యంగా ప్రవేశించు విధంగా నీ లీలల ద్వారా నటిస్తూ
గుణాలతో, అనంత రూపాలతో భాసిస్తూ వుంటావు, కార్య కారణ రూపంలో కానవచ్చే
ంతా నీ స్వరూపమే. విశ్వాతీతమైనది కూడ నీ రూపమే. విశ్వా తీతుడవు కూడ నువ్వే,
భేదాలు అర్థరహితమైన మాయా శబ్ద జాలమే. సృష్టిస్థితి సంహారాలు మాయా కల్పి
బీజ వృక్షాలు కార్య కారణ దృష్ట్యా భిన్న భిన్నంగా గోచరించినా గంధ తన్మాత్ర దృష్ట్యా
ఒకటే అని తెలిసికోవాలి, విశ్వాన్నంతటినీ నీలో లయం చేసుకుని ఆత్మ సుఖానుభూతి

ందుతూ నిష్క్రియుడవై ప్రళయ పయోధిలో శయనించి వుంటావు. తత్సమయంలో స్వయం
యోగం ద్వారా బాహ్య దృష్టిని నిరోధించి స్వస్వరూప ప్రకాశంలో నిద్రను లయం చేసి
య పదమం దుంటావు. అవ్వేళ నువ్వు తమోగుణ యుక్తుడవు కాకుండడం వల్ల విషయా
ను స్వీకరించవు. నిజ కాల శక్తి ద్వారా ప్రకృతి గుణాలను ప్రేరేపిస్తూంటావు. కనుక నే బ్రహ్మాం
నీ దేహంగా పరిగణింపబడుతూ వుంది ఆదిలో యీ బ్రహ్మాండం నీలోనే లయమవుతుంది.
లయ సాగర మధ్య శేషశయ్యపై శయనించునట్టి నువ్వు యోగ నిద్రారూప మయిన సమాధిని
ంచిన వేళలో వట బీజం నుండి వట వృక్షం పుట్టినట్లు నీ నాభి నుండి బ్రహ్మాండ కమలం ఆవిర్భ
ంది. ఆ కమలంలో సూక్ష్మ దర్శి అయిన బ్రహ్మ ప్రాదుర్భవిస్తాడు. ఆ బ్రహ్మకు ఆ
ం వినా ఏమీ కానరాకపోవడం వల్ల తనలో బీజ రూపాన ఉన్న నిన్ను చూడజాలక
్యంలో అన్వేషణారంభించి ప్రళయ సాగర జలాల ప్రవేశించి శత సంవత్సరాల కాలం
నా అక్కడ దేవినీ చూడలేకపోయాడు. బీజంలో అంకురం బయలుదేరి మొలకెత్తిన మీదట
ఎక్కడుంటుంది? ఆశ్చర్య మగ్నుడై బ్రహ్మ మరల కమలం చేరి చిరకాలమైన మీదట
ప్ప ఆరంభించాడు. విశుద్ధాంతరంగుడై భూతేంద్రియాంతఃకరణలతో కూడి - తనయందే
స్తున్న నిన్ను సందర్శించ గలిగాడు. గంధ తన్మాత్ర పృథ్విలో సూక్ష్మ రూపాన
ంచి ఉన్నట్లే నువ్వు కూడ సర్వే సర్వత్రా నిండి నిబిడీకృతుడవై ఉన్నావు. సహస్ర
ాలతో, ముఖ, చరణ, హస్త, జంఘ, నాసిక, కర్ణ, నయన ఆ భూషణాలూ, వివిధావయ
, గల నీ విరాట్ స్వరూపాన్ని సందర్శించి బ్రహ్మానంద పరవశు డయ్యాడు. రజోగుణ,
గుణ రూపులైన మధుకైటభులనే దానవులు ప్రభవించి వేదాలు హరించగా - నువ్వు హయ
రూపం ధరించి వారిని అంతం చేసి వేదాలను బ్రహ్మకు ప్రసాదించిన నీ ఆ రూపం
ుణ ప్రధానమైనది కావడం వల్ల సత్పురుషులు ఆ సత్త్వ గుణ ప్రధాన రూపాన్నే
్తాంటారు. పురుషోత్తమా! నువ్వు ఆలాగుననే నర, పశు, పక్షి, ఋషి, దేవ మత్స్యాది
ా లెత్తి విశ్వ ద్రోహులైన అసురులను అంతంచేసి సర్వులనూ అనుగ్రహిస్తూంటావు,
యుగాలలో నువ్వు ప్రత్యేక రూపంలో అవతరించి యుగ ధర్మ రక్షణ చేస్తూంటావు.
గాన మాత్రం గుప్త రూపంలో ఉంటావు. అందుకనే మనీషులు నిన్ను 'త్రియుగ' అన్న

గే కూడ పిలుస్తూంటారు. శ్రీహరి దేవా! అనేక దుర్దశల కాలవాలమైన నా మనస్సు
దుర్దశ కాలవాలమై పాప వాసనా భూయిష్ఠమైన కలుషితమై పోయింది. సహజంగానే
న మనస్సు వాంఛలు కారణంగా ఆతురతతో - హర్ష, శోక, భయ, లోక, పరలోక,
స్త్రీ, పుత్రాది చింతా వ్యాకులమై పోతూంటుంది. ఇట్టి మనస్సుతో నేను నిన్నెలా ధ్యానిం
తృప్తి అన్నదే లేని నాలుక నన్ను సర్వదా స్వాదిష్ట రసాలవైపు ఆకర్షిస్తూనే ఉంది.
ంగనలవైపు జననేంద్రియమూ కోమల స్పర్శకోసం చర్మమూ, భక్ష్యాదులవైపు ఉద
మధుర సంగీత శ్రవణార్థం కర్ణాలూ, సుగంధార్థం నాసికయూ, సుందర వస్తువులను
లని నయనాలూ నిరంతరం లాగుతూన్నాయి. స్వవిషయాలవైపు కర్మేంద్రియాలు
స్తాన్నాయి. పదిమంది పెళ్ళాలు కలవాడు వారి వారి శయన మందిరాలకు ఈడ్చుకు పోబడే
ను కూడ యీ ఇంద్రియాలచే లాగబడి పోతూన్నాను. ఇలా యీ జీవుడు నిజ కర్మ
బంధితుడై సంసార రూప దారుణ భయంకర వైతరణీ నదిలో పడిపోయి జనన
లు పొందుతూ, కర్మానుభవంతో భయభ్రాంతుడై పోతూన్నాడు, 'వీడు పరాయివాడు,
వాడు.' అన్న భేద భావంతో శత్రు మిత్ర భావాలు పొందుతూన్నాడు. జగన్నాథా!
దైన్య దశను తిలకించి కరుణా సాగరుడవైన నువ్వు ద్రవించెదవు గాక! భవసాగరం
యూ జీవులను తరింపజేసెదవు గాక! సర్వ శక్తి సంపన్నుడవైన నీ కిది ఓ పెద్ద
? అజ్ఞానవశులైనవారు కూడ మహాత్ముల అనుగ్రహానికి పాత్రులవుతూన్నారు. నాకు
రి అవసరమే లేదు. నీ భక్తజన సేవలో సంలగ్నుడనై ఉంటాను. సంసార సాగరాన్ని
న్న భయం నాకు లేదు. ప్రభూ! భవ సాగర తరణ విషయంలో అన్యులు వర్ణనాతీత
వస్థలకు గురి అవుతూన్నారు. నాకు మాత్రమే ఆ దశ రాదు. నా చిత్తం ఏనాడూ భవ
వైతరణిలో ఉండదు. అమృతాన్ని సయితం తిరస్కరించగల నీ దివ్య లీలా గాన
మృత పానంలోనే నా మనస్సు లగ్నమై ఆనందంలో మునిగిపోతుంది. నీ గుణ గానంలో
లై ఇంద్రియ సంబంధ విషయాలు మాయామయ అసత్య సుఖార్థం నెత్తిమీద సంసార
మోస్తూండే నరులను గురించి నేను విచారిస్తూంటాను ఋషి మున్యాదులు కూడ
పొందాలని అరణ్యాలలో ఏకాంత వాసంతో, మౌనంగా తపస్సు చేస్తూంటారు. నేను
వారి మార్గాన్ని అనుసరించను. అసహాయులూ, పేదలూ అయిన వారిని విడనాడి
కి ఒప్పుకోను. సంసార చక్రంలో పడి నలిగిపోయే వారికి నీ కన్న మిన్న అయిన

హంకారం లేదు. గృహాసక్తు అయినవారు నారీ సంపర్కాదుల వల్ల పొందే సుఖం, దుఃఖ ప్రదమైనది. శరీరంలో దురద బయలుదేరినప్పుడు రెండు చేతులతోనూ ంటాడు. అప్పుడు సుఖంగానే ఉన్నా తరువాత దుఃఖం తప్పదు. అలాగే సంసార సుఖం దుఃఖదాయక మైనదే. అయినా మూఢులు దీనియందు విముఖులు కాజాలకున్నారు. జ్ఞాని ని సహించిన రీతిగానే విరక్తుడు కామాదులను సహించి వాటిని నిర్మూలించు కుంటాడు. మౌనం, బ్రహ్మచర్యం శాస్త్ర శ్రవణం, తపస్సు, స్వాధ్యాయం, స్వధర్మ పాలన యుక్త శాస్త్ర వ్యాఖ్యానం, ఏకాంత సేవ, జప, సమాధీ, - యీ పదీ మోక్షాన్ని పొంద ప్రముఖ సాధనాలు. జితేంద్రియుడు కానివాని కివన్నీ జీవనాధారాలైన వ్యాపారం క్రిందకు స్తాయి. దంభాచార పరాయణునకు కూడ అంతే. మధనం ద్వారా కాష్ఠం నుండి అగ్నిని ం చేయునట్లు యోగులు భక్తి యోగ సాధనల ద్వారా కార్యకారణాలయందు తత్త్వ పొంద గలుగుతారు. యదార్థానికి యీ రెండూ నీకన్న భిన్నమైనవి మాత్రం కావు. స్వరూపాలే, పృథివ్యప్తేజో వాయు రాకాశాలూ, పంచ తన్మాత్రలు, ప్రాణేంద్రి , మనోహంకార చిత్తాలూ, యావద్విశ్వమూ, సగుణ నిర్గుణాలూ సర్వమూ నీ స్వరూ నీకన్న భిన్నమైనది లేనేలేదు. భగవన్! సత్త్వాది గుణాలూ, యీ గుణ పరిణాములైన తత్త్వాదులు అమరులూ, నరులూ - ఆదిగా గలవా రెవరూ, ఎంత ప్రయత్నించినా నీ న్న మాత్రం గ్రహించలేరు. కారణం? వారందరి కందరూ ఆద్యంతాలు కలవారే, నువ్వ ఆద్యంతాలు లేనివాడవు. ఈ విషయ విచారణ చేయుగల సమర్థు లయిన జ్ఞానులు శబ్ద మాయ నుండి విముక్తు లవుతూన్నారు పురుషోత్తమా? నిన్ను సేవించ నమస్కార, కర్మ, సమర్పణ, సేవ, పూజ చరణ కమల చింతన, కథా శ్రవణ రూపమైన అంగా యి. ఈ సాధనా రహితంగా నీ యందు భక్తి ఎలా కుదురుతుంది? భక్తి హీనునకు లభించవు. నువ్వు నిజ భక్తుల, పరమ హంసల స్వరూపుడవై ఉన్నావు. వారి యం నువ్వే.

నారద దేవర్షి ప్రహ్లాద చరిత్రను కొనసాగిస్తూన్నాడు. - ధర్మ నందనా!' అలా పరమ న ప్రహ్లాదుడు అధిక ప్రేమతో ప్రకృతి, ప్రకృతి గుణ రహితుడైన భగవంతుని పాద

ంపై వ్రాలి సాష్టాంగ ప్రణామం చేయగా — నృసింహ దేవుడు శాంతించి అత్యంత
క ప్రేమలతో ప్రహ్లాదుని చూస్తూ – 'కళ్యాణమూర్తీ! ప్రహ్లాదా! నీకు శుభ మగుగా
క్తా! నీ యందు నేను ప్రసన్నుడ నయ్యాను నీ అభీష్టాన్ని వివరించు, వర ప్రదాత
ను నీకు వరమీయ సంసిద్ధంగా ఉన్నాను. ఆయుష్మంతా! నన్ను ప్రసన్నుని చేసుకో
వారికి నా దర్శనం లభించదు. నా దర్శన భాగ్యాన్ని పొందిన వానికి హృదయ తాప
ఉండనే ఉండదు. నేను సర్వాభీష్టాలనూ నెరవేర్చు వాడను కావడం వల్ల కళ్యాణ
లయిన సాధు పుంగవులు జితేంద్రియులై సర్వ విధాలా నన్నే ప్రసన్నుని చేసుకో
స్తూంటారు.' అన్నాడు.

అనన్య ప్రేమ భక్తులు కల ప్రహ్లాదుడు వర లోభంలో చిక్కు కొనక నిశ్చలుడై
పోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-7 — అధ్యాయం-10

### ప్రహ్లాదుని పట్టాభిషేకము – త్రిపుర దహనము.

నారద దేవర్షి పలుకు తూన్నాడు :— 'ధర్మనందనా! వయస్సుకు చిన్నవాడే అయినా
దుడు భక్తిలో వృద్ధుడు కావడం వల్ల – వరాలు స్వీకరిస్తే ప్రేమ రూపమైన భక్తికి
కం కలుగుతుందని గ్రహించి చిరునవ్వు నవ్వుతూ నృసింహ భగవానునితో అంటూన్నాడు.

నృసింహ దేవా! జన్మతః నేను భోగాల యందు ఆసక్తి కలవాడను. భోగ సంగానికి
నేను సంగ విముక్తికై నీ శరణు కోరాను, దేవా! నాలో భక్తి లక్షణా లున్నదీ లేనిదీ -
ంచడానికే నువ్వు వరం కోరుకో మన్నావు. ఇది భోగ జనితమైన హృదయ గత ప్రహారా

ను వర్ధిల్ల జేస్తుందే గానీ వాటిని రూపుమాపదు. పైగా జనన మరణ రూపమైన కాల చక్రంలో
వవేసి త్రిప్పుతూ ఉంటుంది. దేవాధి దేవా! నన్ను పరీక్షించ వరమిస్తా నన్నావే కానీ వేరే
రణమేదీ లేదు. కరుణా మూర్తివై యుండీ కూడ నీ భక్తజనులను సంసార కూపంలోకి
ందుకు త్రోసివేస్తావు. నీ ద్వారా అభీష్టాలను నెరవేర్చుకోవాలని కోరేవాడు యదార్థమైన సేవా
ర్మం తెలిసినవా డవుతాడా? అట్టి వాడు యిచ్చి పుచ్చుకునే వ్యాపారియే అవుతాడు. తన కోరి
నెరవేర్చుకునేవాడు ప్రభు సేవకు డెలా అవుతాడు? సేవకులచే సేవలు చేయించుకుంటూ
ను యజమానిగా ఉండాలనుకునేవాడు ప్రభువూ కాడు. నేను నిష్కామ సేవకుడను. నువ్వు
కు ఫలాపేక్ష లేని ప్రభుడవై వున్నావు. పరస్పర ప్రయోజన వాంఛతో రాజ – సేవకుల మధ్య
బంధం ఏర్పడుతుంది. కానీ మన యిద్దరి సంబంధం అట్టిది కాదు. వరదా!
సింహ దేవా! నువ్వు నాకు వరమీయ దలిస్తే నా కెన్నడూ ఎట్టి వాంఛలూ కలుగనీయ
డు నట్టి వరాన్ని ప్రసాదించు. వాంఛలు హృదయంలో ప్రభవిస్తే ప్రాణేంద్రియ, మనో
, ధర్మ ధైర్య బుద్ధి, లజ్జ, శ్రీ, తేజ, స్మృతి, సత్త్వాదులన్నీ నశిస్తాయి. కమల
నా! మానవుడు కామ పరిత్యాగం చేయ గలుగు సమయంలోనే వానికి భగవత్ ప్రాప్తి
స్తుంది. దేవా! నీకు వందనాలు. సర్వ హృదయాంతర్వర్తివైన నువ్వు ఉదార శిరోమణివి.
ంహ రూపంలో ఉన్న శ్రీహరి దేవా! నీ చరణారవిందాలకు వందనాలు.' అంటూ బద్ధాం
యై మౌనంగా నిలబడ్డాడు.

నృసింహ భగవానుడు పలుకుతూన్నాడు – 'ప్రహ్లాదా! ఇహ పరాలలో ఎక్కడా నీ వలె
ప్రేమ రూపమైన భక్తిని సాధించినవాడు లేడు. నీవంటి వాడు ఇహ పరాభీష్టాలను
కు. అయినా నువ్వు ఓ మన్వంతర కాల పర్యంతం యిక్కడే ఉండి దైత్యాధిపత్త్వ
వహించి సత్కర్మానుష్ఠానం ద్వారా నా దివ్యానుగ్రహాన్ని వర్ధిల్ల చేసుకో. యాగ భోక్త
నేనే సర్వ హృదయాంతర్వర్తినై ఉండే నన్నే నిజ హృదయంలో సందర్శిస్తూండు.
భూయిష్టమైన నా గాథలను ఆలకిస్తూంటాడు. తద్వారా సత్కర్మల ద్వారా నా గాథలను
స్తూ, ప్రారబ్ధ కర్మకు క్షయం చేసుకుంటూ భోగానుభవంతో పురాతన కర్మ ఫలాన్నీ,
మ పుణ్య కర్మలతో పాప కర్మ ఫలాన్నీ నాశనం చేసుకుని, సమయం రాగానే యీ
త్యాగం చేసి కర్మ బంధ విముక్తుడవై నా సన్నిధానానికి వచ్చెదవు గాక! నీ సద్య

ను అమరులు సహితం గానం చేసెదరు గాక! నన్నుద్దేశించి నీ ద్వారా చేయబడిన యీ 'న్ని పఠించేవాడు సర్వ బంధ విముక్తు డగును గాక!' అని నృసింహ దేవుడు మౌనం డు.

'పరంధామా! పరమాత్మా! వరదాత అయిన అమరులకు సహితం నువ్వే స్వామివై వు. నేను నిన్ను మరో వరం కోరుతున్నాను. భవదీయ మహత్తర తేజస్సును నా జనకుడు ంచలేక పోయాడు. చరాచర జగన్నాథుడవూ సర్వ శక్తి సంపన్నుడవూ అయిన నిన్ను కో జాలక — తన సోదరుని అంతం చేశావన్న ఆగ్రహంతో శతృత్వం వహించి నిన్ను విధాల నిందించాడు. క్రోధ వశుడైన నా తండ్రి నీకు అనేక అపచారాలు చేశాడు. దయా ! నీ దృక్ప్రసార మాత్రంచే అతడు కూడ పవిత్రు డవుతాడు. శీఘ్రమే నా తండ్రిని మాటుని చేసి మోక్షాన్ని ప్రసాదించెదవు గాక!' అన్నాడు. అంత నృసింహ భగవానుడు:- ! ప్రహ్లాదా! నీ ప్రాదుర్భావ మాత్రం చేతనే నీ తండ్రి పాప శూన్యుడై తరించాడు. ాడు నీ వల్ల నీ వంశంలోని 21 తరాల వరకూ నీ వారంతా తరిస్తారు. వంశానికి నీ వంటి కొక్కడు ఉదయిస్తే వంశమంతా తరిస్తుందనడంలో సందేహం ఎంత మాత్రం లేదు. ై, సమ దర్శనుడై సదాచారాన్ని అవతరించే భక్తు లుండే ప్రదేశం ఎట్టిదైనా పవిత్ర ంది. నా భక్తు డైనవాడు — వాంఛా దూరుడై, ఆత్మ భావం కలవాడై చరించడం వల్ల అనర్థాన్ని కలిగించడు. విశ్వంలో నీ అనుయాయులు కూడ నా భక్తులే అవుతారు. భక్తజను లందరికీ నువ్వు ఆదర్శ ప్రాయుడ వయ్యెదవు గాక! మదీయాంగ స్పర్శవల్ల కుడు పవిత్రు డయ్యాడు. నీ తండ్రికి నువ్వు అంత్యక్రియలు పూర్తి చెయ్యి. నీ వంటి ని వల్ల నీ తండ్రి అవశ్యం ఉత్తమ లోకం పొందుతాడు. నీ తండ్రి పాదాల దగ్గర , వేద విదుల ఆదేశానుసారం మనస్సును నామీదనే లగ్నం చేసి నన్నే శరణువేడి నా సమస్త కర్మలూ ఆచరించు.' అన్నాడు.

భగవదాదేశానుసారం ప్రహ్లాదుడు జనకుని అంత్యేష్టి క్రియలు పూర్తిచేసిన తరువాత ోత్తములు ప్రహ్లాదునకు పట్టాభిషేకం చేశారు. తత్సమయంలో దేవ, ఋషి సమేతుడైన — ప్రసన్న వదనుడైన నృసింహ భగవానుని తిలకించి స్తుతిస్తూ — 'దేవాధి దేవా!

లకు ప్రాణదాతవై, సర్వాంతర్యామి వైన నువ్వు నాకు జనకుడవై యున్నావు. త్రిలోక
ను అనేక విధాల పీడించిన యీ క్రూర రాక్షసుడు అంతమయాడు. వీణ్ణి అంతం చేసి
నూ అనుగ్రహించావు. 'నా సృష్టిలోని ఎవ్వరూ నిన్ను సంహరించకుందురు గాక!' అని
నికి వరమిచ్చాను. నా వర మద గర్వితుడై యీ దురాత్ముడు తపో యోగ బలాలు
గా ఉచ్ఛృంఖల ప్రవృత్తితో వేద విదులకు కూడ యిబ్బందులను కలగజేశాడు. కుమార
ని కూడ అంతం చెయ్యాలని విశేష ప్రయత్నాలు చేశాడు, కానీ నీ రక్షణ పొందిన
డు మృత్యు ముఖం నుండి బయట పడగలిగాడు. తద్వారా దీనివల్ల సమస్త విశ్వానికీ
ంగళాలు చేకూరాయి, భగవన్. నీ యీ మంగళమయ నృసింహ రూపాన్ని ఏకాగ్ర
తో వాడు ధ్యానించునట్టి భయదూరు డవుతాడు. అట్టి వానిని మృత్యువు కూడ ఏమీ చెయ్య
.' అన్నాడు.

'కుమారా! బ్రహ్మా! నువ్వెన్నడూ అసురులకు యిట్టి వరాలివ్వకు సహజ క్రూరు
వీరికి వరాలిస్తే పాముకు పాలుపోసినట్లవుతుంది.' అంటూ నృసింహ భగవానుడు అంత
పోయాడు. అంత ప్రహ్లాదుడు శంకర, బ్రహ్మేంద్రాదుల నందరినీ పూజించి నతమస్త
ప్రణమిల్లాడు. అంత బ్రహ్మ శుక్రాచార్యాది మహర్షి బృందం ద్వారా ప్రహ్లాదుని ఆశీర్వ
అభినందించగా వారి నందరినీ ప్రహ్లాదుడు సత్కరించాడు. తరువాత అందరి కందరూ
ాలకు మరలిపోయారు.' అంటూ నారదమహర్షి పలుకు తూన్నాడు.

'ధర్మనందనా! అలా విష్ణు పార్షదు లయిన జయ విజయులే దితి నందను లయిన
ాక్ష హిరణ్య కశిపులై పుట్టి నారాయణుని యందు బద్ధవైరాన్ని పొంది — నిరంతరం
ే స్మరిస్తూండడం కారణంగా — ఆ శ్రీహరియే వారిని అంతం చేశాడు, ఋషుల శాప కార
వారికి మోక్షం సిద్ధించలేదు. వారే రావణ కుంభకర్ణులై పుట్టగా — రామ రూపుడైన
నారాయణుడే వారిని అంతం చేశాడు, శ్రీహరి దేవునే ధ్యానిస్తూ వారు శరీరాలను విడిచి
. వారే యిప్పుడు శిశుపాల దంతవక్త్రు రూపాలలో ఉంటూ కృష్ణ భగవానుని యందు
రం కలవారై నీ సమీక్షంలోనే దేహాలను కృష్ణార్పణం చేసే భగవంతునిలో లీన
రు. కృష్ణుని యందు శత్రు భావం కల వారందరూ కూడ అంతం వరకూ కృష్ణ నామ
చేస్తూ ఉండడం వల్ల పాప దూరులై భ్రమర కీట కన్యాయంగా కృష్ణ రూపు లయ్యారు.

